# తీరని బాకీ

[ 8 ప్రఖ్యాత మళయాళ నాటికల అనువాదాలు ]

సంకలనం : కుట్టిపుజ కృష్ణపిళ్లై

అనువాదం : పుట్టపర్తి నారాయణాచార్య



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

First Edition; 5000 copies
November 1959

# THEERANI BAAKEE

(EIGHT MALAYALAM PLAYS IN TELUGU)

*Compiler* :

Kuttipuzha Krishna Pillai

*Translated by* .

Puttaparti Narayanacharya



*Published under the auspices of*

**The Southern Languages Book Trust, Madras**

**Telugu 44**

**PRICE: RS. 2-25**

*Published by* :

Adarsa Grandha Mandali; Vijayawada.

*Printed at* :

**Victory Press, Vijayawada**

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండేపుస్తకాలప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపచేసింది. ఆ ప్రచురణవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్లు ఈపుస్తకాలను శ్రద్ధగాఎన్నికచేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు, వారుచేసిన ఘనకార్యాలు వివరించేగ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒకశాఖ. మన దేశశ్రేయస్సు కోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడివున్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వా రెన్నెన్ని పాట్లుపడినది ముందుతరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం—ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభివర్ణించేగ్రంథాలుకూడా ఇందులోఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలనుగురించిన ఈగ్రంథాలు

ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్యభాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషాపుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రంగతిని సంఫలంకాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు
7-10-58

ఎ. ఎల్. ముదలియార్
వైస్ ఛాన్సెలర్
మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఉపోద్ఘాతము

సాహిత్యమందు - ప్రధానమైన స్థానము నాక్రమించుకొన్నవి నాటకములే ! భారతీయసాహిత్యములనేగాక - విశ్వసాహితీమార్గముల నవలోకించినను - తేలున దీ విషయమే! ప్రతిభాషయందు - నాటకకర్తలు మాత్రమే మహారథులుగ నున్నారు. ఆంగ్లసాహిత్యమునకు - అనర్ఘమైన సంపద 'షేక్స్పియర్' నాటకములే ! గీర్వాణసాహిత్యమునను గొప్ప ఘనత నార్జించికొన్నది - కాళిదాసమహాకవి విర్మితమైన "అభిజ్ఞానశాకుంతలము." అది నాటకమే. ఈ రెంటియందేగాక - గ్రీకు, జర్మన్ - మొదలగు పాశ్చాత్యభాషలయందును, తక్కిన "ఏషియా" సాహిత్యములందును - నాటకకారులకే - సాహితీ విర్మాతలలో నగ్రతాంబూలము.

మళయాళ సాహిత్యరీతి యిందుకు భిన్నముగా నున్నది. ఇందు చెప్పికొనదగినంత నాటకరచన లేదు. విశ్వసాహిత్యమందు ప్రసిద్ధమైన నాటకములతోఁ బోల్పదగిన - ఒక్కనాటకముగూడ మళయాళ సాహిత్యమున లేదన్నచో - నది సత్యదూరమైన మాట గాదు.

సంస్కృతమునుండి - మొదలు మళయాళ సాహిత్యమునకు సంక్రమించినవి - నాటకములే. వారి ప్రసిద్ధములైన నాటకములన్నియు - చక్కగా పరివర్తింపబడి - మళయాళ భాషలో సాక్షాత్కరించినవి. కాని - వానిలో నేదియు రంగస్థలముపై - ఆడిచూపించుటకు సాధ్యమైనది లేదు. కేవలము - చదువుకొని యానందపడుటకు మాత్రమే యవి పనికివచ్చును. "మృచ్ఛకటికము" "శాకుంతలము"వంటి నాటకములు - అరుదుగా రంగస్థలముపై నభినయించిన సన్నివేశములున్నవి. కాని- అభినయయోగ్యములుగా నవి రక్తికిరాలేదు. రసికులు చదువుకొని యానందింపవలసిన సాహితీ గ్రంథములుగా మాత్రమే పనికివచ్చినవి.

ఆంగ్లేయుల సాహచర్యముతో మనలో - రంగస్థలయోగ్యమైన కొంత రచన యారంభమైనది. కాని యా కథావస్తువులన్నియు వారిమతమునకు సంబంధించినవి. అట్టివానిలో జేరినదే. "జెనోవా" యను నాటకము

గూడ. ఈ రచన రంగస్థలముపై ప్రదర్శింపబడి యెందరోజనుల నాకర్షించినది. చదువుకున్నరసికులుగూడ - యీ నాటకమునుజూచి - సంతోషించిరి. సామాన్యజనుల హృదయముల నాకర్షించుటలో దీనికున్నశక్తిని గమనించి - అట్టిదేయగు 'మరియమ్మ'యను మరియొకటి వ్రాయబడెను. ఇదిగూడ పైదానివలెనే - ప్రేక్షకుల నెక్కువ యాకర్షించినవి. కాని - ఈ రెండింటిలోని సాహితీగౌరవము మాత్రము పొగడదగినంత గొప్పది కాదనియే చెప్పవలెను. 'జెనోవా' నాటకము తరువాత - తమిళదేశము నుండి - సంగీతనాటకములు కొన్ని కేరళమునకు వచ్చెను. వీనిలో విశేష ప్రాధాన్యము సంగీతమునకు మాత్రమే. అవి - తమ సంగీతప్రభావముచే ప్రేక్షకుల నాకర్షించెనుగూడ. వాని ననుకరించిన కొన్నిసంగీతనాటకములు మళయాళ సాహిత్యమునందును బుట్టినవి. కాని వానిలో సాహిత్యగుణములు సన్నగిల్లినవి. అందుచేత నాటకరచన - సామాన్యజనుల కెంత యాకర్షకముగనున్నను - సాహితీరసికుల యాకలిని మాత్రము తీర్పలేక పోయినది.

ఆంగ్లవిద్యాభ్యాసము దేశమున హెచ్చినకొలదియు - ఆ నాటకములు కేరళములోని కెక్కువగా ననువర్తింపబడెను. సంస్కృతమును పఠించినవా రా భాషలోని నాటకములను మళయాళములోనికి గొనివచ్చుటకు శ్రమించినట్లే - ఆంగ్లవిద్యాధికులును - ఆంగ్ల నాటకములను పరివర్తించుట కెక్కువ శ్రద్ధ కనుబఱచుచువచ్చిరి. ఆ రీతిగ కొంత నాటకరచన మన భాషలోనికి వచ్చెను. ఏమైనను - అది భాషాంతరీకరణమే. మూలములోని సౌందర్యమును - పూర్తిగా కొనితెచ్చుటకు రచయిత యెంత సమర్థుడైనను సాధ్యముగాదు. అందుచే కేరళీయులు - భాషాంతరీకరణములను వదలి యనుకరణకుబూనుకొనిరి. తత్ఫలముగ కొన్ని-ప్రహసనములు, చారిత్రక నాటకములు వచ్చెను. "రాజాకేశవదాసు" "సీతాలక్ష్మి" "వేలుత్తంబిదళవా" మొదలైనవా రిట్టి ప్రయత్నముల నొనర్చినవారే.

కొన్నివర్షములనుండి "ఇబ్సెన్" ప్రభావము - మళయాళనాటక సాహిత్యచరిత్రలో నెక్కువగ గన్పించుచున్నది. నాటకసాహిత్యమును గూర్చిన యనేక చర్చలుగూడ రేగినవి. నాటకములు జూచువా రెక్కువయైనారు. క్రొత్తక్రొత్త రచనలును గావలసివచ్చినవి. కథావస్తువెట్టిదిగావలెను? దాని పరిణామ మెట్లుండవలె?" నను తీవ్రచర్చలు బయలుదేరెను. తత్ఫలముగ నూత్ననూత్నములైన సామర్థ్యములను ప్రకటించు రచయితలు దయారైరి. అంతవరకును నాటకసాహిత్యములేని మళయాళీలు నేఁడు "కేరళీయులకు నాటకరచన మొక ప్రధానాంగము" అనుస్థితికి వచ్చినారు. ఇంతకును వారి కుజ్జ్వల భవిష్యత్తు ముందున్నది.

ఈ పుస్తకమందు నాటకకర్తలుగా ప్రసిద్ధికెక్కిన కొందరిరచనలు జేర్పబడినవి. ఈ సంకలనమున చేర్పబడిన రచయితలందరు - ప్రసిద్ధులే, కాని - యివిమాత్రమే - కేరళీయ రంగస్థలమునకు సంపూర్ణముగా - ప్రతినిధులని చెప్పుటకు వీలులేదు. ఇవి యొకరీతిగా మళయాళ రంగస్థల ప్రగతిని సూచించు సాధనములు మాత్రమే. హిమవత్పర్వతములను పటములో జూపించినట్లు.

సామాన్య జనుల చిత్తవృత్తులను సంస్కరించి- వారిలో రసికతను బెంపొందజేయుటకు ప్రధానసాధనములు నాటకములు. సాహిత్యమందును - వాని స్థాన మద్వితీయమని ముందే మనవిచేసితిని. జనుల కళాభిరుచులను బెంపొందింపఁజేయుటలో నాటకములకున్న శక్తి యద్వితీయమైనది. ఒక కళాభిరుచి మాత్రమే గాదు. వారిలోని మనుష్యత్వమును మేల్కొల్పుటకు గూడ నవియే సాధనములు. ఇంతటి మహత్తరములైన - బాధ్యతలను నిర్వహించుచున్న నాటకరచన క్రమక్రమాభివృద్ధినందవలెనని యాశింపక యూరకుండుట కే రసికులకును సాధ్యముకాదు గదా!

# దీనిలోని నాటికలు

శాలోమి

రచయిత:

సి. జె. థామస్

ఇతడు నాటకరచయితమాత్రమే గాదు. నాట్యరంగ సంస్కారమునకు సూత్రధారిత్వం వహించిన గొప్పవిమర్శకుడుకూడ. "ఉయరున్న యవనిక" అనే విమర్శనాగ్రంథం చాలా ప్రసిద్ధ మైనది. "అవన్ వీండుం వరున్ను" "ఆ మను ష్యన్-నీ తన్నె" మొదలైన నాటకములు సంపా దించిన కీర్తి సామాన్యమైనది గాదు. బైబిలు లోని కథలను వస్తువులుగా తీసుకొని, నాటక ములుగా రచించడంలో శ్రీ థామస్‌నకున్న శక్తి అద్వితీయము. "ఆంత్రిగణి" అనే యవన నాటకాన్ని తర్జుమాచేశాడు. "కుత్తాట్టుకుళం" ఆయన స్వదేశం. ఇప్పుడు ఆకాశవాణి తిరువ నంతపురం కేంద్రంలో ప్రొడ్యూసరుగా పని చేస్తున్నారు.

## పాత్రలు:

ప్రవాచకుడు

నర్తకుడు

హెరోద్యా

ఫెలిక్స్

శాలోమి

హెరోదస్

యోహాన్నాన్

సుంకపువాడు

భటుడు

మాలాభా

శేఖరియా

కొందరు ప్రభువులు

తక్కిన పాత్రలు

# శా లో మి

[చర్చిపద్ధతి ననుసరించి - సంగీతం జరుగుతూవుంటుంది.]

ప్రవచనకారుడు : "మరుభూమిలో - గట్టిగా - భాషిస్తూన్న వాని పలు కిది. కర్తయొక్క త్రోవ తయారుచేయండి. అతనిరాక నెదురుచూడండి. ఆతడు వచ్చునప్పుడు కోన లన్నియు భూమితో సమానమైపోవును. కొండలూ - గుట్టలూ మోకరిల్లుతాయి వక్రమైనది సరియైనదిగా నగును దుర్ఘటము సులభసాధ్యముగును. సకల జడప్రకృతియు దైవముచేత రక్షితముగును." అని యిట్లు విజయాత్మ ప్రవక్తయొక్క గ్రంథమందున్నది. దాని ననుసరించియే నేను చెప్పుచున్నాను.

[శబ్దము క్రమముగా తగ్గి అవసానించును. నగారాధ్వని యారంభమగును. కొంతసేపటికి సంగీతోపకరణములు శబ్దించును. వానితోపాటు తిన్నగా, గజ్జెలరవళి యారంభించును. నృత్యమునకు సంబంధించిన వాద్యములు, 'హెరోదస్'రంగములోనికి ప్రవేశించునంతవరకు, ఒక్కొక్కసారి గట్టిగా - ఒకసారి తిన్నగా శబ్దించుచుండును.]

నర్తకుడు : (తాళముచూపించుచూ) ఎడమవైపు.........
ఎడమవైపు......ఆ అదే......మెడ......అలానే...
వ్రేళ్ళు కూచిగా వుండాలి. ఊ! కంఠస్వరం తగ్గించు. దేవీ! రాజకుమారి యెంత వేగముగా నృత్యమును నేర్చుకొనుచున్నది!

హెరోద్యా : ఓహో! నా కూతురుగదూ.

నర్తకుడు : ఇంతకీ నాట్యమువచ్చినట్లుకాదు. (మరల)ఎడమ వైపునకు...ఆ...ఆ...మరలా...చక్కగా ఆడవలె.

[ ఒక్కరొక్కరే ప్రవేశిస్తూన్న శబ్దం. ]

ఫెలిక్స్ : భేష్, భేష్. (చేతులు తట్టును)

నర్తకుడు : ఉస్. అబ్బ!

హెరోద్యా : ఓరీ! యువకుడా! ........ నీ కిచట నేమి పని ?

ఫెలిక్స్ : ఊ! ఏంప్రశ్న అడిగావు!

హెరోద్యా : ఇది నా ప్రశ్న కుత్తరంగాదు.

ఫెలిక్స్ : నాకు కళలన్న చాల ప్రీతి.

హెరోద్యా : కళలపై మాత్రమే గదూ......చాల అదృష్టము.

ఫెలిక్స్ : నా హృదయ మసంత విశాలమైనది.

హెరోద్యా : రోమునందలి రాజవీధులవలె. (ఇద్దరూ నవ్వుతారు.)

ఫెలిక్స్ : అత్యంత పరిచయముగలవారే గదా యీ మాట అనుచున్నది!

హెరోద్యా : రోమువీథులలో తిరుగు బిచ్చగాండ్రకును, యూదురాజకుమారి కలకును వ్యత్యాసమున్నది.

ఫెలిక్స్ : అందుకొరకే గదూ—ఫెలిక్సును యిచ్చట చూస్తున్నది.

నర్తకుడు : (కొంచెంమెల్లగా) కాదు, కాదు......రెండు చేతులను చేర్చవలెను......ఓహో...... సరి...అల్లే

హెరోద్యా : ఫెలిక్స్, నీ కితడు తెలుసా?
ఫెలిక్స్ : నర్తకుడనిమాత్రం......ఈజిప్ట్ ?
హెరోద్యా : కాదు, ఇండియా. పరిచయముచేసికొనదగిన మనుష్యుడు. ఓయి పండితా? ఇతడు రోమన్ సేనాధిపతి యైన ఫెలిక్స్.
నర్తకుడు : నమస్కారము.
ఫెలిక్స్ : మంచిది, మంచిది.

[హఠాత్తుగా-గజ్జెలరవళియు-సంగీతధ్వనియు నిలిచిపోవును.]

హెరోద్యా : శాలోమీ......ఏమిది? నాట్యము నెందుకు నిలిపావు?
శాలోమీ : (కొంచెం మెల్లిగా) మీ గూఢాలోచన ఇక్కడే జరుపుకోవలెనా?
హెరోద్యా : ఏమీ లేదు. ఆడుకో.
శాలోమీ : నా వైపెవ్వరూ చూడడం లేదు. ఏమాడను?
నర్తకుడు : శాలోమీ! నేను చూస్తూనేవున్నాను.
ఫెలిక్స్ : పండితులుమాత్రమే గాదు.
శాలోమీ : ఆమాట కర్థం తెలిసింది. అదే యిప్పుడు వచ్చినబాధ.
ఫెలిక్స్ : అంటే?
శాలోమీ : ఇది కవాతుగాదు.
ఫెలిక్స్ : నిర్భాగ్యవశాత్తు............
శాలో : ఊ...అయితే, యేమైవుండేది?
హెరోద్యా : చాలు, చాలు. శాలోమీ-నాట్యమారంభించు.

[గజ్జెలరవళి. తరువాత నృత్య మారంభమగును. దానితోబాటు-మందర సుందరముగా సంగీత మారంభమగును.]

హెరోద్యా : పండితమహాశయా!

నర్తకుడు : దేవీ!

హెరోద్యా : ఈ నృత్యసంప్రదాయమునకు మీ దేశంలో గొప్ప ప్రచారమున్నదా?

నర్తకుడు : చాల యెక్కువ.

ఫెలిక్స్ : మీ దేశమున అనేకపదార్థములు ప్రచారంలోవున్నవని తోస్తుంది.

నర్తకుడు : అవును బంగారూ...కళలూ...నుతాలూ...

ఫెలిక్స్ : అంతేగాదు.

హెరోద్యా : మీ ఉద్దేశ్యమేమిటి?

ఫెలిక్స్ : పిచ్చి...ఉన్మాదం...

నర్తకుడు : ఏయ్...

ఫెలిక్స్ : ఈశ్వరుడు దండిగా తినడానికిచ్చివున్నా - వుపవాసంవుండడం, పట్టుబట్టలున్నప్పుడు తోళ్ళు కట్టుకోవడం, రాజసౌధములున్నా గుహాలలో నివసించడం......

హెరోద్యా : పండితమహాశయా! మా ఫెలిక్స్‌కు సన్యాసులంటే సరిపడదు.

నర్తకుడు : మా దేశమున పగలూ రాత్రియూ గూడనున్నవి.

హెరోద్యా : ఫెలిక్స్! నీ వింక ఓడినావన్నమాటే. సన్యాసుః లిక్కడకూడ నున్నారు. నీవు "నాసీర్"... సంప్రదాయ సన్యాసులను చూచావా?

ఫెలిక్స్ : అదృష్టవశాత్తు చూడలేదు. వా ళ్ళేంచేస్తారు?

హెరోద్యా : ఏమీచేయరు.

నర్తకుడు : మా సన్యాసులు తపస్సుచేస్తారు.

హెరోద్యా : అప్పుడప్పుడు మదపిచ్చియెత్తి తిరగడంకూడా కద్దా?

ఫెలిక్స్ : అది పోనీలే. వారేనా యీ స్నానంచేయించ డానికి పూనుకుంటూవున్నది?

నర్త : మేము స్నానముచేయుదుము. ప్రయాగఘట్టాన్ని గురించి విన్నారా!

హెరోద్యా : వినకుండావుండడమే మంచిది.

ఫెలిక్స్ : పండితా! నాకు కొంచెం నృత్యంనేర్పిస్తే బాగుం టుందనుకుంటాను.

నర్త : ఒళ్ళు బాగా త్రొక్కించుకోవాలి.

ఫెలిక్స్ : నా ఒళ్ళా?

నర్త : అదే.

ఫెలిక్స్ : ఒక రోమను సైన్యాధికారియొక్క శరీరం త్రొక్క డమా!

నర్త : అందువల్లే........అందువల్లే బాగా తొక్కాలను కుంటున్నాను.

ఫెలిక్స్ : బాగా నేవుంది. రాజకుమారీ! విన్నావా! ఎలాగైనా నేను నృత్యంనేర్చుకుని తీరాలి.

హెరోద్యా : అప్పుడు ఒంటెకు పిచ్చియెత్తినట్లుంటుంది.

[అందరూ ఫక్కుమని నవ్వుతారు. ఇంతలో 'ఫెలిక్స్-ఫెలిక్స్'

అనే మాట గట్టిగా వినపడుతుంది. 'హెరోదస్' తొందరగా నడచివస్తూన్న శబ్దం వినపడుతుంది. నృత్యం నిలుస్తుంది.]

హెరోదస్ : ఫెలిక్స్! ఏమి టీ ప్రవర్తన? రాజ్యం క్షీణించి పోతూంది. నీవుమాత్రం స్త్రీలతో చేరి ప్రొద్దులుపుచ్చుతున్నావు.

ఫెలిక్స్ : ఏమయ్యింది?

హెరోదస్ : ఏమికావాలో అదే అయ్యింది. నీవు జవాబ్దారీలేనివాడివి.

ఫెలిక్స్ : మహారాజా! నే నలావుండడమే తమకు క్షేమం గదా!

హెరోదస్ : ఫెలిక్స్!—నీవు నా వుద్యోగస్థుడవుకావు అని ఒప్పుకున్నాను. కాని, నా అధికారం 'గ్యాలిలీలో' అంత మొందినచో-యిక్కడి రోమనుసామ్రాజ్యంకూడా అవసానిస్తుంది. 'అరేత్తాస్' మన సామంతుడు కాలేదు.

ఫెలిక్స్ : ఇప్పుడా విషయంతో ఏమిపని ?

హెరోదస్ : అదే నేను అడుగుతున్నాను. 'అరబ్' దేశపు రాజునకు యూదుదేశంలో యేపనీ లేదు. కాని, అతడు దాన్ని గమనిస్తున్నట్లులేదు. అతని సైన్యంగూడ గమనిస్తున్నట్లులేదు.

హెరోద్యా : ప్రక్కవిషయాలతో ఊరికే ప్రొద్దుపుచ్చక అసలు సంగతేమిటో చెప్పరాదూ ?

హెరోదస్ : అసలుసంగతి అంతా నీవే. ఆ దుర్మార్గుడు 'మకారస్'నుంచి పలాయనమైనాడు. ఈవిషయం 'ఫెలిక్స్'కు తెలియదేమో ! నా అరబ్బీభార్య—ఆమె

తనతండ్రితో ఫిర్యాదుచేసివుంటుందేమో! ఆయన సర్వ సన్నాహాలతో బయలుదేరివుంటాడు. 'మక్కారస్'ను పట్టుకోవడానికే ప్రయత్నమంతా.

హెరోద్యా : ఎక్కడో పడివున్న అరబ్ స్త్రీలను పట్టుకొని వచ్చి, వారుచేసిన తప్పునకు నే నెలా బాధ్యురాలను? 'అరత్తాస్' మనపైకెత్తివస్తే జయించి పరుగెత్తేటట్టు చెయ్యాలి.

హెరోదస్ : అంతఃపురంలో కూర్చొని ఆజ్ఞలిస్తే పనులన్నీ తీరిపోతాయి అంతేగదూ! ఆ పని చేయడానికి సైన్యాలేవీ? యూదులు సైన్యంలో చేరడంలేదు.

హెరోద్యా : చేరకుంటే-అరబ్బురాజే మనదేశాన్ని పరిపాలిస్తున్నాడన్నమాట.

హెరోదస్ : వారికి నేనూ, అతడూ ఒక్కటే.

ఫెలిక్స్ : నీతో వాదించి ప్రయోజనంలేదు? మనం వెంటనే బయలు దేరాలి. నా సైన్యం తయారుగావుంది

హెరోదస్ : రవ్వంతగూడా ఆలస్యంచేయకూడదు. తొందరగా బయలుదేరాలి. హెరోద్యా! నేను పోయేదా?

హెరోద్యా : ఎక్కడికి?

హెరోదస్ : మక్కారసుకు.

హెరోద్యా : నేనూ వస్తాను.

హెరోదస్ : ఎందుకూ ? అరెత్తాసునుపట్టుకొని ఓడించడానికా ?

హెరోద్యా: (కోపంగా) నేనూ వస్తానంటున్నాను విన్నావా!

హెరోదస్! నేనూ వస్తానంటున్నాను. నేను రావడ మెందుకో నాకు తెలుసు. మాట్లాడుతున్నది హెరోద్యా.

[ శబ్దం క్రమంగా తగ్గిపోతుంది ]

[ఒక సార్థవాహసంఘం బయలుదేరుతూన్న ప్రయాణకోలాహలం. ఒంటెల మెడలలోవి గంటల గలగలలు, రథాలశబ్దాలు, ఆయుధాలధ్వనులు. "ఏయ్ ఇక్కడ" "ఏయ్ ఎక్కడ?" "శంబలూర్" "వేగం వేగం" "రాజు బయలుదేరుతున్నాడు, "నఫ్తాలీ" "అది వుందనీ"అని అనేకులు మాట్లాడే శబ్దాలు వినపడుతున్నాయి. వెనుక పదాతిసైన్యం నడుస్తూన్నధ్వని. సమర సంగీతం వినబడుతూంది. "మకాన్సిల్‌కు పోవాలి" "అరెత్తాసును చంపాలి"మొదలైన గర్జనలు వినపడుతున్నాయి. అతికోలాహలంగా సైన్యం నడుస్తూంది. క్రమంగా శబ్దాలుతక్కువై - రథచక్రాలచలనధ్వని మాత్రం వినపడుతూంది. కొంచెంసేపైనతరువాత]

ఫెలిక్స్ : శాలోమీ !

శాలో : ఊఁ...

ఫెలిక్స్ : ఏమైనా చెప్పు.

శాలో : ఊఁ...

ఫెలిక్స్ : "ఊఁ" అనడం సంభాషించడంగాదు.

శాలో : ఊఁ...

ఫెలిక్స్ : అవునంటావా, కాదంటావా ?

శాలో : ఊఁ...

ఫెలిక్స్ : శాలోమి నన్ను పరిహాసంచేస్తూంది.

శాలో : ఊఁ...

ఫెలి : నాపైన కోపమా ?

శాలో : ఊఁ...

ఫెలి : (సవికారంగా) శాలోమీ! శాలోమీ!

శాలో : (ఎక్కువ గట్టిగా) ఏమి? (మరలా సాధారణ ధ్వనితో) అబ్బ! ఎంత కామము! ఒక్కనిముషం వూరికే వుండనివ్వరుకదూ?

ఫెలి : క్షమించు. రాజకుమారి మనస్సులో యేదో విషాదం ఆవరించుకొని ఉన్నదని తోస్తున్నది. నాతో చెప్ప కూడదూ?

శాలో : ఫెలిక్స్! మీరు నన్ను వేధించకుండా వుండండి. అంతే నాకు కావలసింది.

ఫెలి : శాలోమీ! ఇంత, తొందరగా నీమనస్సులో విషాదం ఆవరింపజేసే సంఘటన యేమి కలిగింది? ఇంతవరకూ నన్నింతో ఆ ప్రునివలె చూచేదానివి. నేను నా జవాబు దారీకూడా మఱచి...

శాలో : నీ జవాబుదారీని వుపేక్షించమని నేను చెప్పానా? స్త్రీలంపటుడైన యీ రాజును రోమన్ జనులు కొరత వేస్తేమాత్రం నాకేమి?

ఫెలి : అయితే, ఇప్పుడువచ్చిన కష్టం యేమిటి?

శాలో : కష్టమేమని చెప్పను? ఆడవాళ్ళనుకూడా వెంట్ల తీసుకొని యుద్ధాలకు...

[ ఉమ్మివేస్తున్న శబ్దం ]

ఫెలి : దానికి నేనా వుత్తరవాదిని?

శాలో : ఉత్తరవాదు లెవరని అడిగానా?

ఫెలిక్స్ : శాలోమీ! ఇలా నీవు కోపగించుకోరాదు. వెనక్కు

చూాడు. ఆ రథంలో మీా తల్లియు-'హెరోదస్' యెంత రమ్యంగా కూర్చొని.........

[శబ్దం విలిచిపోతుంది]

హెరోద్యా: దానికి ముందు కావలిసింది, ఈ ప్రభువులను పిలిచి విందుచేయడం.

హెరోదస్: రాజకార్యాలు వేశ్యాలయాలవలె కాదు నిర్వహింపబడేది.

హెరోద్యా: నే నొక్క-మాటా పలుకలేదు. ఇంతలోనే ముందుగానే అనవలసినమాటలన్నీ అనివేస్తున్నారు.

హెరోదస్: ఆ పనంతా నేను విచారించుకుంటాలే.

హెరోద్యా: 'అరెత్రాస్' బిడ్డపైన ప్రీతి యింకా పోలేదు కదూ?

హెరోదస్: పోకుంటేమాత్రం తప్పేముంది? ఆవిడ 'ఫాగార్' సంతతికి చెందినది.

హెరోద్యా: అది సరేకాని, మనకు దొరుకబొయ్యేది బిడ్డ గాదు, ఆవిడతండ్రి.

హెరోదస్: అయితే—వాణ్ణి ఓడించి-రాజ్యాన్నీ, భర్తనూ రక్షించు. 'క్లియోపాత్రా' అలా చేసిందని విన్నాను.

హెరోద్యా: ఇలా ఒకొ్క్కక్క విషయం చెప్పికొని లాభమేమిటి? మనసైన్యం చాలా చిన్నది. జనులకు మీాపై ప్రీతిలేదు.

హెరోదస్: కాని కొంతమందికి నేనంటే చాలాప్రీతి. మన పని కది చాలు.

హెరోద్యా: న న్నెవరూ 'గుంటనక్క' అని పిలవటంలేదు.

హెరోదస్ : నా బిరుదావళి పఠించడానికి – రోమునగరవీధు లలో వుండే ఒక బిచ్చగత్తెను పట్టుకొనిరావలసినపని లేదు.
హెరోద్యా : ఒంటెలపై బ్రతికే జాతి యేమైనా అంటుంది.
హెరోదస్ : హెరోద్యా! నిష్కారణంగా కలహాన్ని సృష్టించ వద్దు.
హెరోద్యా : ఇంతకూ కలహానికికారణం నేనయ్యానన్న మాట! పోనీలెండి, నా అదృష్టం యిలావుంది. కానీ, మీ రేమిచెప్పినా–యీ ప్రభులతో చేరకపోతే మనకు సైన్యాలు గిట్టేటట్టులేదు. వానిని ఎలాగైనా వశపరచు కోవాలి.
హెరోదస్ : అది నా భార్యయొక్క సౌందర్యసహాయంతో గాదు.
హెరోద్యా : నే నేమన్నానని? వారికి రోముఅంటే ద్వేషం "స్వాతంత్ర్యమునకు పోరాడవలెనని" చెప్పితేనే, వారు మనతో సహకరిస్తారు. కాకుంటే వేరేమార్గ మేముంది?
హెరోదస్ : అంతేనా! (ఒక పెట్టెపైన గట్టిగాకొట్టి)–ఇదే మార్గం. యూదులను వెచ్చించిగాని–జయించుటకు మార్గం లేదు. జనులు కనపడినచోట–ఆగుంపులను పారద్రోలాలి.
హెరోద్యా : అయితే. డబ్బంతా ముగింపబడుతుందన్న మాట.
హెరోదస్ : గాలిలీలో ఇంకా డబ్బుంది.
హెరోద్యా : ఉండవచ్చు. కాని, అది మనకు లభించాలనే పట్టుదల నాకు లేదు.
హెరోదస్ : నాకున్నది.

హెరోద్యా : లభిస్తుందని అనుకుందాం. కాని, ఏదో ఒక ఆదర్శాన్ని చెప్పడమే మేధాశాలిత్వానికి లక్షణం. స్వాతంత్ర్యమనేమాట వింటూనే వొళ్ళు పులకరిస్తుంది.

హెరోదస్ : చిలుకలాగా చెప్పినదానినే మరల మరల చెప్తున్నావ్. స్వాతంత్ర్యం రాబోతున్నదని చెప్పినదానివల్ల సాధించే గుణమేమీ లేదు.

హెరోద్యా : ఎందుకు చెప్పకూడదు? ఏమైనా రహస్యముందా?

హెరోదస్ : రహస్యం కాదు. కొన్ని కొత్తచిక్కులున్నాయి. స్వాతంత్ర్యానికి సంబంధించిన కార్యాలన్నీ వాళ్ళు 'మిసిహా'కు ఒప్పగించారు 'మిసిహా'నుమాత్రమే వాళ్లు అనుసరిస్తారు. కాని, 'మిసిహా' ఎవరోమాత్రం వాళ్ళకు తెలీదు. వాళ్ళు 'మక్కావీయర'దాటి నడచారు. అలాగే మరికొన్నిటినీ దాటారు. అలా తిరిగి సాధించినవస్తువులన్నీ శాపదళితాలైన కంఠశకలాలు. వారిహృదయాలు నిరాశాపూరితాలైనాయి. వారితో స్వాతంత్ర్యమనే మాట చెప్పడమా! అందులోనూ నేను!

హెరోద్యా : మీరెందువల్ల 'మిసిహా' కారాదు?

హెరోదస్ : ఏమిటీ! నేను మిసిహానా? ......అదే.... అదొక విద్య...ఎందుకు కారాదు? హెరోద్యా!... నీవు బుద్ధిమంతురాలవు. నీవు బుద్ధిమంతురాలవేగదూ?

హెరోద్యా : నా భర్త చక్రవర్తి కావాలి.

హెరోదస్ : చక్రవర్తి కావాలనే అభిప్రాయం నాకు లేదు.

హెరోద్యా : తమరు చక్రవర్తికావాలి. అంతే.

హెరోదస్ : కాని............. హెరోద్యా !

హెరోద్యా : ఏమిటి ?

హెరోదన్ : అది యెక్కువ ఆపత్కరమైనమార్గం.

హెరోద్యా : ఆపద యెక్కడుంది? జనులు నమ్మరంటారా ?

హెరోద్యా : అదికాదు, రాచరికమున్నదానివల్ల జనులను నమ్మించవచ్చు. కాని, యీ దుర్వార్త రోముకు ప్రాకితే నా తలపోతుంది.

హెరోద్యా : సరే, అయితే—యీ భావాన్ని యెవరో రోముకు మోసుకుపోతారంటారు ?

హెరోదస్ : ఫెలిక్సుయొక్క ఉద్యోగం ఏమంటావు?

హెరోద్యా : ఇదివర కేమిటో నాకు తెలీదు. ఇప్పుడు మాత్రం నర్తకుడు.

హెరోదన్ : నర్తకుడా!

హెరోద్యా : అవును. అతనివిషయంలో మీరేమీ భయపడకండి అది నేను చూచుకుంటాను.

హెరోదస్ : ఆ ఏర్పాటు నా కిష్టంలేదు.

హెరోద్యా : ఏమిటి? నేను చూచుకోవడమా? అయితే భయపడ్డారన్నమాట. రోమన్‌యువకు లంత సమర్థులయితే-నేను 'గాలిలీ' కెందుకు పోయేదాన్ని?

హెరోదస్ : నీవూ—నీ రోమ్ దేశమూ.........నిలుపు.

హెరోద్యా : ప్రాణనాథా! భయపడకండి. ఆ కార్యం మన శాలోమీ చూచుకుంటుంది.

హెరోదన్ : ఆ పని చూచుకోవడానికి వేరేవారున్నారు.

హెరోద్యా: సరే, యిక మార్గ మాలోచిస్తాం. రథము నిలుపుమని చెప్పండి. నేను ఫెలిక్స్‌రథంలోకి పోతాను. శాలోమీ యిక్కడికి వస్తుంది.

హెరోదన్: హెరోద్యా, నన్ను క్షోభపెట్టకు.

హెరోద్యా: ఓహో! ఆ నదీతీరంలో ఏమిటా మనుష్యుల గుంపు! మనం డబ్బు వెదజల్లాలి.

హెరోదన్: నిలు నిలు. అదేమిటో కనుక్కుంటాను. (కొంచెం గట్టిగా) 'అంబీశాయీ' రథాలు నిలుపు!

[కలకలధ్వనులు వినిపించును. రథములచలనము-సంఘగానముగూడ నిలుస్తుంది; యోహన్నాన్ దూరంనుండి]

"మరుభూమిలో గట్టిగా భాషిస్తూన్నవాని పలుకిది. కర్తయొక్క త్రోవ తయారుచెయ్యండి. అతనిరాక నెదురుచూడండి. అతడు వచ్చునప్పుడు కోనలన్నియు భూమితో సమానమైపోవును కొండలూ-గుట్టలూ మోకరిల్లుతాయి. వక్రమైనది సరియైనదిగా నగును దుర్ఘటము సులభసాధ్యమగును. సకల జడప్రకృతియు దైవముచేత రక్షితమగును."

హెరోదన్: 'యోహన్నాన్' అని తోస్తూవుంది.

హెరోద్యా: స్నాపకుడా!

హెరోదన్: అవును.

హెరోద్యా: ఈకాలం 'మిసిహా'లకు కోతకాలంవలె వుంది.

హెరోదన్: మనం సద్దుచేయక కొంచెం దగ్గరగా పోయి నిలుచుందాము.

[రథం కదలుతున్నశబ్దం]

యోహాన్నాన్ : (ఇంకా గట్టిగా)సర్పములారా! వచ్చుచున్న కోపంనుండి తప్పించికొని-దూరం పరుగెత్తికొనిపోవుట మీకు నేర్పిన దెవ్వరు? మనస్సుమారినదానికి ఫలము చూపింపుడు. 'అబ్రహాం' మన తండ్రియని మనస్సుతో భావించుటకు మనము జంకరాదు. అతడు దైవశక్తిసాహాయ్యముతో నీ శిలాగణములనుండి శిశువులను సృష్టించగలడు. ఇది నిజము. ఇప్పుడే వృక్షములమూలములకు గొడ్డళ్ళు తగిలింపబడియున్నవి. మంచిఫలములు కాయని వృక్షములన్నియు ఖండింపబడును. అగ్నిలో వేసి దహింపబడును.

ఒకపాత్ర : గురూ! నీవు 'ఎలియా'వా?

యోహాన్నాన్ : కాదు;

ఇంకొకపాత్ర : లేక 'మిసిహా'వా?

యోహాన్నాన్ : అదీకాదు.

మూడవపాత్ర : మేము ఎదురుచూస్తూవుండే రక్షకుడవు నీవేనా? ఎక్కడినుండియో నడచివస్తున్నావా?

యోహాన్నాన్ : కాదు కాదు. నేను కేవల మనుష్యుడను. వేగుచుక్కవంటివాడను, రాబోవు దివ్యప్రభాతమునకు సూచకుడనుమాత్రమే! నేను మిమ్ము నీటితోమాత్రమే స్నానముచేయింతును. నాకంటెను సమర్థుడైనపురుషుడు రాబోవుచున్నాడు. అతని కాలిచెప్పుయొక్క అట్టను గుట్టుటకుగూడ నాకు యోగ్యతలేదు. అతడు మిమ్ములను పరిశుద్ధాత్మతోను, అగ్నితోను స్నానముచేయించును. ఆ పురుషునకు చేతిలో నొక పొట్టుచెరుగు చేట యుం

డును. ఆతడు గింజ పక్వమై పనికివచ్చు గోధుమలను గదిలోవైచును. తాలు నగ్నిలోవైచి కాల్చి భస్మమొన ర్చును.

ఒకశబ్దం : మే మేమిచేయాలి?

యోహాన్నాన్ : రెండువస్త్రములున్నవాడు - ఒకదానిని వస్త్రములులేనివాని కిండు. తిండికి దండిగానున్నవారు గూడ నట్లే యొనర్పవలెను.

సుంకపువాడు : గురూ! నే నొక సుంకం వసూలుచేసే వాణ్ణి. నాకు వేరే ఆదాయమేమీ లేదు. నా కేమైనా తరించడానికి మార్గముందా!

యోహాన్నాన్ : విధింపబడిన సుంకమునకంటె ఎక్కువగా గ్రహింపకుము. ఆ న్యాయ మొక్కటి చాలును.

భటుడు : మేము సైన్యములోనివారము. మాకు?

యోహాన్నాన్ : కొల్లగొట్టకుడు. మోసగింపకుడు, న్యాయముగ లభించుదానితో తృప్తిజెందుడు.

హెరోద్యా : (రహస్యంగా) దండువారున్నారు. మనం కొంచెం డబ్బువిసరివేస్తాం. వాళ్ళమనస్సు లెలావుంటాయో కనిపెడదాం.

హెరోదస్ : నిజమే. అలాగే చేస్తాం. కాని, యీ ఉపదేశకుడు కోపగిస్తాడేమో!

హెరోద్యా : లేదు......ఎవరుగాని మనలో చేరకుండా పోలేడు. డబ్బుగదా! మీరు లేచి మాట్లాడాలి.

హెరోదస్ : (అనిష్టాన్ని సూచిస్తూనే గట్టిగా) ఓ నా జనులారా! ఇశ్రాయిలారా! లేవండి. 'అరెత్తాస్' మన

దేశము నాక్రమించినాడు. ప్రతి యూదుడూ కత్తిపట్ట వలసిన సమయంవచ్చింది. అందరు 'మక్కాబీయులు'...

[డబ్బువిసరివేసిన శబ్దం. జనులు దానిని తీసుకోవడానికి తంటాలు పడుతున్నశబ్దం]

యోహాన్నాన్ : ఏమిది? (ఎక్కువ గట్టిగా) ఊరుకోండి. (జనమంతా వూరకుంటారు.) ఓ పిశాచసంతతులారా! ఈ ధనమంతయు నెవ్వరిది? నిన్న మీ దేశమందే కొల్ల గొట్టబడినది. దానిని నేడు మీ ముందు విసరివేయు చున్నారు. ఇక మీరో! పిచ్చియెత్తిన పందులవలె - ఆ డబ్బు గ్రహించుటకు మానమువిడచి బాధలుపడుచు న్నారు. సిగ్గులేని జనులారా! మీ రిక నెట్లు రక్షింప బడుదురు! (కొంచెమాగి) హెరోదన్! నరహంతకుడా! ఫిలిప్స్‌భార్యయైన యీ రాజకీయవేశ్యను స్వాయత్త పరచుకొన్న మృగమా! నీ ధనప్రతాపము ప్రదర్శించు టకు తగిన స్థల మిదేనా! నీ సైన్యముల నడపించుటకు యోగ్యమైనది యీ పవిత్రస్థలమేనా! హెరోదన్! భూమిపై బ్రదికిన యే సైన్యములును నిన్ను రక్షింపలేవు. ఎన్నో సంవత్సరములకుముందే, శపింపబడిన ప్రాణివి నీవు. నీశరీరమును పురుగు పుట్ట వేధించుకొని తినెడు కాలము దూరము లేదు.

[జనులు గట్టిగా అరుస్తారు. 'రాజద్రోహీ!' 'మోసకాడు' 'దొంగ' 'వేశ్య' మొదలైనశబ్దాలు వినిపిస్తాయి. హఠాత్తుగా రథాలుకదలడాని కారం భిస్తాయి.]

యోహాన్నాన్ : మంచిఫలము లివ్వని చెట్లన్నియు నరుక బడును. అగ్నిలో వేసి దహింపబ........

హెరోదస్ : (రథంయొక్క ధ్వనిలో) ఇలాగా నాకు 'మిసిహా' గావలిసిన అవకాశంగూడా తప్పిపోయింది.

హెరోద్యా : ఊ.........(తనలో) అగ్నిలో వేసి దహింపబడును. (కొంచెం స్పైనతరువాత)

ఒకడు : ఆ ఉపదేశికు డెక్కడనించి వస్తున్నాడు?

ఇంకొకడు : వినలేదా యేమిటి? ఈ కథ ప్రసిద్ధమయ్యింది కదా!

ప్రవాచకుడు : అంబియా దేశంలో–సేఖరియా అనే ఒక సత్పురుషు డుండెను. అతనిభార్య 'అహరోన్' యొక్కబిడ్డలలో నొకతె. ఆమె పేరు ఎలిజబెత్. ఆ భార్యాభర్తలిరువురు పరిశుద్ధజీవులు. నీతిగలవారు. భగవంతు డేర్పరచిన న్యాయసూత్రములను దాటక బ్రదికెడువారు. దోషములేనివారు. ఎలిజబెత్తు మాచకమ్మ. వారికి సంతతి గలుగలేదు. భార్యాభర్తలిద్దరికీ వయస్సు గడచెను. సేఖరియా న్యాయముప్రకారం దైవసన్నిధిలో పురోహితుడై శుశ్రూష చేయుచుండెను. పౌరోహిత్యమర్యాదననుసరించి భగవంతునియెదుటికి పోయి, ధూపసమర్పణ సలుపవలసినవంతు తనకువచ్చెను. భగవంతునకు ధూపసమర్పణముచేస్తున్నప్పుడు జనసమూహమంతా ముందు నిలువబడి ప్రార్థిస్తుండిరి.

[దేవాలయంలో ప్రార్థనయొక్కయు, ఆర్గన్ సంగీతముయొక్కయు శబ్దం ఆరంభమౌతుంది. అప్పుడు దేవదూత బలిపీఠమునకు కుడివైపున....]

మాలాఖా : శేఖరియా! భయపడకు! నీ ప్రార్థనలు ఫలించినవి. భగవంతునినుండి దాని కుత్తరము వచ్చినది.

ఎలిజబెత్తు గర్భవతియై, యొక కుమారుని ప్రసవించును. అతనికి 'యోహాన్నాన్' అని పేరుపెట్టుము. అతనిజన్మ ముతో నీ కుల్లాసమును, సంతోషమును కలుగును. నీవే గాదు, చాలమంది కాతని జన్మ ముత్సాహమును కల్గించును. అతడు ద్రాక్షరసముగాని, మద్యముగాని త్రాగడు. తల్లిగర్భమందుండగనే పరిశుద్ధాత్మడై జన్మించును. ఆ యోహాన్నాన్ ఇశ్రాయల్‌లోని యనేకమందిని దైవమున కభిముఖులనుగా నొనర్చును. అతడు పురోహితుల హృదయములను మార్చును, నాస్తికులను నీతిమంతుల నొనర్చును. సన్మార్గులను రక్షించును. ఆ మహాపురుషుడు ఏలియాయొక్క ఆత్మశక్తితో, సామర్థ్యముతో బ్రివర్తించును.

శేఖరియా : దీన్ని నే నెలా నమ్మడం? నేను వృద్ధుడను. నా భార్యకూడా వయస్సుచెల్లినది.

మాలాఖా : నేను దేవదూతనైన 'ఇబ్రియేలును'. ఈ సువార్తను నీకు తెలుపుటకును, నీతోడ సంభాషించుటకును దేవదూతలు నన్నంపిరి. తగినసమయమున నిర్వృతిగొనివచ్చు నా మాటను నీవు శంకించితివి. కానిమ్ము. నేను చెప్పిన సన్నివేశము సంభవించువఱకు నీవు మౌనము వహింపుము.

(దేవాలయశబ్దములు నిలిచిపోవును.)

ప్రివాచకుడు : దినములు గడచెను. ఎలిజబెత్తు గర్భవతియయ్యెను. ... ... నవమాసములు గడచినమీదట నామె యొకకుమారుని గన్నది...... పుట్టిన యొనిమి

దవరోజు తండ్రి కుమారుని పరిశుద్ధాత్మనొనర్చుటకు తీసికొనివచ్చెను. పురోహితుని పేరువలెనే - తండ్రి ఆ శిశువునకు 'శెఖరియా' యని పేరుపెట్టదలచెను. తల్లి- 'యోహన్నాన్' అని పిలువవలెనని చెప్పెను...... ఏమి పేరుపెట్టదలచితివని పురోహితుడు తండ్రిని - సన్నలచే నడిగెను. అత డొక వ్రాతపలక తీసికొని—

శెఖరియా : యోహన్నాన్.

ప్రవచనకారుడు : అని వ్రాసెను.

[ పలుశబ్దములు 'యోహన్నాన్' 'యోహన్నాన్' అని పలికినవి. క్రమముగా నా శబ్దం తగ్గుతుంది. కొంతసేపైన తరువాత ]

హెరోద్యా : ఈవిషయం యెన్నిసార్లు నేను చెప్పాలి? ఆ పిచ్చివానిని జైల్లో వేయండి !

హెరోదస్ : సాధ్యంగాదు.

హెరోద్యా : సాధ్యంగాదా! కాదా! ఈమాటలు చెప్ప డానికి సిగ్గులేదూ! తమరు గాలిలీరాజుగాదూ! మీరేనా భయపడుతున్నది? వానిని జైల్లో వేయండి! కావలిసివస్తే చంపండి. లేకుంటే మన కొక సైనికుడుగూడా దొరకడు.

హెరోదస్ : ఇండ్లలోవుండే ఆడవాళ్ళ కొకొక్కరికి చెప్పుదాం.

హెరోద్యా : చెప్పడంమాత్రమేగాదు యుద్ధంకూడా చేస్తాము

హెరోదస్ : నాతోకదూ!

హెరోద్యా : ఏమి టీ ముకోపం! ఇలాఅయితే చక్రవర్తి అయినట్లే!

హెరోదస్ : నేను చక్రవర్తికావాలని నాకులేదు. ఉన్న రాజ్యం సంరక్షించుకుంటే చాల్లు.

హెరోద్యా : అదికూడా సుగతీతంకాకుంటే.

హెరోదస్ : పోనీలే. అదికూడా అక్కరలేదు. నీ విరోధం తీర్చడానికి నేను – నా సింహాసనం కుదువబెట్టదలచుకో లేదు

హెరోద్యా : అది నాకు తెలుసు. సింహాసన మెందుకూ ? మీరు నాకోసం ఒక మంటిముద్దకూడా ఖర్చుపెట్టరని నాకు తెలుసు. ఆనాడు రోము దేశములో...... కామ వికారం పైకొన్నప్పుడు పలికిన యేమాటకుకూడా నేను వెలకట్టలేదు. ఆ కోర్కెలుతీరడాని కెదురుచూడడం కూడాలేదు. నే నిచ్చినసలహాలు నాకోసంకూడా కాదు కాని, పిరికివాండ్లకు నా మాట లెలా అర్థమవుతాయి?

హెరోదస్ : దుర్మార్గులారా!, నాకుకావలిసిన వైభవాలన్నీ కూడా నాకు యిప్పటికే వున్నాయి.

హెరోద్యా : గొప్పలుచెప్పుకోవడం బాగా నేర్చుకున్నావు! 'ఫిలిప్స్' కీమాత్రం చదువురాదు. రోములో యీ నా పాదములు నాలుకలతో నాకి తుడుస్తూ కాలంగడుపు తున్నప్పుడు మరికొంతమందికికూడా యీ ధైర్యంవుండేది కాదు.

హెరోదస్ : కులటా !

హెరోద్యా : 'అంతిపెట్రా' అంతఃపురంలోనే కులటలు ధారాళముగా నివసిస్తున్నారు. సహోదరులరక్తములను త్రాగు దుర్మార్గులు వారే. అనవసరముగా మాట్లాడకు. హెరోదస్! నేను నీ అరబ్ దేశ ప్రేమికురాలివలె ఆశప్ప వలె – భయపడి పరుగెత్తిపోయేదానినిగాను, నేను –

గాలిలీరాణిని! తెలిసిందా? ఆ యవకాశమునకు సీజర్ సమ్మతించునా! అని నేనెరుగవలె

హేరోదస్ : అతనితో ఫిర్యాదుచేయబోవుచున్నది, సీజర్‌కు విరుద్ధంగా గూఢాలోచన జరపినయావిడ.

హేరోద్యా : అది నడిపింది యెవరికోసం?

హేరోదస్ : హేరోద్యా ! నాకు చక్రవర్తి కావలిసిన ఆశ లేదని ముందే చెప్పాను. మాటిమాటికీ నన్ను వేధించకు. నాకు కోపంవస్తుంది.

హేరోద్యా : (ఉమ్మివేసి) ఎన్నిపురుగులకు కోపంవస్తుందో నీకు తెలుసా? చూస్తాం అదికూడా !

హేరోదస్ : హేరోద్యా !

హేరోద్యా : ఓ! ఆ చూపులు! భయం కలిగిస్తున్నాయి. (గట్టిగా నవ్వుతుంది.)

హేరోదస్ : హేరోద్యా ! (అరుస్తాడు.)

హేరోద్యా : ఓహో! ఏమి కృత్రిమగర్జన! దీనిని క్రొత్తగా విన్నాను. ఈ వింతకు కారణం మీ పితామహులరక్తంలో నక్కలరక్తం చేరడమే. (మరలా గట్టిగా నవ్వుతుంది.)

హేరోదస్ : వేశ్య! ఇక చాలించు నీ ప్రసంగము!

హేరోద్యా : ఏమి ధీరత్వము! ఓరీ మనుష్యా! నేను ఫిలిప్‌ను విడిచివచ్చింది, నీ సౌందర్యాన్ని చూచి కాదు. చెవులు తెఱచి బాగా విను. వానికి మగసిరి లేకపోవడంతో వచ్చాను. నా అభిమానాన్ని, అధికారాన్ని రక్షించుకోవడానికి, ఎవడినైనా నేను పిచ్చివానినివలె వదలిపెట్టి

పోతాను. ధైర్యంలేని భీరువును ఎండిన గడ్డిమాదిరి ఉపే క్షించి పోవడానికి నేను జంకను తెలిసిందా!

హెరోదస్ : ఊఁ. పోతావు. అయితే, నాకు పౌరుషంలేదని గదా నీ ఫిర్యాదు? జన్మలో ఒక్కసారైనా నా పౌరుషం నీకు చూపిస్తాను. (భయంకరహాసంతో) హెరోద్యా! ప్రాణనాయకీ! ఇదిగో నా యెదుట మోకాళ్ళపైపడి వేడుకో. ఊ! ఇక్కడ......(ఒరలోనించికత్తి తీస్తాడు) నన్ను క్షమించమని వేడుకో! కానీ......వెంటనే...

హెరోద్యా : (కొంచెంసేపూరకుండి గట్టిగా యేడుస్తుంది.) దైవమా!......అయ్యో......ఇది నీనుండి వచ్చినశిక్ష ...భగవంతా......ఎటువంటి సజ్జనుడైనభర్తను నేను విడిచిపెట్టివచ్చాను? ఆ సాధువును......నేను మోస గించి......సమస్తమును వదలి......అబ్బ!......ఇక నాచేతగాదు. ఎన్నిఆశలు కల్పించుకొన్నాను. ఎన్ని కోర్కెలు కోరాను. అన్నికూడా స్వప్నశకలాలవలె యెగిరిపోయాయి. (కొంచెంసేపేడ్చి, హఠాత్తుగా శాంతు రాలై) హెరోదస్! నీ యిష్టంవచ్చినట్లే కానీ. నేను చావ డానికి సిద్ధంగావున్నాను. నీతోకాకుంటే నా కీప్రపం చంలో, ఎవరితో ఏమిపని? కాని, ఒక్క కోరికమాత్రం నిన్నడుగుతాను. శాలోమీ చిన్నపిల్ల. ఆవిడతోమాత్రం యిలా ఎప్పుడూ వ్యవహరించవద్దు. (హెరోద్యా మరలా ఏడుస్తుంది)

హెరోదస్ : ఏమిటీ నీవు చెప్పడం!

హెరోద్యా : (ఏడుస్తూనే) ఓహో!......శాలోమీ......

చిన్నపిల్ల. నేనుచేసినది తప్పు. ఆవిడను రోములోపెట్ట కుండావుంటే బాగుండేది. ఇప్పుడు గడచినకథనంతా అనుకొని యేంలాభం? నేను దురదృష్టవంతురాలిని. హెరోదస్! కానీ, తొందరగా కానీ......నాకూ బ్రదుకు దుస్సహంగావుంది. నీ కత్తితోనే.........అదే నాకు కావలిసింది. ఆచేతులతోనే......నా కెంతో ఇష్టమైన ఆ చేతులతోనే......

హెరోదస్ : హెరోద్యా! నా హెరోద్యా! నిన్ను క్షమించాను. నేను కోపంతో ఒళ్ళుతెలియక యేమేమో అన్నాను. ఏడువవద్దు. అరెత్తాస్-యోహాన్నాన్ మొదలైనవారంతా చేరి నాకు పిచ్చివట్టించారు.

హెరోద్యా: నాకు చావుగావాలి.

హెరోదస్ : ఎందుకాగావాలి?

హెరోద్యా : నే నెందుకు జీవించాలి? మీరు నన్ను ఉపేక్షిస్తారు. నేడుకాకపోతే రేపు. నా జీవితానికి అర్థంలేదు.

హెరోదస్ : అదంతా మరచిపో. కోపంతో ఒళ్ళుమరచి పలికిన మాటలన్నిటికీ ఎవరైనా కార్యరూపమిస్తారా! (కత్తి ఒరలోపెట్టుకున్న శబ్దం)

హెరోద్యా: (గట్టిగా అరుస్తుంది) ఇదంతా దేనికి? మిమ్ములను చక్రవర్తిగా చూడాలని నేను ఆశించాను. అందుకే 'ఫిలిప్స్'ను స్వాధీనపరచుకున్నాను. రాజులను సత్కరించాను. గొప్పవాడైన 'హెరోదస్' కుమారుడుగూడ గొప్పవాడు కావాలని ఆశించాను. కాని, నా ప్రయత్నాలకు "యోహాన్నాన్" సమ్మతించేటట్టులేదు.

హెరోదస్ : అతనిని గురించి నీవు భయపడవద్దు. అతన్ని జైల్లో వేస్తాను.

హెరోద్యా : ఎవ్వడు? ఎక్కడ?

హెరోదస్ : ఇక్కడే ఇక్కడే కాని, ఫెలిక్సువిషయంలో నాకు సందేహంగావుంది.

హెరోద్యా : అదేమీ పరవాలేదు. శాలోమీతల్లియొక్క భర్తకు విరుద్ధంగా అత డేమీ చేయడని నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను.

హెరోదస్ : మంచిపని. శాలోమీయొక్కతల్లి......ఏదీ మరల చెప్పు.

హెరోద్యా : (నవ్వుతూ) జాగ్రత్తగాలేకుంటే ఆ అవకాశమూ జారిపోతుంది.

హెరోదస్ : ఊ!

హెరోద్యా : మనలోమనం పోట్లాడడం దేనికి? అంతా మీయిష్టంవచ్చినట్లే నడవనీ–మనం విందుకి పోదాం.

హెరోదస్ : అలాగే...(కొంచెంసేపు గడుస్తుంది)

ప్రవాచకుడు : 'హెరోదస్' తమ్ముడు 'ఫిలిప్స్'. అతనిభార్య 'హెరోద్యా'. ఆమెను 'హెరోదస్' గ్రహించెను. సోదరునిభార్యను గ్రహింపరాదని 'యోహాన్నాన్' 'హెరోదస్'తో పలికెను. 'హెరోదస్' కోపించి 'యోహాన్నా' నును కారాగృహమున బంధించినాడు. ఆతనిని చంపవలెననికూడ తలచెను కాని, జనులు–ఆత డొక ఉపదేశకుడని చెప్పుటచే......అతనిని భయపెట్టి......

[కొంచెంసేపు గడచినతరువాత జైలుయొక్క యినుపవాకిళ్ళ తెరచినధ్వని]

యోహాన్నాన్ : ఎవరది ?

శాలోమీ : నేను.

యోహాన్నాన్ : అనగా ?

శాలోమీ : శాలోమి.

యోహాన్నాన్ : ఏ శాలోమీ?

శాలోమి : శాలోమి తెలియదూ ? గాలిలీరాజకుమార్తె.

యోహాన్నాన్ : ఇక్కడినించి వెళ్ళిపో. ఇక్కడ స్త్రీదర్శనము పనికిరాదు. రాజకుమారియైనా, బిచ్చగత్తెయైనా, యెవ్వరినీ నేను చూడదలచుకోలేదు.

శాలోమి : ఇక్కడ మీరు బంధింపబడినది మీయిష్టప్రకారము కాదుగదా ?

యోహాన్నాన్ : (కుపితుడై) అయితే.

శాలోమి ; మిమ్మల్ని నిక్కడ బంధింపజేసిన దొక స్త్రీ. వేరొకస్త్రీ మిమ్ములను విడుదలచేయబోతూంది.

యోహాన్నాన్ : స్త్రీయా? వెళ్ళిపో. నేను...... నాకు స్వాతంత్ర్య మిప్పింపవలసిందని మిమ్ములను వేడలేదు.

శాలోమి : యోహాన్నాన్! తమకంఠధ్వని విన్నది మొదలు నేను మిమ్మల్ని ఆరాధిస్తున్నాను.

యోహాన్నాన్ : ( సంయమనాన్ని వదలిపెట్టి ) వెళ్ళిపో పిశాచీ! పరీక్షించడానికి వచ్చావా? పో. లేకుంటే నిన్ను పురుగువలె నలిపివేస్తాను.

శాలోమి : ఇస్రాయిలులోని ప్రపదేశకులు స్త్రీలను బాధించడంకూడా కద్దా ?

యోహాన్నాన్ : తప్పక. పాముతలను చిదుగగొట్టితీరాలి.

శాలోమి : ( నవ్వుతూ ) అయితే, పరవాలేదు. నన్ను తాకంది కొట్టడం సాధ్యంకాదుగదా !

యోహాన్నాన్ : 'ఎహోవా'! ఇదేమిటి, నా కీ శిక్ష! కారాగృహంలోకూడా నాకు స్వాతంత్ర్యం లేదా ?

శాలోమి : యోహాన్నాన్ !

యోహాన్నాన్ : నీతోనే చెప్పుతుంటున్నాను. ఇదేమిటి ? నాకు బాధ! హేరోదస్‌కు నాపైన ద్వేషంవుంటే - పిచ్చెత్తిన ఆడవాళ్ళను నాదగ్గరికి పంపి, నన్ను వేధించడానికంటె - సింహాలున్నగుహాలోనికి నన్ను తోసెయ్యరాదూ ?

శాలోమి : నన్ను హేరోదస్ పంపించలేదు. అలా పంపడుకూడ. నేను మిమ్మల్ని చూడడమే ఆయనకయిష్టం.

యోహాన్నాన్ : నీవు-వాడు నాశనమైపొండి.

శాలోమి : మీరు కోపించినప్పుడు రెడింతలందంగా కనపడుతారు. మీలో పురుషలక్షణాలన్నీ క్రోడీకరింపబడినాయి. ఆ పురుషత్వాన్ని నే నెలా గౌరవింపకుండా వుండడం?

యోహాన్నాన్ : నన్ను వేధించకుండా వెళ్ళిపోమంటున్నాను.

శాలోమి : యోహాన్నాన్! తమరు 'మిసిహా' యని నేను నమ్ముతున్నాను.

యోహాన్నాన్ : ఛీ, నీ కా మాట అనడానికైనా అర్హత వుందా?

శాలోమి : యోహాన్నాన్! మీరు కోపగించకండి. ఇదిగో,

శాలోమి రాజకుమారి. మీ కావిడ దాసి. నా పాదము లకు సేవచేయని రాజకిరీటములు రోమకసామ్రాజ్యమున లేవు. ఒకసారి సమ్మతిపూర్వకంగా తలఆడించివుంటే - హెరోదస్ సింహాసనము నాదై వుండేది. కాని, నేను ఇదిగో...ఈ కారాగృహంలోకి నడచివచ్చాను. పురు షత్వాన్ని వెదకికొని...మీపాదాలదగ్గరికి వచ్చాను. మీరు సిద్ధిస్తే, నా కదే చాలు. యోహన్నాన్! నన్ను స్వీకరించండి. జనులు మిమ్మల్ని పూజిస్తారు. మీరు రోమకసామ్రాజ్యం భరించండి.

యోహన్నాన్ : (చెవులు మూసికొని) హే ప్రభూ! ఈ స్త్రీ నిక్కడినించి తొలగించు. నేను హెరోదస్‌ను చూడాలి.

శాలోమి : ఆ నక్క యిక్కడికి రాడు. అతనికి మిమ్మల్ని చూస్తే భయం. నన్ను చూచినా

యోహన్నాన్ : మానినీ, నా ఓర్పును నీ వింతగా పరీక్షించడం తగదు.

శాలోమి : మీ రిలా పట్టుపట్టడం మంచిదిగాదు. మా అమ్మకు మీరంటే యిష్టంలేదు.

యోహన్నాన్ : మీ అమ్మ.....అంతా పిశాచసంతతి. వెళ్ళిపో యిక్కడినుంచీ.

శాలోమి : యోహన్నాన్! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నన్ను స్వీకరించండి నే నాడుతాను. పాడుతాను. మీతోపాటు ప్రార్థిస్తాను. తపశ్చర్య నడపుతాను. మీరు గొప్ప ఉపదేశకులు. యెహోవా సత్యమార్గము నెరిగించుటకు మిమ్ములను అభిషేకించినాడు. హెరోద

న్ననూ, అతని పరివారాన్ని మనం పారద్రోలుదాం. ఈ మాట లంటున్నది శాలోమి. గాలిలీరాజకుమా ర్తె. ఒక కన్యక ... శా ... లో...మీ...క్లియోపాత్ర నా దాసికావడానికే తగింది. యోహాన్నాన్ ! శాలోమి యింతవరకు పురుషుల యెదుట యింతగా వేడుకొన్నది లేదు. యోహాన్నాన్...(గోడవైపు విసరివేసిన యేదో వస్తువుయొక్క శబ్దం. శాలోమీ సంభాషణను నిలుపు తుంది.)

యోహాన్నాన్ : ఛీ! వెళ్ళిపో.

శాలోమి : (శాంతంగా) యోహాన్నాన్! మనం మరలా ఒకసారి కలుసుకుంటాము. అప్పుడు నన్ను ఆజ్ఞాపించే అధికారం నీ కుండదు. నన్నిపుడొక కుక్కనువలె కసరికొడుతున్నావు. దీనికి బదులుతీర్చుకుంటాను. ఆ బదులుతీర్చుకోవడానికి హెరోదస్ సింహాసనము నాశన మయినాసరే... ఇక పోతున్నాను. తలుపులు వేసుకో. (కాలియడుగులచప్పుడు, వాకిళ్ళుమూసిన శబ్దం.)

[ప్రభువులు విందుచేసుకుంటున్నశబ్దం. పాత్రలధ్వని]

ఒకప్రభువు : అదే! చూడు, ఆవిడ యెంత అందంగా వుందో!

రెండవ : ఇంతవయస్సైనా ఆ సౌందర్యం అణువుకూడా తగ్గింది లేదు.

మూడవ : కాని – హెరోదస్ కన్నులు వేరొకరిపైన పడు తున్నాయి.

రెండవ : ఛీ! ఛీ! గట్టిగా మాట్లాడవద్దు. వా రీవైపే వస్తున్నారు. (అడుగుల సవ్వడి)
ఒకటవ : రాణీ! 'హెరోదస్' చాల అదృష్టవంతుడు.
హెరోద్యా : మేల్ దేభాయీ! ముఖస్తుతికూడ ఒక కళ.
రెండవ : లోకసౌందర్యసారం!
హెరోద్యా : శాలోమీ! వింటున్నావా? (అందరూ నవ్వుతారు)
మొదటి : ఆకాశంలో యిద్దరుచంద్రులుంటే సార్థవాహులకు నష్టమేమొచ్చింది?
మూడవ: నాయకుడైన పేకిన్ మార్గంతప్పినాడని తోస్తూంది.
హెరోద్యా : (దాక్షారసం పోస్తున్న శబ్దం) ఇదో! 'యెలియాసర్' త్రాగు.
మూడవ : తమరు పంచి యిస్తుంటే—యిదేమిటి, గాలిలీ సముద్రజలాన్నంతానైనా తాగేస్తాను.
వేరొకడు : హృదయంలోని ద్రాక్షారసాన్ని యిలాగే పాత్రలలోపోసి త్రాగించగలిగితే!
హెరోద్యా : ఓహో! ఈ గుంపులో ఒక కవిగూడా వున్నాడన్నమాట.
మొదటి : పుష్పగంధము ప్రసరిస్తే మూగతుమ్మెదగూడా ఝుంకారధ్వని చేస్తుంది.
మూడవ : యూదులభూమిలో పిచ్చితనం బ్రహ్మాండంగా ప్రచారుచేస్తూంది.
హెరోద్యా : ఆ విషయమే చెప్పబోతున్నాను. యోహాన్నాన్ బంధితుడైనాడు.

మొదటివాడు
రెండవవాడు
మూడవవాడు
} (ముగ్గురూ ఒకేసారి)
ఎందుకు ?
ఓహో !
ఎవ్వాడు ?

హెరోద్యా : ఈనాడే. అతడు 'అరెత్తాసు'కు సహాయం చేస్తున్నాడు. సైన్యంలో కల్లోలాలు రేపుతున్నాడు. 'అరెత్తాసు'ను ఓడించవలె.

ఒకటవ : ఏమో! ఈవిషయాలు బుద్ధిమంతులు తీర్మానించాలి.

మూడవ : ఈవిషయంలో అంత వివేకమున్నదా ? అని సంశయం.

హెరోద్యా : ఏమిటీ! అయితే మీరు భయపడుతున్నారన్నమాట! నా కిష్టమైన ప్రభువులారా! మీరు నాకోసం నిలిచి పోరాడరూ? శాస్త్రంచదివినవారు పండితులు నా పనికి విరుద్ధంగావున్నారు. మీరో?

ఒకటవ : నేను మీవైపు.

రెండవవాడు : (ఒకేసారి నేనుగూడ.

మూడవవాడు : గట్టిగా) నన్నూ లెక్క వేసుకోండి.

హెరోదస్ : (దూరమునుంచి) ఓహో! ఇక్క డేమిటి విశేషం?

ఒకటవ : మేము మీకోసం యుద్ధంచేయడానికి ప్రతిజ్ఞలు తీసుకుంటున్నాము.

హెరోదస్ : (నవ్వుతూ) నాకోసమా? హెరోద్యాకోసమా?

రెండవ : ఇద్దరికోసమూ.

హెరోదస్ : తెలిసింది, తెలిసింది - కాని, హెరోద్యా! ఈ నా డేమిటి నృత్యం?

హెరోద్యా - ఒకటీ లేదు.

హెరోదస్ : ఒకటీ లేదూ?

హెరోద్యా : లేదు. నృత్యములన్నీ "లేబెరియాసిల్"లో. ఇక్కడ యుద్ధంమాత్రమే.

హెరోదస్ : ఇక్కడ వుంటూన్నది నర్తకీజనుల రాణి గాదూ? శాలోమీ!

హెరోద్యా : వద్దు. ఆవిడకి ఒంట్లో బాగాలేదు. ఆమె నృత్యంచేయదు.

శాలోమి : నేను చేస్తాను.

హెరోదస్: మంచిపిల్ల. శాలోమీ! తొందరగా తయారైరా.

హెరోద్యా : శాలోమీ !

శాలోమీ : అమ్మా, ఊరికే కోప్పడవద్దు. ప్రభువులు కోరి నప్పుడు ఒకనృత్యం చేయకపోతే ఎలాగు?

రెండోవాడు : తప్పక చేయాలి. (అడుగులధ్వని)

హెరోద్యా : (రహస్యంగా) శాలోమీ! రాజు తప్పత్రాగి శరీరంమరచాడు.

శాలోమి : అయితే యింకేమి? నృత్యంచూడడానికి సరైన స్థితి అన్నమాట!

హెరోద్యా : ఫెలిక్స్! చూడు......

శాలోమి : ఇదో-నా కాళ్ళకు గజ్జెలుకట్టు ఫెలిక్స్! (గజ్జెలు కడుతూన్నశబ్దం) కొంచెం పైగా కట్టు......అక్కడే...

ఓహో!...ఆడదాన్ని కాళ్ళుముట్టుకుంటూనే ప్రేళ్ళుచలించని పురుషుడు ఒక్కడూ కనపడడంలేదు......

ఫెలిక్స్ : (మెల్లిగా) శాలోమీ!......రాణి చెప్పానది...

శాలోమి : ఫెలిక్స్! వీరిముందు నన్ను ప్రేమించవద్దు.

హెరోద్యా : శాలోమీ! ఇది నా కిష్టంలేదు.

శాలోమి : బలవంతులయందే మాధుర్యముండునని చెప్పినదెవ్వరు? దలీలానా?

మొదటి : కాదు. ఆమెయొక్క బలిమృగమైన సింసోన్.

శాలోమి : ఆమె సింసోనుయొక్క మంగలిది.

హెరోదస్ : (దూరమునుంచి) ఏమి టాలస్యం? శాలోమీ!

శాలోమి : ఏమీలేదు. తొందరపడకుంటే సరి. యిప్పుడే వస్తున్నాను. (మెల్లగా) యీ కిన్నెరతంత్రులు తెగిపోతాయేమో!

[నృత్యమారంభమౌతుంది. ఈ క్రిందిసంభాషణ చాల చిన్నధ్వనితో నడవాలి.]

ఒకటవవాడు : ఆ కాళ్ళు చూడు.

రెండవ : ఆడపావురంకాళ్ళలాగున్నాయి.

మొదటి : ఆ కాళ్ళు వర్తులంగా, యే శిల్పిచేతనో చెక్కబడ్డట్టున్నాయి.

మూడవ : నాకు యింకా సూక్ష్మంగా పరిశీలించాలని ఆశ.

హెరోద్యా : మీ కుండవచ్చు. నాకు తెలుసు, దొంగా!

హెరోదస్ : (గట్టిగా) భేష్.

హెరోద్యా : మత్తుక్రమ్మింది.

రెండోవాడు : అదే...రూబేన్! ఆ పాత్ర నందివ్వు.

మొదటి : అదిగో రాజకుమారి మేలిముసుగు తీసేసింది.

మూడవ : ఉత్తరీయంకూడా......

ఒకటవ : ఇక బ్లౌసుకూడా తీసెయ్యొద్దూ?

రెండవ : యహోవా! ఇది యెక్కడకుపోయి నిలుస్తుందో?

ఒకటవ : అదో, మహారాజు సింహాసనంనుంచి లేస్తున్నాడు.

హేరోద్యా : నే నక్కడకు పోతాను.

[నడచినసవ్వడి. నృత్యం ఆరంభమౌతుంది. కొంతసేపటితరువాత]

హేరోద్యా : అక్కడ వుండండి. నాపైన దయఉంచి అక్కడే ఉండండి. మీరు పడిపోతారు.

హేరోదస్ : (మదావేశంతో) ని న్నెవరు పిలిచారు ? దూరంగా వెళ్ళిపో.

హేరోద్యా : పడుతారు, పడుతారు. అక్కడే ఉండండి.

హేరోదస్ : దూరంగా పొడై పో......

[క్రిందపడినశబ్దం]

హేరోద్యా : ఇదో, దాసీ! కొంచెం నీళ్ళు. మీరు లేవవద్దండి. నేనే విసరుతాను.

హేరోదస్ : ద్రా...క్ష...ర...సం.

హేరోద్యా : నీళ్ళు త్రాగండి, చాలు.

హేరోదస్ : ఆ...... ఆ... ... (నీరు త్రాగుతున్నశబ్దం) శాలోమీ!...జాగ్రత్తగా కనిపెట్టుకో...జాగ్రత్త! పరుగెత్తిపోవద్దు. [నృత్యం నిలిచిపోతుంది]

హేరోద్యా : ఇదో! ఇక్కడ ఉండు.

హెరోదస్ : పాపం! ఎంతో చిక్కిపోయింది. ఇలా రా! ఇలా రా! ఈ ద్రాక్షారసం రుచిచూడు......

శాలోమి : నా కక్కరలేదు.

హెరోదస్ : హెరోద్యా! దాని కొంచెం విసరు. ఉష్ణం జాస్తిఅయిఉంటుంది.

శాలోమి : నా కెవ్వరూ విసరవద్దు.

హెరోదస్ : రా! శాలోమీ! నాదగ్గర కూచో. ఈ సింహాసనంపైన కూచో. నేనే విసురుతాను.

శాలోమి : వద్దు.

హెరోదస్ : నీ కేంగావాలి? అడుగు.

శాలోమి : ఏమీవద్దు.

హెరోదస్ : వీల్లేదు. ఏదోఒకటి అడగాలి. గాలిలీసింహాసనం కుదవఉంచిఅయినాసరే నీ కోరిక తీరుస్తాను.

శాలోమి : ఊరికే మాట్లాడడ మెందుకు? మీరు మోసగాండ్రు.

హెరోదస్ : నేనా! హెరోదస్నా!

శాలోమి : అన్నమాట నిలబెట్టుకొనేఅలవాటు మీకులేదు.

హెరోదస్ : ఎవరన్నారు ? యహోవాపైన ఒట్టుపెడుతున్నాను.

శాలోమి : ఏమిటి ఒట్టు?

హెరోదస్ : యహోవాపైన ఒట్టు. శాలోమి! ఏమడిగినా సరే యిస్తాను.

శాలోమి : నాకు......

హెరోదస్ : ఊఁ...అడుగు......నీ వనేదేమిటో పూర్తిగా చెప్పు.

శాలోమి : నాకు ఒక వెండిపళ్ళెంలో......

హెరోదస్ : ఏమి టా జంకు ? చూడు, హెరోద్యా! శాలోమి యేమి చమత్కారం చూపుతుందో ! నీ బిడ్డే గదూ! వెండితట్టలో ఏంకావాలి?

శాలోమి : యోహాన్నాన్‌శిరస్సు.

హెరోదస్ : యహోవా!

హెరోద్యా : శాలోమీ!

శాలోమి : నన్ను వదులు.

హెరోదస్ : (మూల్గి) వద్దు, శాలోమీ! అది వద్దు. నీ కెందు కది?

శాలోమి : (గట్టిగా) యోహాన్నాన్‌శిరస్సు.

హెరోదస్ : శాలోమీ!

శాలోమి : మహారాజు తమవాక్యం పాలించాలి.

హెరోదస్ : నీ వడిగినవరం ఆపద తెస్తుంది శాలోమీ! నీవు కావాలంటే యోహాన్నాన్‌ను తీసుకో. అంతేగాని,అతని శిరస్సెందుకు?

హెరోద్యా : శాలోమీ! ఊరికే అడగడమెందుకు? ఈ పిరికివాడు తేలేడు.

హెరోదస్ : పిశాచీ! ఈ కుట్రలో నీ చేయివుందని నా కిప్పుడు తెలిసింది. ఆ శిరస్సు కావలసింది నీకు! దానితో పనుండేది నీకే!

శాలోమి : మహారాజా! సమయం గడచిపోతూంది.

హెరోదస్ : శాలోమీ! అదివద్దు.

శాలోమి : యోహాన్నాన్ శిరస్సు.

హెరోదస్ : (కొంచెంసేపూరకుండును) బల్‌సెస్సార్! శాలోమీ అడుగుతూండే దిచ్చివేయి. (కొంచెంసేపు గడుస్తుంది)

శాలోమి : యోహాన్నాన్! యోహాన్నాన్! నీ కిష్టమున్నచో యీ యాపద తప్పించుకొనిఉందువు. విన్నావా? (శత్రువులు కోటనుఆక్రమిస్తున్నశబ్దం. భయంకరంగా కత్తులు పరస్పరం ఒరుసుకుంటున్నధ్వని. రాళ్ళుపడుతున్న శబ్దాలు) ఓహో! వాళ్ళు కోట ఆక్రమిస్తున్నారు...... ఆక్రమించనీ...నాకేమి ... ... యోహాన్నాన్!...ఈ ప్రళయం తెచ్చింది నీవే...కనపడుతూందా? ... మీ శాలోమీ...నీ ప్రీతిపాత్రురాలు......

ఒకశబ్దం : (హఠాత్తుగా) ఆ పిశాచి. అదే, చంపు దాన్ని.

[శాలోమి గట్టిగా అరచి కత్తివిసరుతున్నట్లు శబ్దం]

[కొంచెంసేపు నిశ్శబ్దం]

ప్రవాచకుడు : అతనిశిష్యు లాతనిశరీరం తీసుకొనిపోయి పూడ్చిపెట్టినారు. తరువాత వారు జీసస్సున కీ వృత్తాంతము తెల్పిరి.

ఒకశబ్దము : (శాంత గంభీర మధుర మనోహరధ్వనితో) మీరు దేనిని చూచుటకు మరుభూమిలోనికి పోయితిరి?

గాలికి కంచువిగ్రహములు కదలునా? అదికాదు...ఏమి చూచుటకు పోతిరి? మంచివస్త్రమును ధరించిన మనుష్యుని చూచుటకా? విభవములలో తూగి తేలాడు మనుష్యులుమాత్రమే రాజధానులలో నుందురు. అదిగాదు; ఎందుకు వెళ్ళితిరి? ఒక ప్రవాచకుని చూచుటకా? ప్రవాచకునికంటె యతడు గొప్పవాడని చెప్పితిని. 'నీకు నే నొకదూతను ముందుగా పంపుదును. అతడు నీ త్రోవను తయారొనరించును' అని వ్రాయబడిన దతనిని గురించే. స్త్రీగర్భములందు జనించినవారిలో – యోహాన్నా నతిశయించిన గొప్పవాడెవ్వడును లేడు.



# తీరని బాకీ

రచయిత:

## పి. సి. కుట్టికృష్ణన్

ఇతడొక కథాకారుడు, నవలారచయిత యును. పి. సి. కుట్టికృష్ణన్‌యొక్క ప్రతిభావిలాసము పై రెంటిలోనేగాక నాటకరచనల్లోకూడా కనబడుతుంది. వీరిరచనలు కొద్దిగానున్నను - అవి ధ్వని ప్రధానములై యుండును. మానసిక వికారములను కన్నులకుగట్టినట్లు వర్ణించుటలో నితడు సమర్థుడు. "మణ్ణుం -పెణ్ణుం" "తీకొండు కళిక్కరుదు" అను రెండునాటకాలు ఈతనివి ప్రసిద్ధాలు.

## పాత్రలు:

రాజన్

లీల

గోపాల్‌జీ

ప్రభు

# తీరని బాకీ

[ఒక చిన్నగది, అందులో ఒకమేజా. రెండుమూడు కుర్చీలు. ఒక బుక్‌షెల్ఫు. రాజన్‌కు ముప్పదేండ్లవయస్సు. అతడు కూర్చొని కవిత్వం వ్రాసుకుంటుంటాడు.]

రాజన్ : అవతరింపవా
నీవు నా జీవితమున
అవతరింపవా......అవతరింపవా.

[వాకిలిదగ్గిర చప్పుడు]

ఒక స్త్రీకంఠం : తెరు. వాకిలి తెరు.

రాజన్ : (ఆ ధ్వని వినకుండా) అవతరింపవా
అవతరింపవా.

స్త్రీ : వాకిలి తెరవకుండానే యెలా అవతరించడం?

రాజ : (వాకిలివైపు కన్ను త్రిప్పి) అబ్బ! ఏమి టీ కష్టం?
(మరల కాగితంవైపు చూస్తూ) అవతరింపవా నీ
వవతరింపవా.

స్త్రీ : వాకిలి తెరిస్తేగదా, అవతరించేది. తెరు.

రాజ : (తిన్నగా లేస్తూ) నేను తెరవను.

స్త్రీ : తెరవవలసిందే.

రాజ : (ఆశ్చర్యపడుతూ) ఏమిటీ!

స్త్రీ : వచ్చింది నేను, లీల.

రాజ : (పెన్సిలు ఒకవైపుపెట్టి వదరుతూ) గ్రహచారం... వస్తానుండు......వాకిలిపట్టి త్రోయి, వస్తుంది.

[లీల వస్తుంది. వయస్సు 21 సంవత్సరాలుంటాయి. అచ్చమైన మళయాళీవేషం.]

రాజ : ఎవరో అనుకున్నాను. క్షమించాలి.

లీల : క్షమించాలేం. కాని, ఇంటి కెవరైనా వస్తే, వారి విషయంలో మర్యాదగా ప్రవర్తించొద్దూ?

రాజ : క్షమించాలి.

లీల : క్షమించాను.

రాజ : ఇలా కూర్చో. ఏదో పనిలోవున్నాను.

లీల : (కూర్చొని) మీకు పనివుందన్నమాట. ఏమిటో వ్రాసుకుంటానని మీ మాట కర్థం.

రాజ : అవునవును.

లీల : (అలక్ష్యంగా) ఏమి టా వ్రాసేది?

రాజ : కవిత్వం వ్రాస్తున్నాను.

లీల : ఓ ... కవిత్వం వ్రాయడంకూడా ఒక పెద్ద పనేనా యేమిటి?

రాజ : కవితావేశం—నిలుపడానికి సాధ్యంగాని యొక భావం. కవిత్వమొచ్చినా – కక్కొచ్చినా ఆగదంటారు. తెలుసు గదూ.

లీల : ఆ, తెలునులెండి.

రాజ : ఏమి టాలోచిస్తున్నావు?

లీల : (లజ్జామధురంగా) నాకూ – ఖిలాంటిరోగమే ఒక టుండేది.

రాజ : (ఉత్సాహంగా) లీల కవిత్వం వ్రాస్తుందా?

లీల : అబ్బే! అదేమీ లేదు.

రాజ : మరి?

లీల : చిన్నప్పుడు నాకు పిత్తోద్రేక రోగం వుండేది. చెంప లెప్పుడూ పుబ్బుకొని తెల్లగా వుండేవి. నా ఆ రూపం కొంత ఆలోచించుకో చూద్దాం. అప్పుడు మన్నూ - చింతగింజలూ - బొగ్గూ - పచ్చిబియ్యం - మట్టీ - మొదలైనపదార్థాలన్నీ తినేదాన్ని. అవి తినరాదని వైద్యులు చెప్పేవారు. అయినా, తినాలనే ఆవేశం మానేదిగాదు. మిమ్మల్ని చూస్తే నా కా దినాలు జ్ఞాపకం వస్తాయి.

రాజ : (కొంచెం కోపంగా) కవితావేశం పిత్తరోగంలాంటిది గాదు.

లీల : (అలక్ష్యంగా) అయితే యేమంటారు?

రాజ : దానిని వర్ణించడానికి వీల్లేదు. అది అనుభవైకవేద్య మైన ఒకఅవస్థ. సరేగాని, నీవు వచ్చినపనేమిటి?

లీల : ఇంకెందుకు వస్తాను? ఇంటిబాడుగ తీసుకొనిరమ్మని నాన్న చెప్పాడు.

రాజ : నన్ను క్షమించాలి.

లీల : ఎందుకూ?

రాజ : ఇప్పుడు బాడుగ యివ్వలేను. చేతిలో డబ్బులేదు.

లీల : పోయినవారంగూడా యిలానే చెప్పారు.

రాజ : అనుకోని ఖర్చులేవో కొన్ని పైనపడినాయని మా నాన్నతో చెప్పు.

లీల : గడచినవారంగూడా ఇలానేఅన్నారు. ప్రతీసారికూడా ఒకటే సాకు చెబితే యెలాగు? (రాజన్ జంకుతాడు. చుట్టూ చూస్తాడు. హఠాత్తుగా తాను కవిత్వంవ్రాస్తుండే కాగితం పైకెత్తుతాడు.)

రాజ : ఇదో, చూడు. నా కవిత్వం చూడు. ఈ రచన సాహిత్యంలో ఒక నూత్నపంథనే సృష్టిస్తుంది.

[లీల ఆ కాగితంపెరుక్కొని చూచి మేజాపైన పెట్టుంది]

రాజ : జనాలు ఆశ్చర్యపడిపోతారు.

లీల : అద్భుతరసంగాదు. డబ్బు...నాన్నగారికి కావలసింది.

రాజ : డబ్బువచ్చే మార్గమే చెబుతున్నాను. పత్రికలవారు యీ నా కవిత్వంపైన యీగల్లా ముసురుకుంటారు. పారితోషికం—ఎంతకావాలని అడుగుతారు. నా కొాళ మంచి ఛాన్సు దొరుకుతుంది.

లీల : అయితే యీకాలంలో కవిత్వాన్నిగూడా డబ్బిచ్చి కొానేవారున్నారన్నమాట. ఈనాటిమనుష్యులు యెంత పిచ్చిపనైనా చేస్తారు.

రాజ : నేను కాగితంపైనవ్రాసేలైన్లు నాకు డబ్బును సంపాదించిపెడుతై.

లీల : ఇకనేముంది. చీకూ-చింతా లేనిపని. వరుసగా వ్రాసుకొనిపోండి. పెట్టుబడిలేనివ్యాపారం.

రాజ : (ఒకరీతిగా నవ్వుతూ) అదే, అదే. ఇవ్వాడా డబ్బుకొంతముట్టితే,—

లీల : ఇంటిబాడుగ యిచ్చేస్తారన్నమాట.

రాజ : అవును.

లీల : మీ డబ్బువచ్చేవరకూ మాకు కాచుకోడానికి సాధ్యం గాదు. మానాన్నగారి కీ ప్రొద్దు డబ్బు కావాలి. ఇంకా నాకు రెండిండ్లలో పనివుంది. వారితో మాట్లాడి-యింటికి పోయేటప్పుడు - మళ్ళీవస్తాను. అప్పటికి డబ్బు తెప్పించి వుంచాలి.

రాజ : ఈప్రొద్దేనా?

లీల : ఇంకెప్పుడిస్తారు? వచ్చేయుగంలోనా?

రాజ : కాదు, వచ్చేవారంలో.

లీల : వీల్లేదు. నేను యిదో వెళ్ళివస్తాను.

[చిరునవ్వునవ్వుకుంటూ మాటిమాటికీ రాజన్‌వైపు అందంగా తిరిగి చూస్తూ వెళ్ళిపోతుంది.]

రాజ : (ఆమె పోయినదారివైపే చూస్తూ)ఇలాంటి అమ్మాయి యెవరికైనా వుంటే, వాళ్ళ కింక నరకమక్కరలేదు. ఇద్దరుపిల్లలున్నారంటే, వాళ్ళు జనాన్నంతా యేడిపించగలుగుతారు. ముగ్గురున్నారంటే, ఆటంబాబు అవసరమే లేదు. (నిట్టూరుస్తూ నా ఆనందాన్నంతా చెడగొట్టింది. మరల కాగితంవంక చూస్తాడు.)

["అవతరించవో....అవతరించవో...."అంటూ పైన ఆలోచిస్తాడు. ఇంతలో గోపాల్‌జీ ప్రవేశిస్తాడు. ఆయనమెడలో బంగారుకప్పుగల ఒక రుద్రాక్ష, ముఖంపైన ప్రసన్నభావం. వయస్సు నలభైరెండుసంవత్సరాలుంటై.]

గోపాల్‌జీ : (నమస్కరిస్తూ) నేను మీపని చెడగొట్టడం లేదు గదా?

రాజ : (వ్రాసుకుంటూనేవుంటాడు)

గోపా : నమస్కారాలు.

రాజ : (తలయెత్తి చూసి) అయ్యో......వాకిలి వేయడం మరచిపోయ్యాను.

గోపా : (మరల) నమస్కారాలండి.

రాజ : నమస్కారం. కూర్చోండి...తమరు.

గోపా : నాకు తమరు తెలుసునండి. ప్రసిద్ధులను లోకం గుర్తుపెట్టుకోకుండాఉంటుందా?

రాజ : తమరినిగురించి తెలుసుకుందామని నా అపేక్ష.

గోపా : చిత్తం...చిత్తం, నన్ను ప్రజలు గోపాల్‌జీ అని పిలుస్తారు. ఏమిటి వ్రాస్తున్నారు?

రాజ : అబ్బే ! ఏమీ లేదు.

గోపా : రాజన్‌గారూ, వేదాంతవిషయాలను గురించి ఎక్కువగా యేమైనా వ్రాశారా?

రాజ : లేదండీ.

గోపా : వ్రాయాలి.

రాజ : నాకు వేదాంతం అంతగా తెలీదు.

గోపా : అదేముంది. రెండుగ్రంథాలు చదువుకుంటే తెలుస్తుంది.

రాజ : (మాటమార్చి) తమరు వచ్చినపని?

గోపా : చెపుతాను (చూపుడువ్రేలితో నిర్దేశిస్తూ) ఇది యేమిటి?

రాజ : (ఆశ్చర్యంతో చూస్తాడు)

గోపా : చెప్పండి. మీరు వ్రాస్తున్నదేమిటి?

రాజ : (క్రిందికిచూస్తూ) ఒక......

గోపా : (ఒకవిధంగా నవ్వుతూ) అదే వేదాంతం. మన సంస్కారమంతా వేదాంతంపైననే ఆధారపడిఉన్నది. ఇదో, చూడండి. "ఈ నేను" అనే పదార్థం యేమిటని మీ అభిప్రాయం?

రాజ : గోపాల్‌జీ!

గోపా : పేరు మనంపెట్టుకొన్నది.

రాజ : కాదు, తల్లితండ్రులు పెట్టినది.

గోపా : అదేనండి. తల్లితండ్రులుమాత్రం మనుష్యులు కారా యేమిటి? నామం మనుష్యనిర్మితమని నా అభిప్రాయం (చూపుడువ్రేలు రాజన్‌ముక్కుకు తగిలిస్తూ) "నేననే" పదార్థం యీ చెయ్యంటారా?

రాజ : (వెనక్కితగ్గి) కాదు.

గోపా : కాలా?

రాజ : కాదు. (తల ఆవైపుకు త్రిప్పుతాడు)

గోపా : చెవా...ముక్కా... కన్నా... (రవ్వంత సేపూరకుండును) ఏం పలుకరు?

రాజ : చెప్పుకోండి.

గోపా : ఈ "నేన"నేది దేహంకాదు. మనస్సుకాదు. హృదయంకాదు. మరి ఈ "నేన"నేపదార్థం యెవ్వరు?

రాజ : ఆ విషయ మలావుండనియ్యండి. మీరువచ్చినపని?

గోపా : చెబుతానండి. తొందరపడతారేమిటి? ఈ "నేను" అనే దెవ్వరు?

రాజ : సమాధానంగూడా మీరే చెప్పండి.

గోపా : ఆ "నేను" అనేదే ఆత్మ. అక్కడే వేదాంతం ఆరంభమౌతుంది.

రాజ : సరి. మీరువచ్చినపని?

గోపా : (వినకుండానే) ఆత్మకి చావుందా? పుట్టుకవుందా?

రాజ : (వస్తూవుండేకోపాన్నాపుకుంటూ) చావుకూడా లేదూ?

గోపా : లేదు. ఆత్మ అనశ్వరము. కాలాతీతము. త్రిగుణరహితము. అయినా గుణమయము.

రాజ : ఊ!

గోపా : ఒక్కొక్కజీవికి ఒక్కొక్కఆత్మ వుంది. అదే జీవాత్మ. ఈ ప్రపంచసర్వానికి ఒకఆత్మ. "నేను" వున్నది. అదేమిటంటారు?

రాజ : నేను... నేనే. (లేచి నడవడానికి మొదలుపెడతాడు.)

గోపా : (రాజన్‌ను నిలిపి) కాదు. అదే పరమాత్మ.

రాజ : మీ వేదాంతం ముగిసిందా? లేదా? ఇక వచ్చినపని చెప్పండి. నా కొంచెం పనుంది.

గోపా : క్షమించాలి. (నవ్వుతూ చేతులుపిసుక్కుంటూ.) ఏదో ఒకకోరికతో వచ్చాను. మే మొక "చిట్‌ఫండ్" ఆరంభిస్తున్నాము.

రాజ : మంచిది.

గోపా : దానిప్రారంభోత్సవం ఇరవైఒకటవతేదీన జరుపుతాం.

రాజ : చాలామంచిది.

గోపా : ప్రారంభోత్సవానికి ఉపన్యాసకులుగా తమరురావాలి.

రాజ : (ఆశ్చర్యంతో) "చిట్‌ఫండ్" ప్రారంభోత్సవానికా?

గోపా : అవునండి.

రాజ : నాకు తీరిక లేదండి.

గోపా : మీ రలా అనరాదు. మీరురావాలని మేమంద రమూ ఏకగ్రీవంగా కోరుతున్నాం.

రాజ : నా కా కోరిక లేదు.

గోపా : అయ్యో. మనరాష్ట్ర ఆర్థికజీవనాన్ని గురించి...

రాజ : నాకు 'చిట్ ఫండ్'ను గురించి యేమీ తెలీదు.

గోపా : మే మీ మాట నమ్మం.

రాజ : మీరు నమ్మకపోతే నాకేమివచ్చింది? నా కావిషయ మేమీ తెలియదంటున్నా.

గోపా : తమకిష్టమున్న విషయంపై వుపన్యాసమివ్వవచ్చు.

రాజ : "కుమారాశనాశాన్" కవిత్వంపై వుపన్యసిస్తే చాలా?

గోపా : ఓహో! మా కదే ముఖ్యంగా కావలసింది.

రాజ : నాకు తీరిక లేదండి.

గోపా : అయ్యో, మీ రలాచేస్తే ఎలాగండి?

రాజ : (ముఖం వేరేవైపు త్రిప్పుకొని) నా అభిప్రాయం నేను చెప్పాను. తరువాత మీ యిష్టం.

గోపా : కొంచెం ప్రయత్నించిచూడండి.

రాజ : ప్రయత్నమేమిటి? తీరిక లేదంటుంటే.

గోపా : ప్రయత్నించండి. మీ దేంపోతుంది గనుక. "కర్మణ్యే వాధికారస్తే"

రాజ : అయితే ప్రయత్నిస్తాను పొండి.

గోపా : నోటీసులో మీ పేరు ప్రచురిస్తాం.

రాజ : అది న్యాయంకాదు.

గోపా : ఎందువల్ల ?

రాజ : న్యాయంకాదంటుంటేనూ !

గోపా : ఆమాట మీరు – మీకుస్వభావసిద్ధమైన వినయంతో అంటున్నారు. మీ రిప్పటికే లబ్ధప్రతిష్ఠులు. మీకు పబ్లిసిటీతో నిమిత్తం లేదనుకోండి. ఇక – అయినా, మా మర్యాద మేం చూపాలిగా మరి? అయితే, యిక అంతా యేర్పాటైనట్టేగదూ?

రాజ : ఏమేర్పాటైందని మీ అభిప్రాయం.

గోపా : (నవ్వుకుంటూ) ఇక అంతా నేను చూచుకుంటా న్లెండి. నా వినయపూర్వకమైనమనవి యేమంటే – మీరు వేదాంతాన్ని గూర్చి యెక్కువగా వ్రాయాలి.

రాజ : సరేలెండి, మీరు దయచేయండి.

గోపా : (నమస్కారంచేసి వెళ్ళిపోతాడు)

రాజ : వేదాంతమూ, – చిట్‌ఫండూ – యీ రెండూ నా ప్రాణంతీశాయి. చిలుకుపెట్టుకుంటే యిక వీళ్ళతో చస్తాను.

[చిలుకు పెట్టుకుంటాడు. మరలా కుర్చీపై – వ్రాసుకోవడానికి కూర్చుంటాడు. వాకిలితట్టినశబ్దం వినపడుతుంది.]

రాజ : దేవునితోడు, నే నిక వాకిలి తెరువను. ఎవరైనా అరుచుకోనీ, (వ్రాస్తున్నట్లు అభినయిస్తూంటాడు.)

ఒకపురుషకంఠం : వాకిలి తెరు.

రాజ : ఇక్కడ ఎవ్వరూ లేరు.

పురుషకంఠం : ఎవరూలేకుంటే మాట్లాడేది దయ్యమా ఏమిటి? (గట్టిగా) వాకిలి తెరు. ఎవ్వరువచ్చినా వాకిలి మూసికొని కూర్చుంటే ఎలాగు? ఒరేయ్ ! రాజా ! వాకిలి తెరు.

రాజ : (నిట్టూరుస్తూ పోయి వాకిలి తెరుస్తాడు. 'ప్రభు' లోప లికి వస్తాడు. వానిముఖంలో తిరస్కారభావం తొణికిస లాడుతుంటుంది.

ప్రభు : ఏమిట్రా యిది? తేవస్సుచేస్తున్నావా!

రాజ : క్షమించాలన్నా.

ప్రభు : నేను క్షమించను. నీ చేష్టలు నాకు సరిపోవటంలేదు.

రాజ : మరి నన్నేంచేయమంటావు. వాకిలిమూసుకొని కూర్చొనకపోతే నా పని జరగదు.

ప్రభు : సరేగాని—ఆ వేదాంతంగా డిక్కడి కెందుకొచ్చినట్టు?

రాజ : నా ప్రాణంతియ్యడానికి!

ప్రభు : ఇలాంటి స్వార్థపరులే యెప్పుడూ నీతో చేసుతుం టారు. ఇప్పుడేమిటి? ఏంచేస్తున్నావు?

రాజ : ఏదో కొంచెం రాసుకుంటున్నాను.

ప్రభు : (వ్రాస్తుండే కాగితం తీసుకుని - దాన్ని చూస్తూ) నీకీ దురభ్యాసం వదలుకోవడానికి సాధ్యంకాదూ?

రాజ : ఎందుక్కాదూ! మీవంటివాళ్ళు నలుగురు తయారై తే తొందరలోనే వదులుకుంటాను.

ప్రభు : ఒరేయ్! నీ వొక కూపస్థమండూకము. ఈనడుమ సమాజంలో వస్తూండే మార్పులను గురించి నీ కేమైనా తెలుసా?

రాజ : ఇప్పుడిప్పుడే తెలుసుకున్నాను.

ప్రభు : ఏమిటి తెలుసుకున్నావు?

రాజ : మనుష్యులు పరస్పరనాశనానికే యత్నిస్తూంటారనే విషయం తెలుసుకున్నాను.

ప్రభు : అదే. ఆటంబాంబులు, హైడ్రోజన్‌బాంబులు సృష్టిస్తున్నారు.

రాజ : వాని నెలాగైనా సహించుకోవచ్చు. అవి మీద పడితే ఒక్కసారిగా ప్రాణంపోతుంది. కాని మనుష్యులు చిత్రవిచిత్రంగా వధిస్తారు

ప్రభు : ఆమాటను నీవు నమ్మేటట్లయితే – ఆ చిత్రవధలను గురించే కవిత్వం వ్రాయాలి. సామాజికసమస్యలనుగురించి నీవు ఒక్క పద్యంగూడా వ్రాయవు, ఎందువల్ల?

రాజ : (తలగోక్కుంటాడు.)

ప్రభు : (రాజన్ భుజం పట్టుకొని) సామాజికసమస్యలను గురించి నీవు యెందుకువ్రాయవూ?

రాజ : వ్రాయాలని తోచలేదు గనుక.

ప్రభు : ఎందుకు తోచలేదు?

రాజ : దానికి నేనేంచెప్పను! తోచలేదు. అంతే.

ప్రభు : సామాజికసమస్యలనుగురించిన జ్ఞానముండాలి. అప్పుడే వ్రాయడానికి తోస్తుంది.

రాజ : ఏమిటో?

ప్రభు : మనుష్యునికి ఒక చరిత్రవుంది.

రాజ : ఒకటిగాదు, రెండుచరిత్రలున్నాయి. ద్రోహంచేసే చరిత్ర ఒకటి, ద్రోహంచెయ్యబడేచరిత్ర ఒకటి.

ప్రభు : సమాజంలో ద్రోహాలుచెయ్యకుండా వుండేటట్లు చేయవలసిన జవాబుదారీ మీవంటివాళ్ళపై వుంది.

రాజ : నేను యితరులచేత ద్రోహంచేయబడి - దాంతో బాధపడడానికే ప్రపంచంలో పుట్టాను.

ప్రభు : దాస్యభావాలు హృదయంలో ఆవరించుకోవడంతో యిలాంటితలపులు గలుగుతాయి.

రాజ : నీవు కారణం యేమైనా చెప్పుకో, అనుభవం మాత్రం అదే.

ప్రభు : దాన్ని మార్చాలి.

రాజ : నిజమే.

ప్రభు : దాన్ని మార్చాలని నీవంటివారు వ్రాయాలి.

రాజ : (సహనంలేనివానివలె) నీవే వ్రాయరాదా ?

ప్రభు : నేను వ్రాతగాణ్ణికాదుగదూ?

రాజ : (ఎగిరిలేచి) ఇప్పటినించీ నీ వొక వ్రాతగాడు కావాలి. సామాజికకర్తవ్యాన్ని నెరవేర్చాలి.

ప్రభు : ఇప్పు డెలా అవుతాను? పుట్టుకతో కావాలిగాని.

రాజ : పుట్టుకతోనే నీ వెంట్రుకలు క్రాఫింగుగా పుట్టాయా? నీవుగదూ క్రాపుచేసుకొన్నది. అలాగే నేటినుంచి నీ వొక కవిగా రూపాంతరం చెందాలి.

ప్రభు : నాకు సాధ్యంగాదే ?

రాజ : ఎందువల్ల? సామాజికమైన పురోగమనానికి, నిర్వహింపవలసిన కర్తవ్యంనుంచీ-నీవు దూరంగా నిలుచున్నావన్నమాట. అంతేగదూ. ఇలా నీవు తప్పించుకుంటే నేను విడువను. నీవు కవిత్వంవ్రాసితీరాలి. సామాజిక కవిత్వం వ్రాయాలి. (చేయిపట్టి యీడ్చుకొని మేజా

దగ్గర కూర్చోబెట్టి, కాగితము, పెన్సిలూ ముందుపెట్టి - ప్రభువైపు చూస్తూ) ఊఁ..., వ్రాయి.

ప్రభు : నాకు కవిత్వమొస్తేనా?

రాజ : అయితే నాకుమాత్రం సామాజికకవిత్వ మెలా వస్తుం దనుకున్నావు?

ప్రభు : ఒకరకమైన కవిత్వం వ్రాసేవానికి మరోరకమైన కవిత్వంవ్రాయడ మేమంత కష్టంగాదు.

రాజ : (కోపంతో) మిష్టర్ ప్రభూ! నీవు నేటినించీ గడ్డి తినాలి, తెలిసిందా?

ప్రభు : నీకు పిచ్చాయేమిటి?

రాజ : అన్నంతినేవానికి గడ్డితినడం కష్టమాయేమిటి ?

ప్రభు : తాను.........

రాజ : (నడుమనే) ఇక యేమీ చెప్పొద్దు. (ప్రభు అంగీ పట్టుకొని) కవిత్వంవ్రాయమంటున్నాను. నన్ను నావని మీ రెవ్వరూ చేసుకోనివ్వలేదు. మీరన్నా చేసుకోండి. ఊఁ...తొందరగా కానీ. వ్రాయి.

ప్రభు : నేననేది.........

రాజ : ఏమీలేదు. ఇతరులకు వుపదేశించడానికంటె తాను చేసిచూపడం మంచిది. కవిత్వంవ్రాయకుంటే నేను నిన్ని ప్పుడు వదలను. వ్రాయి. (పెన్సిలు చేతిలో బిఱుగాపట్టు కొనేటట్లుచేస్తాడు. కాగితం ముందుకు తోస్తాడు. ప్రభు దిగ్భ్రాంతుడౌతాడు. రాజన్ ఆమూలకు యీమూలకు తిరుగుతుంటాడు.)

రాజ : రూపము కళ్ళ బాధగయిచ్చుకోలేకపోయినా మొండికి

పడి యీ గదిలోనే వుండడం – మీ వుపదేశాలతో బాధపడడానికి కాదు. ఈ గది మీరు నాకు వుపయోగ పడకుండా చేస్తున్నారు. మీ. పనికైనా వుపయోగించు కోండి. వ్రాయి, వ్రాయి.

ప్రభు : నేనువుండడం నీకు యిష్టంలేకపోతే వెళ్ళిపోతాను.

రాజ : ఎలా పోతావు? కవితవ్రాయనిదే నిన్ను పోనిస్తేగా?

ప్రభు : (లేచి) ఏమిటి నీ ధిక్కారము?

రాజ : (పరుగెత్తివచ్చి ప్రభుభుజం పట్టుకొని, కూర్చోపెట్టు తాడు.) తప్పించుకోవడానికి వీల్లేదు. నీ సామాజికకర్త వ్యాన్ని నిర్వహించే నీ విక్కడనుండి లేవాలి. వ్రాయి 'సామాజికకవిత్వం'. ఊఁ కానీ.

ప్రభు : (కొంచెం భయపడుతూ) ఏమీ తోచడంలేదురా.

రాజ : వీపుపైన ఒకదెబ్బపడితే తోస్తుంది. (చెయ్యి పట్టుకుం టాడు. ప్రభు పెన్సిలుతీసుకొని వ్రాయడానికారంభిస్తాడు. హఠాత్తుగా గోపాల్‌జీ ప్రవేశిస్తాడు.)

గోపా : నేను ఒక్కవిషయం అడగడానికి వచ్చాను.

రాజ : వేదాంతకవిత్వంగదూ.

గోపా : (నవ్వుతూ) అవునవును. మీ రదే యెక్కువగా వ్రాయాలని నేను నిర్బంధించాను. మన సంస్కారమంతా ఆ పునాదిపైననే నిలిచివుంది.

రాజ : అదే. (గోపాల్‌జీభుజంపైన చేతులువేసి పట్టుకొని, యీడ్చుకొనివచ్చి – ప్రభుకూర్చున్న కుర్చీకిదగ్గరగా కూర్చోబెట్టి–కాగితమూ, పెన్సలూ యిచ్చి) వ్రాయాలి. నాలుగు వేదాంతకవిత్వాలు వ్రాసిపోవాలి.

గోపా : నేను కాదండీ; మీరు వ్రాయండని సలహా యిచ్చాను.

రాజ : నేను సలహా యిట్లు యిచ్చాననుకోండి, మీకు వేదాంతం బాగా తెలుసు. అదంతా కవిత్వంలో దూర్చి వ్రాయండి.

గోపా : నోటీసులు ప్రింటు వేయడంలో ఒకసందేహంవచ్చి నే నిక్కడికి.........

రాజ : ఆ కథ తరువాత చూస్తాం. ముందు వ్రాయండి. నాలుగు వేదాంతంముక్కలు కవిత్వంలో యిముడించండి.

గోపా : నేను. (లేవడానికుద్యోగిస్తాడు. రాజన్ భుజంపట్టుకొని కూర్చోబెడతాడు.)

ప్రభు : ఒరేయ్, నీ నిర్బంధం శృతిమించుతోంది. నేను పోలీసు వాళ్ళతో చెప్తాను.

రాజ : మొదట ఇక్కడినుండి లేవనిస్తే కదూ, నీవు చెప్పడం. నాలుగుకవిత్వాలు వ్రాయండి. నేను కాఫీ త్రాగి వస్తాను.

ప్రభు : (లేచి) నేనుగూడా.

రాజ : (పిడికిలిచూపిస్తూ) దెబ్బపడుతుంది. నేను వాకిలి వేసి బయటనుండి చిలుకుపెట్టుకొని పోతాను (తొందరగా నడిచి బయటనించీ వాకిలిమూస్తాడు)

గోపా : (భయపడుతూ) వాకిలిమూశాడు.

[ప్రభు అసమ్మతిగా గోపాల్‌జీవైపు చూస్తాడు.]

ప్రభు : అబ్బ !

గోపా : మనరాష్ట్రానికి వేదాంతంవాసన బాగా పట్టలేదు. అందుకే యిలాంటిచేష్టలు మిగిలాయికద్దూ!

ప్రభు : (అసహ్యించుకుంటూ) నీలాంటివాళ్ళు మనరాష్ట్రాన్ని వెనక్కు త్రిప్పడానికి చూస్తున్నారు గనుకనే యిటువంటి పనులు జరుగుతున్నాయి.

గోపా : ఇటువంటిపనులకు ఎవరు కారణమనేదాన్ని గురించి మన కిప్పుడు తర్జన - భర్జనలు వద్దు. మేము శాంతికాము కులము. ప్రభూ ! మీవంటివాళ్ళే విప్లవాలు లేపు తున్నారు.

ప్రభు : (మేజా ముందుకు త్రోసివేస్తూ) నీ మాట చాలా అన్యాయం. మేము సర్వమానవుల స్వాతంత్ర్యానికి సమ త్వానికి పోరాడుతున్నాం.

గోపా : మేముగూడా అంతే.

ప్రభు : మీరు వారిని యధాస్థితిలో వుంచుతున్నారు.

గోపా : మీరు వారిని అడవిమనుష్యులనుచేస్తున్నారు.

ప్రభు : నీ వాద మసంబద్ధము. మీవంటివారు మానవుల్లో వుండే విప్లవశక్తి నణచడానికి ప్రయత్నంచేస్తున్నారు.

గోపా : మీరు వానిని పెంచుతున్నారు. మానవులను కిరా తులనుగాచేసి - కిరాతులకు నాయకపదవులిస్తున్నారు.

ప్రభు : ఆలోచించకుండా మాట్లాడవద్దు. మార్పే జీవిత లక్ష్యం. చలనము లేనిపదార్థం నిర్జీవం, తెలుసా?

గోపా : మాటిమాటికి మారడం, అశాంతిలక్షణం. నిశ్చల మైన నీటియందే సూర్యబింబము ప్రతిబింబిస్తుంది. సత్యము నిశ్చలమైనహృదయంలోనే ప్రతిబింబిస్తుంది. అప్పుడే ఆనందము......

ప్రభు : (మాట్లాడనివ్వకుండానే) ఆ! ఆనందం, గాడిదగుడ్డు! మీవంటివాళ్ళతో మాట్లాడడం సాధ్యంగాదు. నేను పోతున్నాను. (వాకిలిదగ్గరికి పోయి, తలుపుతియ్యడానికి యత్నిస్తాడు) ఆవైపు చిలుకేట్టుకొని వెళ్ళాడు, దుర్మార్గుడు.

గోపా : నేనది తెలుసుకొనే యిక్కడినించీ లేవలేదు.

ప్రభు : ఇప్పు డేమిటివుపాయం? రాజన్ చాలా చెడ్డపని చేశాడు.

గోపా : చాలా–చాలా అక్రమం.

ప్రభు : బయట బీగం వేసుకొని వెళ్ళాడా యేమిటి?

గోపా : ఆవిషయంలో నా కొక్క సంశయంవుంది. బయట బీగం వెయ్యలేదు. చిలుకు వేసివుంటాడు.

ప్రభు : రెండూఒకటే. ఎలాగైనా–బయటనించీ యెవరైనా తీసేవరకూ తలుపురాదు.

గోపా : నిజమే. ఈ కలహానికంతా కారణం కవిత్వం.

ప్రభు :ఆ కథ యింక వదిలిపెట్టి యిప్పు డేంచేయాలో చెప్పు.

గోపా : (ఆలోచించి) ఒకవుపాయం చెప్పనా?

ప్రభు : చెప్పు, చెప్పు. ఇప్పు డీవిషయంలో మనలక్ష్యం ఒకటే. ఒకే లక్ష్యమున్న మానవులకు మైత్రికుదురుతుంది.

గోపా : నేను గట్టిగా అరవడానికి మొదలుపెడ్తాను. బయటి నించీ ఆ ధ్వని యెవరైనా విని వచ్చి తలుపుతెరుస్తారు. అప్పుడు మనం పోవచ్చు.

ప్రభు : ఛీ...ఛీ! సిగ్గుచేటు. రేపు మనము మళ్ళీ యీ బజారులో తలెత్తుకుని తిరగాలంటావా?

గోపా : అయితే యిక్కడే కూర్చొని, కవిత్వంవ్రాసుకుందాం.

ప్రభు : మనం వాడుచేసినపనికి బదులుచేయాలి.

గోపా : ఎలాచేయడం?

ప్రభు : మనము రెండుతలుపులప్రక్కగా ఒకరొకరు ఒదిగి నిలబడదాం.

గోపా : నిలబడతాం. తరువాత?

ప్రభు : వాడువచ్చి తలుపు తెరుస్తాడు గదా. అప్పుడు మనము యిద్దరం—చెరివొకవైపు పట్టుకొని నలగగొట్టుదాం.

గోపా : కొట్టాలంటావా?

ప్రభు : తప్పక. వాడుచేసినపని చూడు. ఈ గదిలో మంచి నీళ్ళుగూడా లేవు. వాడుమాత్రం హోటలుకుపోయి బాగా మసాలాదోశె—కాఫీ భర్తీచేసుకుంటున్నాడు. మన మిక్కడ గొంతులోకి నీళ్ళుకూడా లేక ఛస్తున్నాం. వాణ్ణి చావ గొట్టాలి. ఆ మసాలాదోశె కక్కేవరకూ కొట్టాలి.

గోపా : కొట్టవద్దు—అది చెడ్డపని. దెబ్బలుకొట్టుకొనేచోట పోలీసులు తయారవుతారు. పొగవుండేచోటంతా అగ్గి వుంటుందని వేదాంతులు చెప్తారు. అలాగే దెబ్బలాడే చోటంతా పోలీసులుంటారు.

ప్రభు : నీవు పిరికివాడివి.

గోపా : పిరికితనంగాదు, నేనూ — ఆ పోలీసులూ — ఒకే పరమాత్మయొక్క అంశభూతులమని నాకు తెలుసు. అందు క్కాదు నేను చెప్పింది. దెబ్బలాడుకోవడానికి వేదాంతంతో పొత్తుకుదరదు.

ప్రభు : అయితే, యిక్కడ కూర్చొని కవిత్వం యేద్చుకో.

గోపా : అలా కాదు. మనమిద్దరం-ఒక క్రొత్త సంధి ఏర్పాటు చేసుకుందాం.

ప్రభు : ఎలాగూ?

గోపా : వాకిలికియిరువైపులా నిలబడడం యిద్దరికీ సమ్మతం - అది సంధి. అతన్నిపట్టుకోవడం మనయిద్దరికీ సంధి.

ప్రభు : పట్టుకొని?

గోపా : బాగా తిట్టాలి. ఇకమీద యిలాంటిపనులు చేయనని వట్టుపెట్టుకోనేవరకూ తిట్టాలి.

ప్రభు : అది చాలా?

గోపా : గుంజిళ్ళుతీయించాలి.

ప్రభు : సరే, అలానే చేద్దాం.

గోపా : (మెల్లగా) ఒక్కొక్కచేయి ఒక్కొక్కరు పట్టుకోవాలి.

[సరేనంటూ ప్రభు తలఆడిస్తాడు. ఇద్దరూ వాకిలికిరువైపులా నిలబడిఉంటారు. బయటి వాకిలితట్టిన శబ్దం.]

ప్రభు : (నవ్వుతూ, మెల్లగా) రా! నీకు కవిత్వంచూపిస్తాం.

[వాకిలితోసుకొని లీల ప్రవేశిస్తుంది. ప్రభు, గోపాల్‌జీ ఒక్కొక్కరు ఒక్కొక్కచేయి పట్టుకుంటారు. లీల గట్టిగా అరుస్తుంది. ఇద్దరూ చేతులువదుల్తారు. లీల యిద్దరినీ కోపంగాచూస్తుంది.]

లీల : దుష్టులారా!

గోపా : కాదు, కాదు.

లీల : దొంగల్లారా! ఎవరు మీరు?

ప్రభు : (ఏడుపుమూతిపెట్టి) మేము...తరువాత...

లీల : మీా ఆట యీానాటితో కట్టిస్తాను. నే నెవరనుకు న్నారు? మీావంటివాళ్ళు వూళ్లోవుంటే యింక ఆడపిల్లలు బ్రతకడానికి వీల్లేదు.

ప్రభు : కొంచెం మెల్లిగా తిట్టాలని మా ప్రార్థన.

లీల : మెల్లిగా యెందుకు తిడ్తాను! గట్టిగా అరుస్తాను. జనం గుంపులుగా చేరాలి. అందరూ మిమ్మల్ని చూడాలి.

గోపా : తెలియక...

లీల : (ఆయనమీాదికి పోతుంది) తెలియకేమిటి? తెలియ కుండా యిలాంటిపను లెవరైనా చేస్తారా? నేను మిమ్మల్ని...

గోపా : క్షమించాలి. మేము సంస్కారసంపన్నులైన పెద్ద మనుష్యులం.

లీల : అది మీాముఖంచూస్తూనే తెలిసింది.

ప్రభు : మిమ్మల్ని యితరులని భ్రమించి...............

లీల : అయితే, నావంటిమరొక్కరిపై యిలాంటిదుర్మార్గం చేయడానికి తయారై కూర్చున్నారన్నమాట. ఏమి దుర్మార్గం.

గోపా : అలాకాదండి.

లీల : నా కంతా తెలిసిందిలే. ఈ యింట్లో యిలాంటిపనులు జరుగుతూంటాయన్నమాట! ఈనాటితో యీాదుర్మార్గం తీరుస్తాను.

[రాజన్ ప్రవేశిస్తాడు]

రాజ : ఏమి టీ కలహం?

లీల : మీకు ఇల్లిచ్చినదానియొక్క అనుభవం. ఇలాంటి దొంగల్నందర్నీ యింట్లో చేరుస్తున్నారు. వీళ్ళు మావంటి వారి నవమానిస్తున్నారు. ఏమిపనులివి?

రాజ : ఏమి జరిగింది?

లీల : (గట్టిగా) ఈ దుర్మార్గులు నన్ను పట్టుకొన్నారు.

రాజ : ఎందుకు?

లీల : నే నేమి చెప్పను? వారినే అడగాలి.

రాజ : (చేతులుపిసుక్కుంటూ లోపలకివచ్చి) ఆవిడ చెప్పే మాట నిజమేనా? (ఇద్దరూ భయంతో ఒదుగుతారు. రాజన్ వాళ్ళపైకి పోతాడు)

గోపా : జరిగినకథఅంతా మేము సవిస్తరంగా చెప్పుతాం.

రాజ : (కోపంగాచూస్తూ) అక్కడ కూచోండి.

[ప్రభు - గోపాల్‌జీ యిద్దరూ కూర్చుంటారు]

గోపా: మీరే వస్తున్నారనుకొని మే మామెను పట్టుకొన్నాం. నే నొక సంస్కారమున్న మనిషిని.

లీల : సంస్కారమూ-నీ పిండాకూడు. రాజన్, మీరు బాడుగ యివ్వలేదు. అది అడగడానికి వస్తే, నన్నవమానించారు. మీరు వెంటనే గది ఖాళీచేయాలి.

[రాజన్ అందరినీ చూస్తూ - దిగ్భ్రాంతుడై విలుస్తాడు]

ప్రభు : మిష్టర్ రాజన్!

రాజ : (ప్రభుఅంగీపట్టుకొని) ఇది నీ యిల్లాయేమిటి?

ప్రభు : కాదు.

రాజ ; (గోపాల్‌జీతో) నీ యిల్లా?

గోపా : (కాదని తలూపుతాడు)

రాజ : ఈ యింటికి బాడుగ యివ్వద్దూ?

ప్రభు : ఇవ్వాలి.

రాజ : పనిచేయకుండా బాడుగయివ్వడానికి నాకు డబ్బె క్కడినుండి వస్తుంది? మీరిద్దరూ నాపనిని చెరిచారు.

గోపా : (భయపడుతూ) అది...... మేము......

రాజ : ఇంటిబాడుగ మీరే యిచ్చుకోవాలి. కక్కు ఇరవై ఐదురూపాయలు

[గోపాల్‌జీ-ప్రభు భయపడుతూ పరస్పరం చూచుకుంటారు]

రాజ : 25/ రూపాయలివ్వాలి. ఇవ్వకుంటే దెబ్బపడుతుంది.

ప్రభు : నాదగ్గర పదకొండురూపాయలే వున్నాయి.

రాజ : మేజాపైన పెట్టు.

[ప్రభు రూపాయలుతీసి మేజాపైన పెడుతాడు. రాజన్ వానిని వదలి పెట్టి, గోపాల్‌జీని పట్టుకొంటాడు]

రాజ : తక్కినడబ్బు?

గోపా : (తక్కినడబ్బు జేబిలోనుంచీ తీసి మేజాపైన పెడ్తాడు)

రాజ : డబ్బెంతుంది?

గోపా : ఇరవైమూడురూపాయలు.

రాజ : చాల్లే. ఇక మీరిద్దరూ ఎవరికీ ఏమీ వుపదేశించ కూడదు. తెలిసిందా? తిరిగిచూడకుండా పరుగెత్తిపోవాలి.

ప్రభు : (తలవాకిలివైపు పోతూ) మేము యీ కథఅంతా పోలీసులకు చెబుతాం.

లీల : నేనూ వస్తాను. మీ దుర్మార్గం పోలీసులతో చెప్తాను.

ప్రభు : అబ్బే! మేము తమాషాకన్నాం.

రాజ : ఉ, ఊరకండి.

[ప్రభు, గోపాల్‌జీ వెళ్ళిపోతారు]

రాజ : (డబ్బుయెంచి లీలముందుంచి) ఇదో, యింటిబాడుగ. నమస్తే!

లీల : (మధురంగా) మీకుకష్టంగావుంటే యిప్పుడువద్దులెండి.

రాజ : (ఆమెవైపు చూడకుండా) నా కష్టంతీరిందిలే. తీసుకొనిపొండి.

రాజ : ఎందుకు నన్నిలా తొందరగా తరిమేస్తున్నారు?

రాజ : (కాగితంవైపు చూస్తూ నాకు పనివుంది.

లీల : అయినా......ఒక హృదయంలేనిమనుష్యునివలె–

రాజ : మీరు వెళ్ళిపొండి.

లీల : (ముఖంచిన్నబుచ్చుకొని) అయితే, యింతేగదూ? (బయటికి నడుస్తుంది)

రాజ : ఈ డబ్బు తీసుకోండి.

లీల : వద్దు.

రాజ : ఇదో, నేను చెబుతున్నాను. ఇప్పుడు తీసుకోకుండా వుంటే, యింటిబాడుగ తీరదు.

లీల : తీరవలసిన అవసరంలేదు. (నవ్వుతూ వెళ్ళిపోతుంది)

రాజ : తీరవలసిన అవసరంలేదూ? ఇదేమిటీ?............ (ఆమెపోతున్న దారివైపుచూస్తూ కుర్చీలోకూర్చుంటాడు)

[తెరపడుతుంది]



# ఏకాదశీ మాహాత్మ్యం

[ఏకాంకం]

రచయిత :

'తీక్కొ_డియన్'

ఇతడు హాస్యరస ప్రధానములైన రచనలతో సాహిత్యరంగమందు తొలుత ప్రవేశించాడు. క్రమంగా నాటకకారుడుగా ప్రసిద్ధివచ్చింది. తొలిరోజుల్లో 'సంజయన్' అను మాసపత్రికలో తరచు వ్రాస్తూండేవాడు. ఆ పత్రిక ద్వారానే ప్రసిద్ధికి వచ్చాడు. నాటకాలలో కూడా "ఫలిత" సాహిత్యఫలాన్ని చూపించవచ్చుననే విషయం ఈ యేకాంకిక రుజువు పరుస్తుంది. ఔచిత్యాన్ని చెరచకుండా హాస్యాన్ని పోషించడంలో యీ రచయిత చమత్కారం వుంది. స్వదేశం "తిక్కొ_డు" అది వుత్తర మలబారులో వుంది. ఇతని పూర్తిపేరు కుఞ్ఞి అనంతన్నాయరు.

## పాత్రలు:

శంకరన్నాయరు – 60–62 సం॥ల వయస్సు. కపట భక్తి. లోభిత్వం ఇతని స్వరూపం.

మాధవి అమ్మ – 50–52 సం॥ల వయస్సు. కొంచెం కోపం గలది. శుద్ధమైనస్వభావంగల స్త్రీ.

మాలతి – 20–22 సం॥ల వయస్సు. పెండ్లికాని పడుచు. ఏకాదశీవ్రతనియమాలతో బాధపడుతూంటుంది. అమ్మదగ్గరమాత్రం కొంచెం స్వాతంత్ర్యం. ఏ ప్రేమప్రసంగము లేదు.

చాత్తప్ప – 60–62 సం॥ల వయస్సు. సత్యసంధుడు. ఉపవాసాలతోను, రోగాలతోను చిక్కిపోయిన శరీరం.

అప్పమేనాన్ – ప్రాయం 30–35. నిలువెల్లా కుట్ర. మంచి వ్యవహారజ్ఞుడు.

సుకుమారన్ – ప్రాయం 18–20. శంకరన్నాయరు కొడుకు. తండ్రిలోభిత్వానికి దైవంసృష్టించిన ఒక అపవాదు. నాగరకుడు; ఉదారుడు; వివేకహీనుడు.

# ఏకాదశీ మాహాత్మ్యం

[తెరఎత్తేవేళకు తెల్లగా - లావుగా విఘ్నేశ్వరుడిలావున్న శంకర న్నాయరు - తన యింటిముందరివరండాలో యీజీచైరుపై పండుకొని 'ఏకాదశీమాహాత్మ్యం' చదువుతూంటాడు. అది ఒక ప్రాత యింటివరండా, తలవాకిలి. దానికిరువైపులావున్న గోడలుమాత్రమే వెనుకవైపున కనపడు తూన్నాయి. కిటికీలు ఏమాత్రం లేవు. వాకిట్లోనించి లోనికి వెడుతూనే - ఒక మేజా - దానినానుకొనివున్న ఒక యీజీఛైరూ వున్నాయి. దానికిదగ్గ రగా ఒక బెంచీకూడా వుంది.

ఎడమవైపుకూడా ఒక యీజీఛైరూ - దానినానుకొని ఇంకొక బెంచీ. పేపరు చదివేటప్పుడో - పురాణం చదివేటప్పుడో - పారాయణం చేసే టప్పుడో శంకరన్నాయరు - వచ్చి ఆ యీజీఛైరుపైన కూర్చుంటాడు. ఇవి తప్ప - రంగంలో మరి ఏ పదార్థమూ వుండకూడదు.

శంకరన్నాయరు 60 సంవత్సరాలుగడచిన మనిషి. మంచి ఆరో గ్యంగావున్న దేహం అగుటవల్ల - చూడటానికి అంత ముసలివాడుగా అగు పించడు. హృష్ట - పుష్టమైన ఆ శరీరంలో ముక్కాలుభాగంనిండా భస్మ రేఖలు పూసుకున్నాడు. ఆ రేఖలపైన చందనమూ. ఈజీఛైరుపై పండు కొని, ఏకాదశీమాహాత్మ్యం చదువుతున్నాడు. ఆ చదవడంలో కొంచెం రాగ చ్ఛాయ - కొంచెం భక్తిచ్ఛాయ కనుపిస్తాయి.]

శంక : (ఏకాదశీమాహాత్మ్యం చదువుతూ – చదువుతూ పుస్త కంలో గుర్తుకుగాను ఒక వేలు పెట్టి పుస్తకం మూసేస్తాడు. ఒక్కసారి నీల్గి ఒళ్ళువిరుచుకుంటాడు. గట్టిగా ఆవులిస్తూ) భగవంతా! విశ్వంభరా! కృష్ణా! కృష్ణా! జగన్నివాసా!

[అని అరుస్తాడు. మరల అవులిస్తాడు. ఆవలింతయొక్క శబ్దం భయంకరంగా వుంది. ఆ శబ్దం చెవిలోపడి లోపలినించీ ఆయనభార్య మాధవి గట్టిగా అరుస్తుంది]

మాధవి : (లోనుంచి) ఆ ......ఏవిటీ ?

శంకర : (మరలా యథాప్రకారం ఏకాదశీమాహాత్మ్యము చదవటానికారంభిస్తాడు)

మాధవి : (నడవడంలో కష్టపడుతూ లోపలనుంచీ బయటికి వస్తుంది. ఆవిడ నల్లనిమనిషి. లావుపాటిశరీరం. కొంచెం పొడుచు. సుమారు రేబదిసంవత్సరాలుంటాయి. తలంతా తెల్లగా నెరిసిపోయింది. ఆమె వచ్చి యీజీఛైరుకుపక్కగా నిలచి) ఎందుకు నన్ను పిలిచారు ?

శంకర : (కొంచెం ఆశ్చర్యంకనపరుస్తూ) ఏమిటీ !

మాధవి : ఎందుకు నన్ను పిలిచారూ, అన్నాను.

శంకర : (పుస్తకంమూసి, చేతిలోపట్టుకొని మరలానీల్గుతాడు) నీ చెవులు చెడిపోయినట్టున్నాయి.

మాధవి: అదే, అదే. ఎవరికి చెవులు సరిగా వినపడనిదీ-అనే విషయం నాకు తెలుసులెండి

శంకర : ఎవరికంటావు?

మాధవి : ఎవరికో ఒకరికి లెండి! ఇప్పుడు దాన్ని విస్తరించిచెప్ప వలసిన అవసరమేముంది.

శంకర : ఏదీ! ఒకసారి చెప్పు విందాం.

మాధవి : ఎవరికుంది? మీకే.

శంకర : భేష్! బాగా కనుక్కున్నావు.

మాధవి : రాత్రిపూట మీకు బొత్తిగా వినపడదు.

శంకర : చాలా మంచిమాట చెప్పావు! చెప్పడుకుగూడా రాత్రి – పగలూ రెండుబేధాలున్నవన్నమాట.
మాధవి : నాకు తెలీదు ఏదైనా ఒకరహస్యం మీకు చెప్పాలంటే నాకు ప్రాణంపోతుంది.
శంకర : అవునవును – నీవు రాత్రిపూట ఒక్కమాటగూడా మాట్లాడడంలేదు, పాపం! చీకటిపడిందంటే. ఏదేదో వదరడం ఆరంభిస్తావు. నీ వదరడంలో – ఒక్కనాడైనా – నన్ను నిద్రపోనిచ్చావా!
మాధవి : నేనలా వదరకపోతే – నామాటే మీకు వినపడదు. ఇప్పుడీ సంగతులనుగూర్చి మీతో వాదించడానికి నాకు పొద్దులేదు. వంటయింట్లో నా కాస్త పనుంది.
శంకర : అయితే, నిన్నిప్పుడు పోట్లాడమని ఎవరు చెప్పారు?
మాధవి : అది సరేలెండి. కాని, నన్ను మీరెందుకు పిలిచారని అడుగుతున్నాను.
శంకర : ఎవరు పిలిచారని?
మాధవి : పిలవకపోతే – మరి శబ్దమెలా వినపడింది?
శంకర : అయితే, ఎవరే శబంచేసినా నిన్ను పిలిచారన్నమాటే!
మాధవి : కాకుంటే –
శంకర : కాకి అరచినా – గాడిద ఓండ్రపెట్టినా– అవి నిన్ను పిలిచాయన్నమాటేనా?
మాధవి : నేను విన్నశబ్దం అలాంటిదిమాత్రంకాదు.
శంకర : ఇక్కడ వేరేశబ్దం ఏదీ రాలేదు.
మాధవి : (కొంచెంకోపంగా) బాగానేవుందిలెండి. ఈ వర్ణ

స్సులో పిల్లల్లా ఆటలాడాలనిపిస్తూందిగదూ! (లోపలికి పోవడానికి ముఖంతిప్పుతుంది)

శంకర : మాధవీ!

మాధవి : (తిరిగి నిలిచి) ఏమిటి?

శంకర: అకారణంగా నిన్ను నే నెందుకు పిలుస్తాననుకున్నావు? ఇక్కడ కూర్చొని ఒక్క అవులింతతీశా నంతే - అది తప్పితే వేరే ఏ శబ్దమూ రాలేదు.

మాధవి : (కోపంతో) మంచిపని అయింది లెండి. (లోనికి వెళ్ళి పోతుంది)

శంకర: (కొంచెంగా నవ్వుతూ) తమ చెవుడు తాము తెలుసుకోలేక-యితరులను ఆక్షేపిస్తారు! యేంచేయండం ?... విశ్వంభరా...కృష్ణా...కృష్ణా...జగన్నివాసా !

[మరలా యేకాదశీమాహాత్మ్యం యెత్తి చదవడానికారంభిస్తాడు. చదివే కొద్దీ అవులింత లెక్కువవుతున్నాయి. ఏమిచేసినా చదువు సాగేటట్టులేదు. రవ్వంతసే పూరకేవుంటాడు. 'మాలతీ....మాలతీ!' అని బదులు యేమొస్తుందోనవి విన్నట్లు నటిస్తూ]

అమ్మాయీ! మాలతీ!... (మరలా వింటాడు.)

మాలతి : (లోనుంచి) ఇదో వస్తున్నాను నాన్నా.

శంకర : ఇదిగో, తొందరగా యిక్కడికి వచ్చి పో.

[మాలతి శంకరన్నాయరు కూతురు. వయస్సు 20, 22 యేండ్లు వుంటాయి. పావడా-రవిక వేసుకొని, పైన పైటధరించింది. ఆమెకుడి చేతిలో కత్తి - ఎడమచేతిలో సగంతరిగిన అరటికాయ. ఆమెపై ఖరి చూస్తే, అరటికాయతరుగుతూ తరుగుతూ లేచివచ్చినట్లుంది.]

మాలతి : ఏమిటి? పిలిచారు.

శంకర: పిలిచానమ్మా! ఇదో, ఈ పుస్తకం తీసుకో. కొంచెం చదువు. (చేతిలోనిపుస్తకం ఆవిడకందివ్వబోతాడు. ఆమె చేతిలోవున్న కత్తిని, అరటికాయను చూచి వులిక్కిపడతాడు.) ఏమిటమ్మా యివి చేతిలో?

మాలతి : (తొందరగా సత్యంచెప్పేస్తున్నస్వరంతో) ఏమీ లేదు. పులుసుకి అరటికాయలు తరుగుతున్నాను. ఇంతలో మీరు పిలిచారు.

శంకర : (ముఖంముడుతలుపెట్టి) ఏమిటీ! పులుసా? ఈ ప్రొద్దు పులుసెందుకు? ఇవ్వాడు పులుసెందుకు? పులుసుతో యేంపనుంది?

మాలతి: (చెప్పినమాటకి పశ్చాత్తాపపడుతున్నట్టు నటిస్తూ-దాన్ని కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తూ) నాన్నా! నేను పొరపాటు చెప్పాను. నేను తరుగుతున్నది పులుసులోకి కాదు.

శంకర : అయితే?

మాలతి : అమ్మ పెసలతో యేమో ఫలహారం తయారు చేస్తూంది-అందులో వేయటానికని అరటికాయలు తరగమన్నది.

శంకర : ఓహో! ఏకాదశీఫలహారం అన్నమాట

మాలతి : అదే (తలఆడిస్తుంది)

శంక : అయ్యో! అబ్బబ్బ! ఈ ఆడవాళ్ళ కెంత చెప్పినా అర్థంకాదు. నేను మీఅమ్మతో యేమనిచెప్పాను?

మాలతి ; నీ వేంచెప్పావో నాకు తెలీదు నాన్నా.

శంకర : నీ కెలా తెలుస్తుందిలే. మీ అమ్మ యిల్లంతా గుల్ల చేయడానికి పుట్టింది. అంతా నాశనమైపోనీలే. నీకైనా కాస్త బుద్ధివుంటుందనుకొన్నాను. అదికూడా లేక పోయింది.

మాలతి : అయితే నన్నేంచేయమంటారు?

శంకర : ఏంచేస్తావు పాపం! నీకుకూడా వయస్సెక్కివచ్చిందని జ్ఞాపకంవుందా లేదా? ఇప్పుడుగాకపోతే యింకెప్పుడు నీకు తెలుస్తుంది? (కొంచెం ఆలోచించి) యిప్పుడీ ఫల హారం యెందుకు తయారుచేస్తున్నట్లు?

మాలతి : (ఆయనప్రశ్న అర్థంకానట్లు ముఖంపెట్టి) తినడానికి కాదూ?

శంకర : అదే; అదే. తిని తిని కొంపంతా దోచెయ్యండి. మీ కడుపులెలాంటివో నాకు తెలీడంలేదు. (కోపంతో గట్టిగా అరుస్తాడు) మాధవీ! మాధవీ! ఖర్చు, ఖర్చు. ఒక్కటేఖర్చు. ఎక్కడపట్టినా తలకుమించినఖర్చు. మీతో నే నీ సంసార మెట్లాతీర్చాలో తెలీటంలేదు. (మరలా వక్క సారి గట్టిగా) మాధవీ! మాధవీ!

మాధవి : (మాట్లాడకుండా నడచివస్తుంది.)

శంకర : పిలిస్తే బదులేపలుకవు. ఎందుకని?

మాధవి : (మాట్లాడకుండా నిలుచుంటుంది.)

శంకర : పిలిస్తే బదులివ్వవలసిన బాధ్యతలేదూ!

మాధ : మీపుణ్యంవుంటుంది. ఆ యీజీఛైరు ఎత్తుకొని వంటింట్లోకి రండి. అక్కడే కావలిసినన్ని విషయాలు మాట్లాడుకుందాం.

శంకర : ఎందుకంటావు?

మాధవి : బయటకూర్చొని మీరిలా రగడచేయడం ఏం బాగాలేదు. లోపలకూర్చొని మాట్లాడితే బాగుండదూ!

శంకర : అయితే, ఇకమీద వంటింట్లోనే గడపవలసినభాగ్యం నాకుపట్టిందనికదూ నీవనడం!

[ఆయనమాట కర్థంతెలియనట్లు మాధవిముఖభావం సూచిస్తుంది]

శంకర : నాశనం చెయ్యి. కొంపంతా నాశనం చెయ్యడానికి తయారయ్యావులే!

మాధవి : మీరు చెప్పవలసిందేదో స్పష్టంగా చెప్పండి.

శంకర : అందరూ ఏకాదశి ఎందుకుచేస్తారో నీకు తెలుసా?

మాధవి : ఆ విషయాలన్నీ మీకుపట్టినవి.

శంకర : మీకుపట్టలేదన్నమాట. అబ్బబ్బ! మహాపాపం!

మాధవి : అయితే నన్ను యిప్పుడు పిలవడం ఏకాదశి ఎందుకనుసరిస్తారో తేల్చడానికన్నమాట.

శంకర : కాదు.

మాధవి: ఇంకెందుకు పిలిచినట్లు?

శంకర : ఈ మాలతి - అరటికాయ లెందుకుతరుగుతున్నట్లు?

మాధవి : ఈవిషయం దాన్నే అడిగితే సరిపోయివుండేదిగదూ!

శంకర : అయితే, అడగలేదంటావూ! అడిగాను.

మాధవి : ఏమంది?

శంకర : ఏమంటుంది?– ఆతల్లిబిడ్డేగదూ! మాధవీ! ఒకమాట చెప్పుతున్నాను విను. ఏకాదశిని అనుసరించడం – పుణ్యానికిమాత్రమే గాదు.

మాధవి ; అయితే, ఏమిటి మీరనేది? పాపానికూడా నా?

శంకర : పుణ్యంరావడంతోపాటు కొంచెం ఇంటిఖర్చుకూడా తగ్గుతుందని ఏకాదశిచేస్తాము. ఒకనెలకు రెండేకాదశు లొస్తాయి. ఆ రెండేకాదశులూచేస్తే యింటిఖర్చులో నాల్గయిదురూపాయలైనా తగ్గాలి. లేకుంటే ఆ వ్రతం ఎందుకుచేసినట్లు?

మాధవి: ఏమన్నాలింటే—పుణ్యంసుతరామూ రాదన్నమాట.

శంక : ఏడిసినట్టేవుంది నీతెలివి! పుణ్యంకథ నిన్నెవరడిగారు? అది సరేగాని, ఇప్పుడు ఫలహారం నీ కెందుకు చేస్తున్నట్టు?

మాధవి : తినడానికి- ఇంతమాత్రం తెలీదూ?

శంకర:తినితిని మీరు కొంపతీసేస్తున్నారు ఫలహారంచేస్తేమా త్రం పెసరపప్పు - అరటికాయలు – రెండూ ఎందుకు వాడాలి? ఒకదానితో సరిపెట్టుకోకూడదూ – రెండింతలు ఖర్చుగదూ?

మాధవి: ఏకాదశి అని వుపవాసాలతో ఛావడం మాచేతగాదు. ఆకలిపోవటాని కేదోఒకటి తినితీరాలికదూ.

శంకర : అబ్బే! ఊరికే తినటమా? బాగా తినండి. ముప్పొద్దూ తినండి. చేరెడు పెసరబేడలు వేసి, దండిగా నీళ్ళుపోసి – కొంచెంగా చక్కెరవేసి పాయసం తయారుచెయ్యమని చెప్పలేదూ? అది తాగితే ఆకలిపోదన్నమాట? నాలుగు కాసులు మిగలడం మీ కేమాత్రం యిష్టంగాలేదు. నే నేమిటిచేయడం?

మాధవి : మాటలుచెప్తే పనులైపోవు.

శంకర : ఎందుకౌతాయి? ఇంట్లో నా మా టొక్కటీ సాగ డంలేదు.

మాధవి : సాగకుంటే పూరకుండండి. ఇంట్లో యేమేం చేసుకోవాల్సిందీ మాకు తెలియంది మీకు తెలుస్తుందా? (నడచిపోవడానికి మొదలుపెట్టుంది. అలా కొంతదూరం వెళ్ళి వెనుదిరిగి) ఇదిగో, నేను వంటయింట్లోకి వెడుతూనే మళ్ళీ మాధవీ! మాధవీ! యని మీ పాట ఆరంభించండి, తెలిసిందా? (కోపంగా వెళ్ళిపోతుంది )

శంకర : (కొంతసేపు ఆలోచిస్తూ అటూ - యిటూ పచారు చేస్తాడు. మరలా కుర్చీపై కూర్చుంటాడు) ఇదిగో, అమ్మాయీ! ఇటు కొంచెం రామ్మా. ఇది కొంచెం చదువు. (ఏకాదశీమాహాత్మ్యంపుస్తక మాె మెకందిస్తాడు)

[మాలతి చేతిలోని చురకత్తి తీసి, ఒకప్రక్కగా పెట్టి పుస్తకం తీసుకుంటుంది. తీసుకొని, చదవడాని కారంభిస్తుంది. శంకరన్నాయరు కళ్ళు మూసికొని వింటుంటాడు, అలా కొంతసేపు గడుస్తుంది. మాలతి యిష్టం వుండీ-లేక-చదువుతూవుంటుంది. క్రమంగా చదివేశబ్దం తగ్గి ఆవులింత వస్తుంది.]

శంకర : (కళ్ళు తెరవకుండానే) మాలతీ! నీవు చదవటంలేదూ?

[మాలతి వులిక్కిపడి వెంటనే చదవడానికారంభిస్తుంది.]

శంకర : (మెల్లిగా కళ్ళు తెరచి) అమ్మాయీ! యీ ఏకాదశీ వ్రతం చాలా గొప్పది. అర్థమయిందా?

మాలతి : అవును నాన్నా!

శంకర : పూర్వకాలం అంబరీషుడనే రాజుండేవాడు. (లోపల టెంకాయకొడుతూన్నశబ్దం) అదిగో! అదిగో! నీవూ విన్నావుగదూ! ఈ కొంపలో ఖర్చుకు మితమేలేకుండా వుంది. ఈపొద్దు ఏకాదశి కదా, టెంకాయకొట్టడ మెం

దుకు? ఛీ, ఛీ. కృష్ణా...కృష్ణా...ద్వారకావాసా... కొంపంతా నాశనంచేస్తూంది...పోనీలే, విన్నావుగదా? అమ్మాయీ! అంబరీషుడు మహాభక్తుడు. ఒక్కరోజు కూడా ఏకాదశీవ్రతం తప్పినవాడుగాదు.

[మాలతి ఆవులిస్తుంది.]

శంకర : ఛీ! నీవు వినడమేలేదు.

[మాలతి మరలా వులిక్కిపడ్తుంది]

శంకర: నేను చెప్పేదిఒక్కటీ నీవువినడంలేదు. వింటున్నావా?

మాలతి: వింటున్నా నాన్నా.

శంకర: అంబరీషునికథ నేనింతకుముందే నీకు చెప్పానుగదూ?

మాలతి : (అవునన్నట్లు తలవూపుతుంది)

శంకర - అదంతా పూర్తిగా మరచిపోయావుగదూ?

మాలతి : లేదు, లేదు.

శంకర: ఛేమ్! అయితే పైకథ నీవు చెప్పు.

మాలతి : (వులిక్కిపడి) అంబరీషునికథగదూ?

శంకర : అదే, అదే.

మాలతి: (నాలుకతో పెదవుల్నితడుపుతూనాలుగుదిక్కులూ చూస్తుంది.)

శంకర : ఏమి? ఏమిచెప్పాలో తెలీడంలేదూ?

మాలతి: తెలుసు నాన్నా.

శంకర : అయితే ఆలస్యందేనికి?

మాలతి : అంబరీషుడు ఒకరాజు.

శంకర : అది నాకు తెలీదనుకున్నావా? నేను చెప్పిందేకదూ ఆ తరువాత చెప్పు.

మాలతి : అంబరీషుడు గొప్ప శూరుడు.
శంకర : ఎవరూ? అంబరీషుడా?
మాలతి: (జంకుతూ)తరువాత......అంబరీషుడుదయాళువు. సత్యసంధుడుగూడా. ఆ రాజు పే రంబరీషుడు.
శంకర: (పళ్ళుకొరుకుకుంటూ)ఇదంతా ముందు యేడ్చినకథే గదూ.
మాలతి : అంత భక్తివుండేరాజు మరొక్కడులేడు.
శంకర : (సంతోషంతో తలఆడిస్తూ) బాగా చెప్పావు. అంబరీషుడు మహాభక్తుడు.
మాలతి : ఆ రాజు ప్రజల నెంతో ప్రేమించాడు. చక్కగా రాజ్యం పాలించాడు.
శంకర : ఈ విశేషణాలన్నీ ముగించి త్వరగా కథచెప్పు.
మాలతి : ఆరాజు ఒక్కఏకాదశికూడావిడువకుండాచేసేవాడు.
శంకర ; (సంతోషంగా) నామాదిరే నన్నమాట!
మాలతి : ఏకాదశీవ్రతంనిలుపక చేస్తుండేదానివల్ల మహావిష్ణువునకు ఆయనపైన యెంతో దయగలిగింది.
శంకర : (కండ్లుమూసికొని నమస్కారంచేసి) భగవంతా! విశ్వంభరా...ఏకాదశీవ్రతంపాలించే భక్తులకు నీవు భక్తుడవు. (కండ్లుతెరచి) తరువాత?
మాలతి : ఆ అంబరీషుడు ఒక రాజకన్యను పెండ్లాడాడు.
శంకర : ఈ విషయాలన్నీ తొందరగా ముగించి కథచెప్పు.
మాలతి : ఆయనకు నలుగురుకొమాళ్ళు నలుగురు బిడ్డలు.
శంకర : (కోపంతో) నీకు కథ తెలియనట్లుంది.
మాలతి : (జంకుతూ) తెలీకేమి. తెలుసు నాన్నా.

శంక : అయితే చెప్పు మరి.

మాల : (జంకుతూ) ఒకనాడు ఒక రాక్షసుడు...

శంక : ఛీ...ఇక నిలుపు...రాక్షసు డేమిటే! నీ కా కథ కొంచెంకూడా తెలీదు. అంతా మరచిపొయ్యావు. ఛీ...ఛీ...నీ తలకాయలో మట్టివుంది......

[వెనుక యెవ్వరో దగ్గినట్టవుతుంది. శంకరన్నాయరు తిరిగిచూస్తాడు. పొలముకాపు చాత్తప్ప ఒకమూలకు ఒదిగి - ఒదిగి నిలబడివుంటాడు.]

శంక : మాలతీ! నీవు లోపలికి పో. మరలా వచ్చి యీ పుస్తకం చదువుదువుగాని.........

[మాలతి ఏదో పెద్దభారం తీరిపోయినట్లు కత్తితీసికొని లోనికి వెళ్లుతుంది. చాత్తప్ప కొంచెం ముందుకు వచ్చి నిలుస్తాడు. ఆయనకుగూడా శంకరన్నాయరంత వయసుంటుంది. కాని, శరీరమంతా రోగాలతో శిధిలభూతమయింది. అంతకుముందే యేదో పెద్దజబ్బులోపడి - ఇప్పుడిప్పుడే కోలుకున్నాడు. తలపైన అక్కడక్కడ నాలుగు వెంట్రుకలుమాత్రము వున్నాయి. మాట్లాడేటప్పుడు నడుమ-నడుమ దగ్గుతాడు.]

శంక : ఏమిటి చాత్తప్పా విశేషాలు? ఇంకా కొంచెం దగ్గరికి రా.

చాత్తప్ప : (కొంచెం ముందుకు జరుగుతాడు)

శంక ; నీకు క్షేమమేగదా?

చాత్త : (బాధగా నవ్వుతూ-దగ్గడానికి మొదలుపెట్టుతాడు)

శంక : ఇప్పు డారోగ్యం కొద్దిగా బాగుపడిందనుకుంటాను, కదూ?

చాత్త : ఈ దాసుడు చాలారోజులు జబ్బుతో పడివుండినాడు.

శంకర : అదెవ్వడు? అయితే యీనడుమ—కొంచెం మందు-గిందు తీసుకున్నావన్నమాట! శరీరం బాగుపడిందనుకుంటా.

చాత్తప్ప : మలేరియాతో బాధపడ్డాను. చాలానాళ్ళు మంచంపట్టి- శరీరం శుష్కించిపోయింది. దానికితోడు యిప్పుడు కొంచెం వాతంగూడా జాస్తిఅయింది.

శంకర : అయితే, గురువాయూరుకు పోయి, కృష్ణునికి సేవ చేయాలి, చాత్తప్పా. వాతరోగాలకు గురువాయూరు పెట్టిందిపేరు. ఇప్పుడు కొంచెం సుఖంగావున్నావుగదూ?

చాత్తప్ప : ఏదో కొంచెం.

శంకర : ఇకమీద రోగంవస్తే – గురువాయూరుకు తప్పక పోవాలి, తెలిసిందా?

చాత్తప్ప : అయ్యో! యిక యిలాంటిరోగం మరలా వస్తే, నా పని అయినట్టే!

శంకర : సరే కానీ, ఇప్పుడిలా వచ్చావేమిటి?

చాత్తప్ప : రోగంవస్తేమాత్రం ఆడినమాట తప్పుతానా స్వామీ? తమతో నా గోడు చెప్పుకుందామని వచ్చాను.

శంకర : కానీ! నిముషంలో చెప్పెయ్యాలి. ఈప్రొద్దు నేనెవ్వరితో మాట్లాడేఅలవాటు లేదు. ఈప్రొద్దు యేకాదశికదూ! అయినా, కర్మబంధాలు కొన్ని నన్ను విడువకుండా పీడిస్తూవుంటాయి. ఈప్రొద్దు కేవలం పురాణశ్రవణంతో కాలక్షేపంచేయాలి. నీవు యింతదూరం కష్టపడివచ్చావని యేదో నాలుగుమాటలు మాట్లాడుతున్నాను. లేకుంటే, దేవుడువచ్చినా పలికేవాణ్ణిగాను. నీవు

మా యింటి-సంబంధం నిన్నా-మొన్నటిది కాదుగదూ! అందువల్ల మాట్లాడుతున్నాను.

చాత్తప్ప : నిజమే.

శంకర : అందుకే చెబుతున్నాను. ఏదో నాలుగుమాటలలో ముగించు.

చాత్తప్ప : నేను చాలా కష్టంలోవున్నాను.

శంకర : ఎవరితో మాట్లాడినా యిలానే అంటారు.

చాత్తప్ప : నా కష్టాలు అలాంటివిగాదు. చాలా బాధలలో వున్నాను.

శంకర : ఉండవచ్చు. అంతా ఆ భగవానునిలీల.

చాత్తప్ప : నన్నిలా కష్టపెట్టడానికి భగవంతునికి నేనే అవకారమూ చేసివుండలేదు.

శంకర : ఆ భగవానుడికే చేయాలాయేమిటి? మనుష్యులకు చేసినా - ఆయనకు చేసినట్లే. ఇంతకుముందు - జన్మలలో చేసింది యీ జన్మలో ఫలించివుంటుంది.

చాత్తప్ప : ఈ రోగంతో చేతిలోవున్నడబ్బు నీళ్ళలా కారి పోయింది.

శంకర:చాత్తప్పా! డబ్బుకు ఖర్చుపెట్టడమేగదూ ప్రయోజనం.

చాత్తప్ప : ఉంటే ఖర్చుపెట్టడానికి సందేహంలేదు. గతిలేనప్పుడు ఖర్చులు పైనబడితే-ఓర్చుకోవడం కష్టమౌతుంది.

శంకర : సరి, సరి. నాకు పురాణానికి ప్రొద్దుపోతూవుంది. ఇప్పు డెందుకువచ్చావో చెప్పు.

చాత్తప్ప : తమ బాకీ చెల్లించడానికి వచ్చాను.

శంకర : (నవ్వుతూ) ఓహో! అదా విశేషం. ఏదీ, యిటు తే!

చాత్తప్ప : (నడుములో దాచుకున్న చిన్న సంచీతీసి-అందులో వున్న నోట్లు యెంచి మేజాపైన పెట్టాడు.)
శంకర : (నోట్లు చేతిలోకి తీసుకొని) ఎన్నిరూపాయలు ?
చాత్తప్ప : ఆ కధే చెబుదామనుకున్నాను.
శంకర : (నోట్లు యెంచుకొని) ఏమిటి?
చాతప్ప : నూరురూపాయలు తెచ్చాను.
శంకర (సరిగా వినకుండానే) ఇదేమిటి?
చాత్తప్ప : నూరురూపాయలు- అసలుమాత్రం.
శంకర : (లెక్క-పెట్టుకొని-చాత్తప్ప చెప్పేది వినకుండానే) బాగానేవుంది.
చాత్తప్ప : దయచేసి తమరు వడ్డీ వదిలివెయ్యాలి.
శంకర : (నోట్లు యెంచుకొని - అంతవరకూ చెప్పింది విన నట్లు) నూరురూపాయలుగదూ ?
చాత్తప్ప : అదే.
శంకర : బాకీ తీసుకొని, ఒక్క-సంవత్సరం గాలెదూ?
చాత్తప్ప : లేదు. వచ్చే పదవ తేదీనాటికి సంవత్సరమౌతుంది.
శంకర : ఈనాడు తేదీ ముప్పైఒకదూ?
చాత్తప్ప : అవును బాబూ.
శంకర : ఇక సంవత్సరంలో - పదిదినాలకు వడ్డీ యెవరు తీసేస్తారు? కూడి-తీసివెయ్యాలంటే ఆ లెఖ్ఖ చాలా కష్టమౌతుంది. వడ్డీ యిరవైనాలుగురూపాయ లవుతుంది.
చాత్త: బాబూ! చాలాకష్టాలలోవున్నాను. వడ్డీయిచ్చుకోలేను
శంకర : అదెలా సరిపోతుంది?
చాత్తప్ప : తమరు నాపై దయచూపెట్టాలి.

శంకర : బాకీ తీసుకునేటప్పుడు యెలా యేర్పాటుచేసుకున్నామో అలా నడువవలసిందే.

చాత్తప్ప : దయతలచాలి.

శంకర : సత్యానికి దయ యేమిటోయ్! వడ్డీ వదిలేయడానికి కాదు. బాకీ తీసుకున్నప్పుడు మనం చేసుకొన్న యేర్పాటును—అక్షరాలా అనుసరించవలసిందే. సంవత్సరానికి యిరవై నాలుగురూపాయల వడ్డీ.

చాత్తప్ప : నేను చెప్పేకునేమాటలు తాము దయతో వినాలి. భూమి కుదువబెట్టి డబ్బుతీసుకొని రోగానికి ఖర్చుపెట్టాను.

శంకర : (ఆశ్చర్యంతో) ఎవరికి కుదువబెట్టావు?

చాత్తప్ప : అదో ఆ వడ్డీవ్యాపారంచేసే వీరప్పయ్యకు కుదువబెట్టాను.

శంకర : చూచావ్రా? నీలో వుండే దుర్బుద్ధి అదే. ప్రోనోటు వ్రాసియిచ్చి బాకీ తీసుకోవడానికిమాత్రం యిక్కడికి వస్తావు. ఇల్లూ—భూమీ కుదువబెట్టేటప్పుడుమాత్రం వీరప్పయ్యదగ్గరికి వెడుతావు.

చాత్తప్ప : మీదగ్గర డబ్బు వుంటుందో—లేదో అనుకున్నాం.

శంకర : అయితే, మాదగ్గర యెప్పుడు డబ్బు వుంటుందీ—యెప్పుడు డబ్బువుండదు అనేవిషయాలన్నీ నీకు తెలుసునన్నమాట.

[మాధవి రంగంలోకి ప్రవేశిస్తుంది. చెంపపైన చేయిపెట్టుకొని వుంటుంది.]

మాధవి : ఫలహారం తీసుకురానా?

శంకర : (కోపంతో) కొంచెం సేపాగు. ఇందులో నీ తొందర కూడానా?

మాధవి : నాకు పళ్ళునొప్పుతున్నాయి. ఈ దిన మేమీ తినే అదృష్టముండేటట్టు లేదు.

శంకర : ఎలాగైనా ఏడ్చుకో. నే నీపని ముగించి వస్తాను.

మాధవి : మీ పని యెప్పుడు తీరుతుందని? నాకు పళ్లు నొప్పిగా వున్నాయి. (పోతుంది)

శంకర : అయితే, చాత్తప్పా......

చాత్తప్ప : ఏమండీ?

శంకర : ఏవైనా కష్టాలువచ్చినప్పుడు నేను జ్ఞాపకంవస్తానన్న మాట. ఇండ్లూ-భూములూ-వీని విషయంలో నా పేరే జ్ఞాపకంరాదు. అంతేగదూ?

చాత్తప్ప : తమ రలా అనుకుంటే యెలాగ బాబూ? నేను రోగంతో మంచంపట్టినసమయంలో ఆపని జరిగిపోయింది. తమరు కోప్పడకండి.

శంకర : సరే, పోనీలే, నడచిపోయిన కార్యాన్ని తలచుకొంటే మాత్రం లాభమేముంది? వడ్డీమాట యేమంటావు?

చాత్తప్ప : ఇచ్చుకోలేను బాబూ!

శంకర : ఇదో, చాత్తప్పా! సత్యం చెపుతున్నా విను. చేసుకున్న యేర్పాటును తప్పించడానికి నా సాధ్యంగాదు. ఈ జన్మలో నే నెప్పుడూ సత్యంతప్పించి యెరుగను. ఇరవై నాలుగురూపాయలు వడ్డీ యివ్వవలసిందే.

చాత్తప్ప : తమరు వడ్డీ వదిలిపెడితే సత్యం తప్పినట్టిలా అవుతుంది బాబూ!

శంకర : కాదూ మరి. ఆనాడు చేసుకొన్న యేర్పాటును తప్పిస్తే అసత్యదోషం రాదూ?

చాత్తప్ప : ఈ కష్టాలలో నన్ను తమరే రక్షించాలి.

శంకర : ఇదో, చెబుతున్నాను విను. వొట్టి మాటలవల్ల లాభంలేదు. నే నెప్పుడూ సత్యంతప్పించి యెరుగను. అందులో ఏకాదశినాడా అసత్యం చెప్పడం! అసత్యం చెబితే యీ ఏకాదశీవ్రతానికి యీ భస్మం పూసుకోడానికి సార్థకం యేమిటంటావు?

చాత్తప్ప : బాబూ, ఉన్న పొలంకాస్తా పోయింది. రోగం పట్టుకుంది. నాలుగుదిక్కులా కష్టాలావరించాయి. అయినా, ఆడినమాటకు – అసత్యం రానీకుండా తమఅప్పు రూపాయలు తీసుకొనివచ్చాను. ఈ సమయంలో నా యిల్లూ వాకిలీకూడా పోయేటట్టుగావుంది.

శంకర : ఈ విషయా లొకటీ నాకు తెలీవు. నా వడ్డీ యిరవై నాలుగురూపాయలు నాకు చెల్లించాల్సిందే!

చాత్తప్ప : బాబూ, వడ్డీ యిచ్చుకోలేను.

శంకర : నేను సత్యముతప్పనని యింతకుముందే చెప్పలేదూ? అందులో ఏకాదశినాడా అసత్యం చెప్పడం! నీ కిష్టముంటే ఒక సలహా చెప్తాను.

చాత్తప్ప : బాబూ! నాకు నలుగురైదుగురు పిల్లలున్నారు. వారినిచూచైనా దయతలచండి. సత్యం చెప్పాలంటే, యీనాడు మా కొట్టంలో పిల్లి లేవలేదు. గంజిచేసుకోవ ధానికి నాలుగుమూకలైనా లేవు.

శంకర : మంచిపనేఅయింది. ప్రయత్నం లేకుండానే - ఏకాదశీ వ్రతం చేసేఫలం దక్కిందన్నమాట!

చాత్తప్ప : ఎక్కడైనా నాలుగునూకలైనా పట్టుకపోదామని వచ్చాను. ఎక్కడా దొరికేఆశలేదు.

శంకర : అదే అంటున్నాను ఈనాడు అప్రయత్నంగా బండెడుపుణ్యం సంపాదించుకున్నావు.

చాత్తప్ప : తమ రేనో సలహాయిస్తామన్నారు.

శంకర : (చేతిలోవున్ననోట్లు మేజాపైనపెట్టి లేస్తాడు) సలహా కాదు దయచూపిస్తానన్నాను. ఇదో, యీ యిచ్చిన నూరురూపాయలు ప్రోనోటులో నీపేర జమవ్రాస్తాను. వడ్డీ యిరవైనాలుగురూపాయలు రెండుమూడునాళ్ళలో తెచ్చియివ్వు. ఏమీ పరవా లేదులే!

చాత్తప్ప : అప్పు డా యిరవైనాలుగురూపాయలకుకూడా వడ్డీకట్టుకుంటారన్నమాట!

శంకర అంతేగా మరి! అప్పుతీరింది. వడ్డీ యెలా తగ్గుతుందిరా, పిచ్చివాడా!

చాత్తప్ప : అయ్యో! నన్ను కష్టాల్లోముంచగాకండి బాబూ!

శంకర : నాకు నిన్నురక్షించడానికి వేరేమార్గం తోచడం లేదు. ఇక నీ యిష్టం. (లోపలికి వెళ్ళిపోతాడు.)

[చాత్తప్ప వ్యసనంతో నిలబడిఉంటాడు. శంకరన్నాయరుకొడుకు సుకుమారన్ బయటికి వస్తాడు. సుమారు యిరువదియేళ్ళుంటాయి. నవనాగరకవేషం. కళ్ళలో దొంగచూపులు.]

సుకుమారన్ : ఎవరది? (చాత్తప్పనుచూచి) చాత్తప్పవా? ఏమిటి వచ్చావు?

చాత్తప్ప : చిన్నబాబుగారా! ఏమీలేదు.
సుకు : ఊరికేవచ్చావన్నమాట.
చాత్తప్ప : బాబుగారితో పనుండి వచ్చాను.

[మేజాపైనవున్ననోట్లు వానికంటబడతాయి. వాడు వానిపై కన్నువేస్తాడు. మేజావైపొకసారి-చాత్తప్ప నొకసారి చూస్తాడు. ఏదోఒకవుపాయం తోచినట్లు ముఖభావం కనబడుతుంది]

సుకు : చాత్తప్పా......నాకొక చిన్నపని చేసిపెడతావూ?
చాత్తప్ప : (సుకుమారుని ముఖంవైపు చూస్తాడు)
సుకు : (జేబులోచేయిపెట్టి) ఇదో! ఆ అంగడికి వెళ్ళి, నాకొక బీడీలకట్ట పట్టుకొనిరా. అదో, అంగడి యెదురుగానేవుంది. చూడు. (జేబులోపావలాతీసి చేతిలోపెడ్తాడు. చాత్తప్ప వెళ్ళిపోతాడు. సుకుమారన్ లోపలినుంచి ఎవరైనా వస్తారేమోనని చూపులుసారించి రాలేదని తెలుసుకొని మేజాపై వున్ననోట్లలోఒకపదిరూపాయలనోటుకొట్టేస్తాడు. మాలతి దొంగనవ్వు నవ్వుకుంటూ బయటకు వస్తుంది. ఆమెనుచూచి సుకుమారుడు నవ్వుతాడు)
మాలతి : ఏమిట్రా సుకూ? యిక్కడున్నావు?
సుకు : ఊరికే వున్నాను.
మాలతి : నాకు తెలుసులే.
సుకు : ఏమి తెలుసు?
మాలతి : ఒరేయ్. అది పెద్దపాపం తెలుసా?
సుకు : మెల్లగా మాట్లాడు. అలాచేయడం పాపంఅయితే, ఏకాదశీవ్రతంచేస్తే అది పోతుంది.
మాలతి : నాన్నతో చెబుతాను.

సుకు : నేను చెప్పలేనా యేమిటి?

మాలతి : ఏమిటి చెపుతావు?

సుకు : నీవు పులుసువేసుకొని యీనాడు అన్నంతిన్న సంగతి చెబుతాను.

మాలతి: ఒరేయ్, ఆ నోటక్కడపెట్టు. నీవుపావంచేస్తున్నావు.

సుకు : సరేలే! నీ విక్కడినించి వెళ్ళిపో. పాపపుణ్యాలు యేకాదశీమాహాత్మ్యంపుస్తకంలోనే వుండేది.

మాలతి : నే నిప్పుడే చెపుతాలే.

సుకు : నేనే ముందుగా చెబుతాను.

మాలతి : ఏమిటిచెబుతావు?

సుకు : యివ్వాళ ప్రొద్దుట-దోశె-కాఫీ ముగించావని చెబుతాను. ఏకాదశిరోజు యేమీ తినరాదని నాన్నగారు చెప్పలేదూ?

మాలతి : నువ్వుచెప్తే నాన్నగారు నమ్ముతారా యేమిటి?

సుకు : (చాత్తప్ప తిరిగివస్తూవుండేది చూచి సంభ్రమించి) ఇదో, అక్కా! నువ్వు వెళ్ళిపోతావా? లేదా? లేకపోతే, యీనాడు చేపలుకొనుక్కున్నసంగతి నాన్నగారితో చెప్తాను. తెచ్చి చూపిస్తానుకూడా.

మాలతి : ఒరేయ్! ఆపనిమాత్రం చెయ్యొద్దు.

సుకు : అయితే, యింట్లోకి పో. పోయినావంటే నీవేంకోరినా తెచ్చిస్తాను.

మాలతి : అయితే, నీవుపోయేటప్పుడు ఆ మేజాపైనవుండే యేకాదశీమాహాత్మ్యంపుస్తకం పట్టుకెళ్ళు. అది వుంటే నాన్నగారు చదవమని నన్ను చంపుతారు.

సుకు : ఓ, ఇంతేనా.

[పరుగెత్తి పుస్తకంతీసుకొని చంకలోపెట్టుకొని, మాలతిని తోసుకొనిపోయి లోపల పెట్టివస్తాడు. ఇంతలో చాత్తప్ప తిరిగివస్తాడు. బీడీలు మేజాదగ్గర పెట్టి, మిగిలిన ఒకఅణా సుకుమార్‌కు యిస్తాడు.]

సుకు : అది నువ్వే తీసుకో.

చాత్తప్ప : నాకొద్దు బాబూ.

[సుకుమార్ బీడీలు, అణా తీసుకొని లోపలికి పోతాడు. చాత్తప్ప మరలా విషాదభావంతో విలబడివుంటాడు. ఒక్కసారి దగ్గుతాడు. లోపలికి తొంగిచూస్తాడు. కొంచెంసేపు గడుస్తుంది. శంకరన్నాయరు లోపలినించీ ప్రోనోటు చదువుకుంటూ బయటికివస్తాడు.]

శంకర : గడచినసంవత్సరం శ్రావణమాసంలో బాకీ తీసుకున్నావు. (ఈజీఛేరులో కూర్చుంటాడు.)

చాత్తప్ప : నిజమే బాబుగారు.

శంకర : నీ వంతకుముందే నావద్ద యాభైరూపాయలు చేబదులు తీసుకున్నావుగదూ.

చాత్తప్ప : అవును బాబూ.

శంకర : ఎన్నాళ్ళకుముందు తీసుకున్నావో జ్ఞాపకంవుందా?

చాత్తప్ప : ఆషాడమాసంలో పదున్నెదవ తేదీకొనో లేక యిరవైయవ తేదీనో అయియుంటుంది బాబూ. ఏదో సేద్యంపనికి తక్కువపడి తీసుకున్నాను.

శంకర : అయితే, యాభైరూపాయలకు — ఆ పదిరోజులవడ్డీ యెక్కువగా కట్టవలసివస్తుంది. పోనీలే. అది వదిలివేశాను. ఎలాగైనా వడ్డీ ఇరవైనాలుగురూపాయలకంటే తగ్గదు.

చాత్తప్ప : నేను తమరిని లెఖ్ఖలేమీ అడగలేదండి బాబు.

శంకర : అయితే సరి. ప్రోనోటులో నూరురూపాయలు జమ వేసి యిాడుస్తాం.

చాత్తప్ప : నేను చెప్పవలసింది చెప్పాను బాబూ.

శంకర : నీవు చెప్పావు, నేను విన్నాను. ఇంకేమీా చెప్ప వద్దు. తెలిసిందా? (నోట్లుతీసుకొని లెక్కపెట్టడాని కారంభిస్తాడు. అదరిపడి మళ్ళా యెంచుతాడు. మళ్ళీ మళ్ళీ యెంచుతాడు) చాత్తప్పా!

చాత్తప్ప : (తలయెత్తి చూస్తాడు)

శంకర : ఎన్నిరూపాయలు తెచ్చావ్?

చాత్తప్ప : మీారే యెంచారు గదండీ.

శంకర : నీవు చూచావుగదూ. - (నోటు ఒకొక్కక్కటే తీసి మేజాపైన పెడ్తూ) ఇదో ఒకటి... రెండు... మూడు ... నాలుగు...ఐదు...ఆరు ...ఏడు...ఎనిమిది...తొమ్మిది —తొంభైమాత్రమే.

చాత్తప్ప : నూరురూపాయలు తెచ్చాను బాబూ.

శంకర : ఎప్పుడు తెచ్చావు?

చాత్తప్ప : ఇక నే నేం చెప్పేది?

శంకర : తొంభైకంటె ఒకద్మ్మిడీ ఎక్కువలేదు.

చాత్తప్ప : ఇంతకుముందు తమరేయెంచారు గదండీ. నూరు రూపాయలన్నారు.

శంకర : పొరపాటుగా యెంచివుంటాను.

చాత్తప్ప : ఏమిటో! నేనుమాత్రం నూరు రూపాయలే తెచ్చాను.

శంకర : అయితే నేనెత్తుకున్నానంటావా ఏమిటి?

చాత్తప్ప : నాకు తెలీదు బాబు.
శంకర : నీవే తీసుకొనివుంటావు.
చాత్తప్ప : అయ్యో! ఈశ్వరా! మహాపాపం వస్తుంది.
(చాత్తప్ప కప్పుకొన్న దుప్పటి విదిలించి చూపుతాడు)
శంకర : నీ వింతకుముందు తప్పించివుంటావు.
చాత్తప్ప : తప్పించడానికి వీల్లేదండి. ఆ నూరు రూపాయలివ్వడే వేరేచోటునుండి బాకీ తెచ్చాను. అవి అట్లాగే తెచ్చి మీ చేతిలో పెట్టాను.
శంకర : ఎంచడంలో యింతకుముందే పొరపాటు జరిగివుంటుంది.
చాత్తప్ప : జరగలేదండి.
శంకర : అయితే త్రోవలో యెవడో కొట్టేసివుంటాడు.
చాత్తప్ప : అలాంటిదేమీ జరగలేదు బాబూ! నోట్లు తిత్తిలో వేసుకొని నడుములో చెక్కుకొని వచ్చాను. ఎత్తుకొనేవాడు ఒక్కనోటుమాత్రం ఎలా యెత్తుకొని వుంటాడు బాబూ?
శంకర : అలాఅయితే, నేను లోపలికి వెళ్ళినప్పుడు నీవే కొట్టేశావ్.
చాత్తప్ప : (కళ్ళలో నీళ్ళుపెట్టుకొని) అయ్యో! ఈశ్వరా! ప్రాణంపోయినా నేను యితరులడబ్బు తీసుకోను బాబూ! ఈనాటికి కాలంచెడి నేను దొంగతనంచేశానన్నమాట మీనోటినుంచీ వింటున్నాను. అయ్యో! (గట్టిగా అరుస్తాడు.)

శంకర : ఇదో, చూడు. ఊరికే అరిస్తే ప్రయోజనంలేదు. అయితే నీ వనేదేమిటి ?

చాత్తప్ప : అనేదేముంది బాబూ. అని చేసేదేముంది?

శంకర: మనస్సులో యేమో గుడార్థాలుపెట్టుకొని మాట్లాడుతున్నావు. నీలాంటివానిపైననా నేను దయచూపవలసింది? వడ్డీలో ఒక్కదమ్మిడికూడా వదలను.

చాత్తప్ప : వద్దు.

శంకర : తొంభైరూపాయలు జమవేశాను. అర్థమయిందా?

చాత్తప్ప : అదీ వద్దు బాబూ. అవికూడా మీరే తీసుకోండి. (బయటకు చూచి గుటకలు మింగుతూ) ఓ భగవంతా! నీవే రక్షించాలి. (వెళ్ళిపోతాడు)

[శంకరన్నాయరు నోట్లు రొండిలోచెక్కుకొని, ప్రోనోటు మేజాపై పెట్టి కోపంగా రోజుకుంటూ యీజీచేరులో కూర్చుంటాడు. మాధవి చెంప పట్టుకొని ప్రవేశిస్తుంది.]

మాధవి : ఫలహారం తెమ్మంటారా?

శంకర : ఏడిసినట్లేవుంది. నన్నడిగేదేమిటి ?

మాధవి : ఇదో, వూరికే గడబిడచేయకండి, నాకు పల్లునొప్పివచ్చింది.

శంకర : అయితే నీతో యికమీద మాట్లాడకూడదన్నమాట. అభినయంచేసి చూపిస్తాములే. (చేతిలో కొన్ని ముద్రలుపట్టినట్లు పట్టుతాడు)

మాధవి : ఇక చాలు మీ ఆటలు. లోపలికి పోదాం రాండి.

శంకర : నేను రాను.

మాధవి : నే నిక్కడికి మోసుకొనిరాలేను.

శంకర : నేను వంటింట్లో యీనాడు ఫలహారంచేయను. అక్కడ రోజూ చేపలుతింటాం. ఈరోజు యేకాదశి ఏదైనా ఒకమూలకూర్చొని మదుగ్గా ఫలహారంచేస్తాను.

మాధవి : చేపలంటే జ్ఞాపకంవచ్చింది.

శంకర : ఏమిటి?

మాధవి : అబ్బాయి చేపలులేనిది ఒక్కముద్దయినా నోట్లో పెట్టుకోడు.

శంకర : ఊ! కానీ! కావలసినవన్నీ నేర్పించు.

మాధవి : వాడు యీ ప్రొద్దొకప్రశ్న అడిగాడు.

శంకర : ఏమిటది?

మాధవి : అమ్మా, ఏకాదశినాడు అన్నంతినకూడదు సరే-చేపలుకూడా తినకూడదా? అన్నాడు. (నవ్వుతుంది)

శంకర : కానా బుద్ధికుర్చిపెట్టాడులే గాడిద. ముద్దులకొడుకు కథ జ్ఞాపకంవచ్చేవేళకు నీ పండ్లనొప్పికూడా పోయింది కదూ?

మాధవి : (మరలా చెంపపై చేయివేసుకొని) ఎక్కడపోయింది? వున్నచోటునే వుంది.

శంకర : వా డెక్కడికెళ్ళాడు? ఈవాళ స్కూలుకెళ్ళినట్లులేదే?

మాధవి: ఏంపోతాడు లెండి. పాపంఆకలితో అలమటిస్తున్నాడు.

శంకర : అయితే అందరూ యేకాదశినాడు ముప్పూటా తింటారన్నమాట! మన మొకరే అరుదుగా వుపవాసం చేస్తున్నామన్నమాట! చాలేనీమాటలు! పోయి ఫలహారం తీసుకొనిరా.

మాధవి : కాళ్లూ ముఖమూ కడుక్కోండి (పోతుంది)

[శంకరన్నాయరు లేచి అటూ-యిటూ తిరుగుతాడు. రొండిలోవున్న నోట్లకట్ట చూచుకుంటూంటాడు. బయటికి దృష్టిసారిస్తాడు. ఎవరో వచ్చేది చూచి, అదురుతూ-మరలాయీజీఛేరుపైన కూర్చుంటాడు. భార్యనుపిలుస్తాడు]

శంకర : మాధవీ! ఏయ్ మాధవీ!

మాధవి : ఇదో వచ్చాను.

శంకర : (మరలా పిలుస్తాడు) మాధవీ! మాధవీ!

మాధవి : ఏమండీ?

శంకర: ఈ చెవిటిదానితో చచ్చిపోతున్నాను. మాధవీ!

మాధవి : ఏమిటీ గోడవ? నిమిషానికి నాలుగుసార్లు పిలుస్తారు? ఏంకావాలి? (కుడిచేతిలో ఫలహారంతట్ట, యెడమ చేతిలో ఒకగ్లాసులో పాలూ పట్టుకొనివస్తుంది)

శంకర: (ఆదుర్దాగా) లోపలికితీసుకొనిపో. లోపలికితీసుకొనిపో.

మాధవి : ఎందుకు ?

శంకర : ఆ అప్పుమోనాన్ వస్తున్నాడు. వకీలుగుమాస్తా అప్పుమోనాన్. ఆ కులభ్రష్టు - యెదురుగా తినడానికి నాకు యిష్టంలేదు. తొందరగా యెత్తుకొనిపో.

[మాధవియమ్మ లోపలికి వెళ్ళిపోతుంది. వేరేవైపునుండి అప్పుమోనాన్ ప్రవేశిస్తాడు. సుమారు 35 సంవత్సరాల వయస్సుంటుంది. చేతిలో కాగితాలున్నాయి. ఒకటిరెండు వార్తాపత్రికలుగూడా వున్నాయి. అతన్నిచూచి శంకరన్నాయరు యేదో ఆదుర్దాపడినట్లు నటిస్తాడు.]

శంకర : రాండి. రాండి. కూచోండి.

[అప్పుమోనాన్ చిరునవ్వునవ్వుతూ కాన్వాస్కుర్చీదగ్గరనున్న బెంచీపైన కూర్చుంటాడు, శంకరన్నాయరు యీజీఛేరుపైన వుంటాడు.]

శంకర : ఈవాళ కోర్టుకు పోలేదా ?

అప్పు లేదు. ఈ ప్రొద్దు సెలవు.

శంకర : ఏకాదశిఅనేనా?

అప్పు : కాదు కాదు. మూడో శనివారం. అందువల్ల.

శంకర : కాదు, అప్పు మోనాన్! ఒకవిషయం తెలీక అడుగు తాను, మీ అధికారివర్గం యీ యేకాదశిలాంటి పుణ్య దినాలకు సెలవులుఇస్తే యెంత బాగుంటుంది. ఇలాంటి పవిత్రదినాల్ని వదిలిపెట్టి పనికిరానివిషయాలకంతా సెల వులు ఇస్తూవుంటారు.

అప్పు : మీవంటివారిఅభిప్రాయాల్ని అనుసరించి సెలవు లివ్వడం మొదలుపెడితే–ఇక–కోర్టులు తెరవాలిసిన అవ సరమేవుండదు. ఒక నెలలో రెండేకాదశులు, రెండు ప్రదోషాలు. ఒకపూర్ణిమ, ఒక అమావాస్య, నాలుగు సోమవారవ్రతాలు, నాలుగు శనివారవ్రతాలు...... ఇంకేముంది. భలే తమాషాగా వుంటుంది.

శంకర : సోమవారవ్రతానికి సెలవేమీ అక్కరలేదులే.

అప్పు : ఏమీ! అదేంపాపంచేసింది గనుక? దానికీ వుండ నీలే.

శంకర : నన్ను పరిహాసంచేస్తున్నట్లుంది. అది సరేగాని, విషయాలేమిటి?

అప్పు : విషయాలేమని చెప్పను? ఒకనూరున్నాయి. అవన్నీ వదిలిపెట్టి మీకుసంబంధించినవిషయంమాత్రం చెబు తాను.

శంకర : ఆవిషయంలో నేను ఓడిపోతాననే తోస్తున్నది.

అప్పు : ఎలాగూ?

శంకర: ముందు నేనిచ్చినబాకీ వెయ్యీన్నీ ఐనున్నాన్లుగదూ.

అప్పు : అవును. అయితే?

శంకర : దానికి వడ్డీ యెంతవుతుంది?

అప్పు : ఎంతవినా - యింతకంటే యెక్కువగిట్టుకోదు. అది నిజం ఇప్పుడు రెండు చిన్నపొలాలకుచేరి, ముప్పదిరూపాయల గుత్త వస్తూంది గదూ.

శంకర : పన్నుకట్టుకోవద్దా?

అప్పు : రెంటికీచేరి పన్ను - పదునైదురూపాయలవుతుంది. అవీ చేరితే - నలభైయైదురూపాయలు. అంతేగాక ఒక పొలానికి నూరుతవ్వాల ధాన్యం. ఇంకొకదానికి యిరవై ఐదు. మరోదానికీ ముప్పై. వేరేదానికి నలభైయైదు తవ్వాలు. అన్నీచేరి యిన్నూరుతవ్వాలధాన్యం. వెయ్యి ఐదు నూర్లరూపాయలకు యిన్నూరుతవ్వాలధాన్యము - నలభై ఐదురూపాయలూ అయింది. తెలిసిందా?

శంకర : సరేలే; ఇప్పుడంతా జ్ఞాపకంవచ్చింది. ఆవిషయం పోనీతే. ఎంతైతేమాత్రం యిప్పుడేంచేస్తాము?

అప్పు : అదేమిటలా అంటారు?

శంకర : సివిల్ కోర్టయ్యా! సివిల్ కోర్టు.

అప్పు : అంటే?

శంకర : సివిల్ కోర్టుకు పోతే, యిప్పుడిచ్చేగుత్త ఒకలెక్కకిందికివస్తుందా యేమిటీ! కానీ, కోర్టుకెడితే, దీనికిరెండింతలు ఖర్చవుతుందేమోనని ఊరుకున్నాను.

అప్పు : అది ఫ్రూ౨కే మాటవరుసకి అనడమే......

శంకర : అదిపోనీలే. మన మాధవీదేవి పుట్టినింటినించీ వచ్చిన ఆస్తివివరాలు మీకు తెలిసినవేగదూ?

అప్పు : ఎందుకు తెలీదూ? అప్పుడు మధ్యవర్తిగావుండి పరిష్కారంచేసింది నేనేగా!

శంకర : ఆ పొలాలకి గుత్త యిప్పుడు పగానికిసగం తగ్గింది.

అప్పు : అయ్యో! ఎప్పుడు?

శంకర : ఈప్రొద్దే నా కా వర్తమానం తెలిసింది.

అప్పు : అయితే యేంచేశారు?

శంకర : ఏమిచేశాను? ఆవూళ్ళోనే ఒక పెద్దమనిషిని యేర్పరచి-యింకెవరన్నా గుత్త యెక్కువగా యిస్తారేమో చూడమన్నాను. ఆ దొరికినవాడు ఒక ద్రాఘ. ఇంకేమైనా వివాదంపెంచుకుంటే కోర్టుకు పోవాలి.

అప్పు : నాతో ఒక్కమాట చెప్పకూడదూ? కనపడినవానినల్లా పెద్దమనిషిఅని నమ్మితే యెలాగు?

శంకర : అది సరేలే! ఒక్కొక్కసారి వకీలుకంటె వాళ్ళ గుమాస్తాలు మంచివాళ్ళు దొరుకుతారూగదూ!

అప్పు : వాళ్ళకి ఆదాయంకూడా దండిగానేవుంటుంది.

శంకర : మంచిది.

అప్పు : ఈవిషయంలో మీరు కోర్టుకిభయపడరాదు.

శంక : ఎందువల్ల?

అప్పు : ఎందువల్ల ఏమిటి? మీ రా వ్యవహారం కోర్టులో వెయ్యండి, తరువాత-నే నావిషయం చూస్తాను. సివిల్

కోర్టులో-ఎలా వ్యవహారం నడపాలనేవిషయం ప్రపంచానికి నేను చూపించితీరుతాను.

[మాధవిఅమ్మ చెంపలపైచేయిపెట్టుకొని ప్రవేశిస్తుంది]

అప్పు : ఏమి? ఆరోగ్యంగా లేదా!

శంకర : దానికి పళ్ళనొప్పి వచ్చేలావుంది.

అప్పు : దానికేముంది? పల్లుపీకేస్తే పోతుంది (మాధవివైపు తిరిగి) నొప్పి ఎక్కువగావుందా ఏమిటి?

మాధవి : ఊఁ, ఆరంభమవుతూవుంది (మెల్లగా ప్రవేశించి-అప్పుమోనాన్ వెనుకగా పోయి నిలబడుతుంది)

అప్పు : పల్లు నొప్పిచేస్తే యికదానిని వుంచుకోకూడదు.

శంకర : అయితే?

అప్పు : పీకిపారెయ్యాలి.

శంకర : అంతపని ఎందుకులే! నాచేతిలోనే యున్నదో ఆ పని జరిగిపోతుంది.

[మాధవియమ్మ అప్పుమోనాన్వెనకాల నిలబడి, ఫలహారానికి రావలసిందని శంకరన్నాయరుకు పైగచేస్తుంది.]

శంకర : మాధవికి పల్లునొప్పి ఎక్కువైంది.

అప్పు : అందుకే పెరికివేస్తే సరిపోతుందన్నాను. (వెనక్కు తిరిగి) మీాకు పెరికివేయడం ఇష్టములేదా!

మాధవి : ఎందుకులెండి. రవ్వంతసేపట్లో నిలిచిపోతుంది.

అప్పు : అయినా నడుమనడుమ వస్తూవుంటుందికదా!

మాధవి : అవునవును. అదే కష్టం.

శంకర : పల్లునొప్పివస్తే ఆవిడకుకాదు కష్టం, నాకు.

అప్పు : అయితే. ఒకమందు చెప్తాను, చేస్తారా?

మాధవి : ఏమిటది?

అప్పు : కొంచెం వేడినీళ్లు పెట్టి -ఉప్పుకలిపి - నోటిలోపోసు కొని పుక్కిలించండి.

మాధవి : అలాచేస్తే?

అప్పు : వెంటనే నొప్పి తగ్గుతుంది.

శంకర : అందులో కష్టమేముంది. మాధవి! వెంటనే ఆ వైద్యంచేసిచూడు!

[మాధవి మరలా కొన్నిసైగలుచేసి పోవడానికి సిద్ధమౌతుంది.]

అప్పు : నీళ్ళు బాగా వేడిగావుండాల.

[మాధవి తలఆడించి పోతుంది.]

అప్పు : అది సరి. ఆ! మన మేమిటి మాట్లాడుకుంటున్నది?

శంకర : సివిల్‌కోర్టునుగురించి.

అప్పు : అదే. వ్యవహార మొరానడపాలనేవిషయం ప్రపంచానికి చూపిస్తాను

శంకర : అలానే చేద్దాం.

అప్పు : మరోవిషయం.

శంకర : ఈప్రొద్దు యింక ఏవిషయమూ వద్దు. రేపో - మర్నాడో చూచుకుందాము. ఈప్రొద్దు యేకాదశి. పురాణకాలక్షేపంతో గడపాలనుకున్నాను.

అప్పు : అయితే మీా అభిప్రాయమేమిటి?

శంకర : ఏమీాలేదు. భూమి-పుట్రి-ఆస్తి వీనికిసంబంధించిన విషయాలీపూట మాట్లాడగూడదని.

అప్పు : ఇదేమంత పెద్దవిషయం కాదులెండి. ఒకనిముషంలో ముగుస్తుంది.

శంకర : ఎప్పుడైనా ముగియనీ. ఆ విషయాలిప్పుడు వద్దు. ఇదిగో మీరు భోజనంచేసి వచ్చినట్లులేదు. చాలా పొద్దవుతుంది.

అప్పు : అబ్బే. నే నీ ప్రొద్దు పదిన్నరకే భోంచేసి బయలుదేరాను.

శంకర : అలాగా! భోజనంచేసి బయలుదేరారన్నమాట. అయితే, యిక-చాయ-గీయ అక్కరలేదు. అంతేగదూ!

అప్పు : అంతే.

శంకర : అయితే, ఒకపనిచేయండి. మీ చేతిలో న్యూస్ పేపర్లున్నాయిగదూ, వాటిని చదువుకుంటూవుండండి. (లేచి) కావలిసుంటే యీ కుర్చీపైన కూర్చోండి

అప్పు : అక్కరలేదు.

శంకర : నేను రవ్వంత లోనికిపోతాను. కొంచెం ఏకాదశీ మాహాత్మ్యం చదువుకుందామని-

అప్పు : ఓహో! అయితే, ఏకాదశీమాహాత్మ్యం చదువుతారన్నమాట.

శంకర : ఔనౌను. (లోపలికి వెళ్ళబోతాడు.)

అప్పు : నాకు ఏకాదశీమాహాత్మ్యం వినటమంటే చాలా యిష్టముండి. నేను మీదగ్గరకూర్చొని వింటాను.

శంకర : లోపలకూర్చోవడానికంతసౌకర్యంలేదనుకుంటాను.

అప్పు : ఉన్నసౌకర్యమే చాలులెండి.

శంకర : వెలుతురుకూడా తక్కువగా వుంటుంది. ఇక్కడే కానీలెండి. (తిరిగివచ్చి-మరలా యీజీచైరులో కూచుంటాడు. అప్పు మోనాన్‌కూడా బల్లపై కూర్చుంటాడు )

శంకర : అయితే, చదవడాని కారంభించేదా?

అప్పు : ఊఁ, కానివ్వండి.

శంకర : (పుస్తకం వెదుకుతాడు.) పుస్తకం ఎక్కడపోయిందీ!

[వంటింట్లో ఏవో కొన్నిపాత్రలు క్రిందపడ్డశబ్దం వినిపిస్తుంది.]

శంకర : మాధవికి వంట్లనొప్పి జాస్తిఅయిందని తోస్తూంది. (లేస్తాడు.)

అప్పు : విచారించాలి. (తానూ లేస్తాడు.)

శంకర : మీరెక్కడికి?

అప్పు : నేనూ ఆవిడని విచారిస్తాను.

శంకర : వద్దులెండి. నే నొక్కడినే విచారిస్తాను.

అప్పు : మీకు సహాయం వేరొకరుకూడా వుంటే, మంచిది కదూ!

శంకర : మాధవీ! మాధవీ! (అరుస్తాడు.)

మాధవి : (వంటింట్లోనుంచి) ఏమండీ.

[శంకరనాయరు ఆమాట వినిపించుకోకుండానే మరలా అరుస్తాడు.]

అప్పు : మీరు పిలిచినమాట ఆవిడకు వినిపించింది.

మాధవి : (బయటకివచ్చి) ఏం! పిలిచారా?

శంకర : ఏమిటా శబ్దం?

మాధవి : ఏముంది? పిల్లి పాత్రలు తోసింది.

శంకర : ఓహో! అంతేనా! (మరలా కూర్చుంటాడు.)

[అప్పుమోనాన్‌గూడా బెంచీపై కూర్చుంటాడు. మాధవి లోని కెడుతూవుంటుంది.]

శంకర : మాధవీ!

మాధవి : ఏమిటి?

శంకర : అప్పుమోనాన్ భోంచేసి వచ్చాడట, 'చాయి' వద్దు అంటున్నాడు.

మాధవి : ఇంత తొందరగా భోంచేశారా!

శంకర : ఆవిషయమే నేనూ అడుగుతూవున్నాను.

అప్పు : అవును, తొందరగా భోంచేశాం. ఏవో పనులు వుండటంవల్ల - తొందరగా భోంచేసి వచ్చాను. ఎలాగైనా తొందరగా భోంచేసి కోర్టుకుపోవడం అలవాటు.

శంకర : అయితే చాయి వద్దనడంలో దోషమేమీలేదు. భోజనమైనాక - 'చాయి' త్రాగవలసిన ఆవశ్యకత ఏముందిగనుక!

అప్పు : అదే. అంతమాత్రమేగాదు. 'చాయి'అంటే నాకంత యిష్టంగూడాలేదు.

మాధవి : (భర్తతో) అయితే మీరొకపనిచేయండి.

శంకర : ఏమది?

మాధవి : తొందరగా మీ ఫలహారం ముగించండి.

శంకర : ఓ, దానికేమి. తీసుకరా!

మాధవి : మీరు కాళ్ళూ ముఖం కడుక్కొని రాండి.

[వెళ్ళిపోతుంది. శంకరన్నాయరు కాళ్ళూ-ముఖమూ కడుక్కోవడానికి పోతాడు. అప్పుమోనాన్ చేతిలోవున్న న్యూస్‌పేపరు విప్పి చదవడానికారంభిస్తాడు. మొదలు ఒకపేపరువిప్పి చదవడానికారంభిస్తాడు. మరలా ఆవిషయమే వేరేపేపరులో చదువుతాడు. రెండుపేపర్లలోనివిషయాలూ పోల్చిచూస్తుంటాడు. శంకరన్నాయరు తిరిగివస్తాడు.]

అప్పు : ఈ వార్తాపత్రికలపద్ధతే ఒక తమాషాగావుంటుంది.

శంకర : ఏమిటి?

అప్పు : ఒకేవిషయాన్ని తెలుపడంలో ఒక్కొక్కపత్రిక వాళ్ళు ఒక్కొక్కపద్ధతిని అవలంబిస్తారు.

శంకర : ఏదది. చెప్పండి?

అప్పు : ఇదిగో! వినండి. (ఒకపత్రిక తెరచి చదువుతాడు.) ఊరూ పేరూ లేని ఒకవ్యక్తియొక్కశవం ఒకసందులో కన పడుతూవుంది. వాడు ఉపవాసంతో మరణించినాడని తెలిసింది.

శంకర : వట్టి వెధవాయి.

అప్పు : ఎవరు?

శంకర : ఆ చచ్చినవాడు.

అప్పు : కారణం?

శంకర : నాదయ్యా బుద్ధివుండేవాడెవడైనా ఏకాదశినాడు చస్తాడుటయ్యా! ద్వాదశినాడు చచ్చివుంటే స్వర్గంవచ్చి వుండేది. అంతమాత్రం బుద్ధిలేదూ వెధవకి!

అప్పు : వాడీ పొద్దు చచ్చాడనిగాదు – యీ పత్రికలో వుండేది–వాడు చచ్చింది–రెండురోజులక్రితం. ఆ విషయం యీరోజుపత్రికలో వస్తూంది.

శంకర : ఆవిషయం నాకెలా తెలుస్తుంది? ఉపవాసంఅనే శబ్దం వినేసరికి – సంతోషంతో ఒళ్ళుమరచాను. ఏకాదశి నాడు ఎవరైనాసరే ఉపవాసంచేయడం మంచిది. తెలిసి చేసినా – తెలియకచేసినా దానిపుణ్యం ఉండనేవుంది. రుక్మాంగదచరిత్రలోఒకమాలదానికథ వస్తుంది వినలేదూ!

అప్పు : వినకేమి?

శంకర : ఆవిడ ఏకాదశినాడు తనకు తెలీకుండానే ఉపవాసం

చేసింది. కృష్ణా!... భక్తవత్సలా... గురువాయూరప్పా...
తిండిగింజలు దొరక్కపోయినదానివల్ల ఉపవాసం చేసింది.
ఎలాగైతేనేం, అది చచ్చినతర్వాత దేవాదిదేవతలకు
దానికాళ్ళు పిసకవలసినగతిపట్టింది. అంతా ఆ భగవంతుని
లీలావిలాసం!

అప్పు : నేను చెప్పదలచుకొన్నది యీ విషయంగాదు.

శంకర : మరి యింకేమిటి?

అప్పు : ఆవిషయమే వేరేపేపరులో చదువుతాను వినండి.
అప్పు డర్థమౌతుంది. (వేరేపేపరు చదువుతాడు.) బజార్లో
ఒకమూల ఒకశవం పడివుంది. ఆకలిచావో ఏమో అని
పోలీసులు బహుశ్రద్ధగా దర్యాప్తుజరిపారు. కాని, ఆమనిషి
దీర్ఘరోగిఅని, కొన్నాళ్ళు ఆస్పత్రిలోవున్నాడనీ – రెండు
దినాలకుముందే ఆస్పత్రినించీ విడుదలచేశారనీ తేలింది.
అయినా – అధికారులు–ఆ శవాన్నిగురించి వృథా దర్యా
ప్తులు సాగిస్తూనేవున్నారు.

[శంకరన్ మాటిమాటికీ తలవాకిలివైపు తొంగిచూస్తాడు. మాధవి
ఫలహారంతెచ్చి మేజాపై పెట్టుతుంది]

శంకర : అయితే నేను ఫలహారం ముగిస్తాను. కృష్ణా!కృష్ణా!
ఆపద్బాంధవా!

[మేజాదగ్గరికి వెడతాడు. అప్పుమోనాన్‌గూడా లేచి వెడతాడు.]

శంకర : మీరా రెక్కడికి?

అప్పు : ఆ బెంచీపైన కూర్చుందామనుకున్నాను. అప్పుడు
మీరాకు రవ్వంత దగ్గరగా కూర్చున్నట్టవుతుంది.

[ఇద్దరూ కూర్చుంటారు.]

శంకర : (ఒక గెనుసుగడ్డ తీసుకుని పైపొట్టుతీసి నోటిలో వేసు కుంటాడు.) పాలు తేలేదూ?

మాధవి : తెస్తాను. (లోపలికి పోతుంది.)

శంకర : అప్పు మోనానుకు ఏకాదశీఫలహారం మిష్టమేనా? (తింటూ అడుగుతాడు.)

అప్పు : ఓ! చాలాయిష్టం. మా నాన్నగారున్నప్పుడు నా భాగం నాకు దొరుకుతూవుండేది.

శంకర : ఒకవేళ యివ్వకుంటేనో!

అప్పు : పోట్లాడి తీసుకునేవాణ్ణి.

శంకర : కాని......యిప్పుడు మీకిష్టమున్నా లాభంలేదు- మీనాన్నగారు లేరుగనుక.

అప్పు : అబ్బే- అందులో ఏముంది? మా నాన్నగారుకూడా మీలాగే వుండేవారు.

శంకర : మీ భోజనమయిందిగా. ఇక తినడానికి సాధ్యం కాదనుకుంటాను.

అప్పు : ఓ, దాన్నిగురించి మీరు బాధపడవలసిన అవసరం లేదు. జవాబుదారీ మీదపడితే ఎలాగైనా సాధిస్తాను.

శంకర : అయితే కావాలంటారు!

అప్పు : ఇక - అంతేగా అర్థం.

శంకర : భోజనమైంతర్వాత తింటే కడుపునొప్పి రాదూ?

అప్పు : ఏమీ పరవాలేదు. భగవంతుడు మనకిచ్చిన భాగ్య మల్లా - పొట్టఒకటే. ఏ పదార్థం తిన్నా క్షణంలో భస్మమైపోతుంది.

శంకర : అదీ ఒకభాగ్యమే. (తినడం మొదలుపెట్టుతాడు) తమాషాకంటున్నారా; నిజంగానా ?

అవ్వా : ఎవరైనా అలా వాచ్యాగా చెపుతారాఅండీ.

శంకర : అయితే యిదిగో. (రెండు రెనునుగడ్డలు ఒకకాగి తంలోపెట్టి యిస్తాడు. ఒక అరటిపండుకూడా పెట్టుతాడు. అవ్వ మోనాస్ తింటాడు.)

అవ్వా : ఇంకా.

శంకర : ఏమింటి?

అవ్వా : (శంకరన్నాయకుదగ్గరవున్న పాత్రవైపు చూస్తాడు.) అవి...

శంకర : నేను ఏకాదశినాడు చాలా అల్పంగా ఫలహారం చేస్తాను.

అవ్వా : మంచిది, మంచిది.

శంకర : ఏకాదశినాడు మా యింట్లో ఎవ్వరూ భోంచేయ డానికి వీల్లేదు.

అవ్వా : అందరికీ ఏకాదశి అన్నమాటే.

శంకర : అవునవును.

[ఈమాటలు జరుగుతూవున్నప్పుడు సుకుమార్ భోంచేసి, ఎడమ చేతిలో లోటాపట్టుకొని చెయ్యికడుక్కోవడానికి బయటికి వస్తాడు. వాడు శంకరన్నాయరుకంటపడతాడు. సుకుమార్ గాబరావడతాడు. శంకరన్నాయ రుకు కోపంవస్తుంది.]

శంకర : (గబుక్కున లేచి) ఏమిట్రా! ఏమిట్రా గాడిదా! ఈ ప్రొద్దు ఏకాదశి అని తెలీదూ!

[సుకుమార్ తొందరగా దొడ్డివైపు పరుగెడుతాడు. శంకరన్నాయరు

తరుముతుంటూపోతాడు. వాడు మరోవై పుతిరిగి యింట్లోకి వస్తాడు. శంకర న్నాయరుకూడా తరుముకొనివస్తాడు. ఇలా పరుగెత్తడంలో రొండిలోవున్న రూపాయలు జారి వాకిట్లో పడతాయి. అప్పుమోనాన్ నవ్వుతూ దీన్ని చూస్తుంటాడు. కాని వాని శ్రద్ధ ఫలహారంపైన వున్నందువల్ల నోట్లు క్రింద పడ్డది గమనించడు తొందరగా తనముందున్నఅరటిపండు తినివేస్తాడు. మేజాదగ్గరికి వెడతాడు. శంకరన్నాయరుఫలహారానికి చేయివేస్తాడు. ఉన్న గెనుసుగడ్డలు మిగిస్తాడు ఈసందర్భంలో-షర్టుకొనతో తలనూ, చేతినీ తుడుచుకుంటూ-సుకుమార్ అక్కడికి వస్తాడు. అప్పుమోనాన్ తింటున్నది చూచి చిరునవ్వు నవ్వుతాడు. తిన్నగా వచ్చి అప్పుమోనాన్ భుజం పట్టుకొని]

సుకు : గుడ్ మార్నింగ్!

అప్పు : (తిరిగిచూడకుండా) గుడ్ మార్నింగ్!

సుకు : ఏదో తొందరగా పనిముగిస్తున్నట్లుంది?

అప్పు : ఆ, అంత తొందరేమీలేదులే, భోంచేసి వచ్చాను. (కడుపుచూపిస్తూ) యిక్కడేదో కొద్దిగా ఖాళీవుంటే భర్తీ చేస్తున్నాను.

సుకు : నాక్కూడా కొంచెం ఖాళీవుంది.

[కడుపుచూపిస్తాడు. ఒక అరటిపండెత్తుకొని నోట్లోవేసుకుంటాడు. రెండోది తింటాడు. తలవాకిలివైపు చూచేటప్పటికి కళ్ళు జిగేలుమంటాయి. ఒక్కగంతువేసి వానిని తీసుకొంటాడు. జేబిలోపెట్టుకొని పండు తింటూ నిలబడిఉంటాడు.]

అప్పు : నాన్న యెక్కడ?

సుకు : తోటలో వున్నాడు. నే నక్కడున్నానని పనిమనిషి ఆయనతో చెప్పింది. నేను వేరేమార్గంగా తిరిగొచ్చాను.

అప్పు : ఏకాదశినాడు భోంచేయడం తప్పుగదూ!

సుకు : అవన్నీ పెద్దవాళ్ళకు. మీరు రేకాదశి చేయలేదేమిటి?
అప్పా : తీరిక లేదు.
సుకు : దేనికి తీరిక? కడుపుకా యేమిటి?
అప్పా : కాదు, నాకే. ఎప్పుడూ పనివుంటుంది.
సుకు : ఉపవాసంవుండడానికి తీరి కేమిటి?
అప్పా : ఇలాంటి వ్రతాలన్నీ యింట్లో తీరిగ్గావుండేవాళ్ళు చెయ్యాలి.
సుకు : నిజమే (ఇంకోపండు తీసుకొని నోట్లో వేసుకుంటాడు) నాక్కూడా తీరిక లేదు. అందుకే మానేశాను.

[అప్పుమోనాన్ చేతులుతుడుచుకొని, మరలా బెంచీపైకి వచ్చి కూర్చుంటాడు.]

సుకు : ఇదో, నాన్న వస్తున్నాడు. నే నిక్కడవుంటే గొడవ అవుతుంది. వెళ్ళివస్తాను. గుడ్ బై (పరుగెత్తుతాడు)
శంకర : (గొణుక్కుంటూ) ఆ వెధవ కిదే దుర్బుద్ధి. వాడికి బుద్ధిచెప్పాలి. ఏకాదశివంటి పవిత్రమైనరోజున నన్ను గూడా పరిగెత్తేలాచేశాడు. ఆ గాడిద యెటుపరిగెత్తాడు?
అప్పా : తలవాకిలివైపు.
శంకర : పోయాడన్నమాటే! నాచేతిలో దొరికివుంటే వాని కథ చెప్పివుందును. (మేజాదగ్గరికి వచ్చి ఫలహారం చూస్తాడు. అదిరిపడ్తాడు) ఏమిటీ! ఈ పళ్ళన్నీ యెక్కడికి పోయాయి?
అప్పా : (చిరునవ్వు నవ్వుతూ) అదిగూడా అడగాలా? (సుకు మార్ పరుగెత్తినవైపు చూపిస్తాడు)
శంకర : ఆ వెధవకొడుకు పళ్ళన్నీ యెత్తుకొనిపోయాడన్న

మాట. వాణ్ణి పట్టుకొని వుండవలసింది (అనుమానంగా) అప్పూ మోనాన్! యీ పళ్ళన్నీ వాడే తిన్నాడా? మీ రొకటీ తినలేదూ? నిజం చెప్పండి. (ఏడుపు మొగంతో గెనుసుగడ్డలు తినడానికి మొదలుపెడ్తాడు)

అప్పు : నిజం చెప్తాను, వినండి. వాడు ఆ పళ్ళన్నీ తినివేస్తా డని తోచింది. అందువల్ల నేనూ ఒక రెండుపళ్ళు తీసుకుని తిన్నాను. ఆ పని చేసిందికూడా వాడి ఆరోగ్యానికే.

శంకర : అలా చెప్పండి. ఇద్దరూచేరి నా ఫలహారం ముగించారు. పైగా భోంచేసివచ్చానంటావు. ఇన్ని అబద్ధాలున్నాయి గనుకనే మనదేశంలో యింత దారిద్ర్యం వుంది.

అప్పు : ఇంతకూ నేను వచ్చినపని చెప్పనేలేదు.

శంకర : నేనేమీ వినను.

అప్పు : వినకుంటే నష్టం నాకు కాదు; మీకు. ఒకటోదర్జా భూమి. దాన్ని కుదువబెట్టుకుంటే అదివూర్తిగా మీకు దక్కి నట్లే. ఇన్నూరు టెంకాయచెట్లు, పది పనసచెట్లు, ఇరవై మామిడిచెట్లు......

శంకర : ఎక్కడుంది అది?

అప్పు : ముప్పై బాదామిచెట్లు, ఇన్నూరు పోకచెట్లు.

శంకర : (ఇంకా ఆశతో) ఏమిటా సమాచారం? చెప్పూ. ఆ పొల మెక్కడ వుంది?

అప్పు : ఇక్కడే, ప్రక్కనే.

శంకర ; అయితే ఛాన్సువచ్చిందన్నమాటే!

అప్పు : ఓ! డబ్బు చాలా కొంచెం...

శంకర ఎంతడబ్బివ్వవలసివుంటుంది?

అప్పా : అబ్బే! రెండు వేలా ఐదునూర్లు.
శంకర : అంత మొత్తమే!
అప్పా : అవును.
శంకర : కుదువతో బాటు భూమికూడా దక్కిపోతుందనేనా?
అప్పా : అందుకు సందేహం లేదు.
శంకర : అయితే యీ రెండు వేలూ ఐదునూర్లలో ఏమైనా కాస్త తగ్గే అవకాశం......
అప్పా : ఒక్కబొట్టుగూడా తగ్గదు.
శంకర : పొలం మీరు చూచారా?
అప్పా : ఆహా
శంకర : సొంతదారుతో మాట్లాడారా?
అప్పా : లేకుంటే నే నా ప్రస్తావన యిక్కడెందుకు తెస్తాను? నాకు పిచ్చాయేమిటి?
శంకర : అయితే దాన్ని పోనీకూడదు.
అప్పా : ఎక్కడికిపోతుంది? నా చేతిలో వుంది.
శంకర : గట్టిగా ప్రయత్నం చేయాలి.
అప్పా : ప్రయత్నం చేసేదేమిటి? నాచేతిలోనే అంతా వుంది. అయితే మరో విషయం.
శంకర : ఏమిటి?
అప్పా : ఈ పని సరిపోతే, నాకు ఐదునూర్లు యియ్యాలి.
శంకర : ఇన్నూట యాభై యిస్తాను.
అప్పా : చాలదండీ.
శంకర : మున్నూరు వేసుకో.
అప్పా : ఐదునూర్లకు ఒక్క దమ్మిడీ తగ్గదు.

శంకర : నమస్కారు.
అప్పే : ఈమాటలు విడిచిపెట్టండి.
శంకర : ప్రయత్నించండి చూస్తాము.
అప్పా : ప్రయత్నమేమీ లేదు. చేతిలో డబ్బువేసుకోవడం, రిజిష్టరాఫీసుకు పోవడం.
శంకర : అయితే, అన్నివిషయాలూ తేల్చుకున్నారన్న మాటే!
అప్పా - తేల్చుకోవడమేమిటి? తెగిపోయినాయి. మరో విషయం.
శంకర : ఏమిటది?
అప్పా : నా బహుమానం వుండిగదూ- ఐదునూర్లు అందులోనుంచీ-50 రూపాయలు యిప్పుడివ్వండి. అర్జంటుగా కావాలి.
శంకర : అయ్యో! సాధ్యంగాదు.
అప్పా : సాధ్యంగాకుంటే పనిగాదు.
శంకర : నాదగ్గర యిప్పుడు యాభైదమ్మిడీలుగూడా లేవు.
అప్పా : ఎలాగైనా చూడాలి.
శంకర : సాధ్యంగాదు.
అప్పా : మీరలా అనరాదు.
శంకర : ఏకాదశినాడు నేనబద్ధం చెప్తానా యేమిటి? పెట్టెలో ఐదో ఆరో రూపాయలున్నాయి. అంతే, పైగా దమ్మిడీ గూడా లేదు.
అప్పా : అబద్ధం చెప్పరాదు.

శంకర : గురువాయూరప్పసాక్షిగా... ఆ రూపాయలకుపైగా దమ్మిడీగూడా నాదగ్గరలేదు.

అప్పు : చాత్తప్ప యింతకుముందు మీకు డబ్బు తెచ్చి యిచ్చి పోలేదూ? నేను వాణ్ణి త్రోవలో చూచాను.

శంకర : (అదిరిపడి రొంటిలో చూచుకుంటాడు. ఆదుర్దాగా) అప్పూ! అప్పూ!

అప్పు : ఏమిటి?

శంకర : పోయింది.

అప్పు : ఏమిటి?

శంకర : డబ్బు.

అప్పు : ఇంతకుముం దడిగితే దమ్మిడీ లేదన్నారుగా?

శంకర : ఉండింది

అప్పు : ఈ పొద్దేకాదశిగదూ?

శంకర : అవునవును.

అప్పు : గురువాయూరప్పపై ఒట్టుపెట్టుకున్నావుగదూ?

శంకర : ఓ అదా విషయం. పెట్టిలోవుండే డబ్బునుగూర్చి ఒట్టుపెట్టుకున్నాను. అంతే, రొంటిలోవున్న డబ్బునుగూర్చి నేను ప్రస్తావించినానాయేమిటి? పోయింది. పోయింది. అంతా నాశనమైపోయింది. ఆ వెధవాయిచేతిలోపడిం దంటే దమ్మిడీ మిగులదు. డబ్బు నీళ్ళలాగా పరుగెత్తుకొని

పోతుంది. (లేచి మేజాపైన నేలపైన బెంచీపైన వెతుకు తాడు.)

[అప్పుమోనాన్ చిరునవ్వుతో అక్కడమిగిలినగెనుసుగడ్డలఫలహారం ముగించివేస్తాడు.]

శంకర : (వెతకడంముగించి యింకా ఆదుర్దాగా) మాధవీ... మాధవీ! నాశనమైంది. (పిచ్చివానివలె లోనికి పరుగెత్తు తాడు వాకిలితగిలి పడబోతాడు. గట్టిగనపోసుకుంటూ లేచి లోపలికి అరుస్తూపోతాడు) మాధవీ!—మాధవీ!

[తెర పడు తుంది]

బాకీ

రచయిత:

"చెరుకాడ్"

కేరళ దేశమునందలి అగ్రగాములైన నాటకరచయితలలో "చెరుకాడ్" ఒకడు. ఇతడు మొదట కవిగా సాహిత్యరంగం లోకి ప్రవేశించాడు. ఇతని రచనలలో "తరవాడిత్తం" "స్నేహబంధంగళ్" అనే రెండు నాటకాలు చాల ప్రసిద్ధాలు. ఈ నాటకాలకుముందే అతడు ఒక నవల, రెండు కవితా సంకలనాలు, రెండు కథాసంకలనాలు సాహిత్యలోకానికి యిచ్చాడు. స్కూలుమాష్టరుగా వున్నాడు. స్వస్థలం 'వెళ్లవనాడు.'

# పాత్రలు:

సుశీల : 12 సం॥ల వయస్సువున్న పడుచు. పావడా, జాకెట్టు, చేతికి రెండుగాజులు. చెదరిపోయిన తలముడి. కొంత కల్మషం-కొంత కోపం వున్న స్వభావం. ఇంట్లో పనిమనిషిలా వుంటుంది.

బాలకృష్ణన్‌నాయరు : 30-35 సం॥ల వయస్సు. ఉపాధ్యాయుడు. ఖద్దరు పంచె, జుబ్బా. సహజముగ శాంతుడు. కాని, పరిస్థితులు ఆతనిని కోపగాడుగా తయారుచేశాయి.

మోహన్ : 6-7 సం॥ల వయస్సు. చినిగిపోయిన డ్రాయరు, అంగీ. ఉత్సాహమున్న స్వభావం.

జానకి : 25 సం॥ల వయస్సు. ఉపాధ్యాయిని. చీర, రవిక దుస్తులు. శాంత శీల. పరిస్థితులవత్తిడితో యెప్పుడూ ముఖంపైన దయనీయ మైన భావం.

శంకరన్నాయరు : 60 సం॥ల వయస్సు. తలపైన ముడివేయబడినజుట్టు. మెడలో రుద్రాక్షపూసలు. అక్కడక్కడ కొన్ని పండ్లూడి పోయిననోరు. కట్టుకోవడానికి సుమారు మూడుగజాలపంచలు. కాలరులేనిఅంగీ - గుండీలకుబదులు దారంకట్టుకున్నాడు. నడుముకుకట్టుకొన్నది చిన్న షష్టిపంచలాంటిది. ఓరట్టిచెప్పులు. గొడుగు. డబ్బుపేరు తలుచుకుంటూనే కాంతిమంతమయ్యేకళ్లు. అసూయాభయాలు కూడుకొన్న ముఖం. జానకితండ్రి.

ఇంకా లాలిలో పడుకొనబెట్టే కొన్ని నెలలప్రాయంగల ఆడపిల్ల. ఆవిడ జానకి రెండోసంతానం.

# బాకీ

[జానకి మిస్ట్రెస్ బాడుగకువుండే యింటివరండా. ఇంటిముందు గదిలో-దంతెలకులోనికిజొనిపి గుడ్డ వ్రేలాడగట్టి తయారుచేసిన ఒక గుడ్డ వుయ్యాల. అందులో శిశువునుపడుకోబెట్టి సుశీల వుయ్యాలముందు విలబడి వుండగా తెర లేస్తుంది. ఒకమూల ప్రాత యీజీచైరు వుంటుంది. దానిగుడ్డ అక్కడక్కడ చినిగిపోయియున్నది. ఆ చినిగిపోయినచోట మరలా సూదితో కుట్టినగుర్తులుగూడా కనపడుతున్నాయి, గోడపైన మూడుచిత్రాలు వ్రేలాడుతున్నాయి. వానిలో ఒకటి స్త్రీల ట్రైనింగుస్కూలులో తీసుకున్న గ్రూపు ఫొటో. దానికి మరియొకదిక్కున పురుషుల ట్రైనింగుస్కూలులో యెత్తుకున్న గ్రూపుఫొటో వున్నది ఈరెంటికీనడుమ గాంధీజీఫొటో వ్రేలాడుతూంది.]

సుశీల : (ఒక కాలు ముందుకూ - ఒక కాలు వెనుకకుపెట్టి - ఆవిడ లాలి వూస్తూంది) (ముందుకాలు భూమిపైన బాగా ఆనించి వున్నది. వెనకకాలిమడిమతో తాను పాడేపాటకి ఒకరీతిగా తాళాన్ని నడుపుకొంటూవున్నట్లున్నది. తొట్టిలోవున్నబిడ్డ తిన్నగా కదుల్తూవున్నది.) ఇంతసేపైనా - జానకి అమ్మగారు రానికారణమేమిటి? (తలవాకిలివైపు చూస్తూ) ప్రాతఃకాలము పదిగంటలకి వికసించే వూలుగూడా వికసించినాయి. (మళ్ళీ ఒకసారి తలవాకిలివైపు చూచి) బాబో... బాబో... బాబో...

[బాలకృష్ణనాయరు ప్రవేశిస్తాడు. ఆయనచంకలో ఒకకట్ట కాంపోజిషన్ పుస్తకాలున్నాయి. సుశీల ఆయనత్రోవకు కొంచెం ఒదిగి - నిలిచి మరలా లాలివూస్తూ పాటపాడుతూవుంటుంది ]

బాల : జానకి రాలేదా?

సుశీల : (తల అడ్డంతిప్పుతూ) లేదండి.

బాల : ఇంతసేపైనా యెందుకురాలేదో?

సుశీల : ఏమిటో! దినమూ - పదిగంటలకు సరిగా వచ్చేది. ప్రాతఃకాలము పదిగంటలకు వికసించేపూలుకూడా-నేడు బాగా విరిసిపోయాయి. పిల్ల పాల కేడుస్తూంది. గ్లాసులో పోసి పాలుపోస్తామంటే యింట్లో లేవు.

బాల : ఏమన్నా 'టీ' తయారుచేశావా?

సుశీల : (తల అడ్డంగాత్రిప్పి) లేదండీ! న న్నెలాచేయమంటారు? ఈ లాలి విడిచిపోతే పిల్ల ఏడ్వడానికారంభిస్తుంది. .........బాబో...బాబో...బా...బో!

[బాలక్రిష్ణన్‌నాయరు ఈజీచేరుపైన దుమ్ముదులిపి దానిపై కూర్చుంటాడు. చంకలోని కాంపోజిషన్‌పుస్తకాలు నేలపైన పెట్టాడు.]

బాల : సుశీలా! యిక్కడ వుండిన సిరాబుడ్డి - కలం కనపడటంలేదు. నీ వెక్కడైనా పెట్టావా?

సుశీల : లేదండీ! నేను దానిని చూడలేదు...బాబో...బాబో ...ఇంతసేపైనా-జానకీ అమ్మగారు రానిదెందుకో? నేడు తెల్లవారి ఆవిడ యింతగంజికూడా తాగి పోలేదు.

బాల : మరెందుకు రాలేదు?

సుశీల : (బాలకృష్ణన్‌నాయరువైపు చూస్తూ) ఈప్రొద్దు గంజికి కావలసినన్నిగింజలుకూడా లేవు.

బాల : ఏమి చేయాలి? ఈవిడ యిలాగే వుపవాసం వుండి - వుండి ఎన్నడో చచ్చిపోతుంది. (ఆలోచనలో కొంత సేపుగడపి) ఏదెలావున్నా నూ్కలునించీ రావటానికి ంతసే

పెంచుకు చెప్మా? మూడు-నాలుగు నెలలైనా దాటని శిశువును....ఇంత కష్టపెడుతూ.........

సుశీల : పాలన్నావుంటే సరిపోయేది. అవి నాలుగుచుక్కలు నోట్లోపోస్తే-కొంచెంసేపు యీపిల్ల యేడవకుండా వుండేది.

బాల : సిరాబుడ్డి ఆ అరలో వుందేమో ఒక్కసారి పోయి చూచిరా.

సుశీల : నన్నెలా పొమ్మంటారు? నేను లాలివిడిచి కదిలితే యీ బిడ్డ కండ్లూ-ముక్కూ——నులుముకుంటూ ఒకటే రాగంసాగిస్తుంది. ఇంత చిన్నదానికికూడా బ్రహ్మాండ మైన కోపం.

బాల : ఆకలైతే అందరికీ కోపాలొస్తాయి. నీకుమాత్రం రాదూ?

సుశీల : (పాలిపోయిన ముఖంతో) బాగానేవుంది. నే నెవరిపైన కోపంచేసుకోను?

బాల : ఎవరిపైనేమిటి? మీమిస్ట్రెస్‌పైనే కోపంచేసుకోవచ్చు.

సుశీల : నా గొంతుకోసినా - ఆవిడపైన కోపంచేసుకోను. అయితే సిరాబుడ్డి తేనా?

బాల : వద్దులే. జానకి రానీ. - అయితే మీరిద్దరూకూడా తెల్లారి గంజి తాగలేదన్నమాట?

సుశీల : గంజి చాలా కొంచెమే వుండింది. దాన్ని నన్ను తాగమని చెప్పి, ఆవిడ స్కూలుకెళ్ళిపోయింది. ఇంకా... ...నే చెప్తాను గదూ...ఇంటికొంతదారుడు వచ్చివెళ్లాడు. ఇంటి బాడుగ కావాలట. మిస్ట్రెస్ గాని సారుగాని - యింట్లోవున్నారా? అని నన్నడిగాడు-మీరు రావట్లానికి

రెండునిమిషాలముండే. పోతూ పోతూ - మరలా రేపు తెల్లవారి వస్తానని చెప్పి వెళ్ళాడు.

బాల : (నిట్టూరుస్తూ) ఆగస్టు - సెప్టెంబరు - అక్టోబరు నవంబరు......ఈ నెలదిగూడా...

[తెరవెనుక యెవరో యేమిటో త్రోసినశబ్దం]

సుశీల అయ్యయ్యో...(లాలివిడిచి పరుగెత్తిపోతుంది.)

బాల : ఈనడుమనే యింట్లో ప్రసవం...పైగా రోగాలు... దీనితో యింటిబాడుగ నాలుగునెలలది బాకీపడిపోయింది. సొంతదారుడు అడగడంలో తప్పేముందిగనుక?...

(తెరవెనుక) ఊ. ఆ ౘా ముగిసిపోయింది

బాల ఏమిటి పిల్లి త్ర సింది ?

[తొట్టిలో పిల్ల యేడ్వడానికారంభిస్తుంది]

తెరవెనుక) : పాలు క్రిందపడిపోయాయి. గ్లాసుకూడా పగిలిపోయింది.

బాల : మంచిపనే జరిగింది. ఆకలిగొని యేడుస్తున్న పిల్లకూ-డా పోయకుండా పాలు పిల్లి పాలుచేశారన్నమాట! (నిట్టూర్చుకుంటూ)భార్యాభర్తలిద్దరూ కలిసి పనిచేసినా, నెలకు నూరురూపాయలుమాత్రమే సంపాదన. ఆ వుద్యోగంలోకూడా నడుమనడుమ సిక్ లీవులు. ఇంటిబాడుగ మాత్రమే యాభైరూపాయలయింది. అంగడిబాకీలు 200 పైగా వున్నాయ్. ఈకష్టాలతో బ్రతుకే చాలనిపిస్తూంది.

సుశీ : (ప్రవేశించి) ఇప్పు డేమిచేయడం? ఏడ్చేపిల్లకుకూడా పొయ్యకుండా ఒక చటాకుపాలు మిగిలించాం. అవి పిల్లి తనపొట్టలో పోసుకుంది. ఛాలనిదానికి గ్లాసుకూడా

వగులగొట్టింది. ఇంక ఈసారి యిక్కడ రానీ, కాళ్ళు-విరగ్గొట్టుతాను.

బాల : అయితే సుశీలకుకూడా కోపంవస్తుందన్నమాట!

[సుశీల నవ్వుకుంటూ లాలిపూచడాని కారంభిస్తుంది]

(తెరలో) : "మిస్ట్రెస్ వచ్చిందా?"

బాల : ఎవరది ?

[తెరలో] ఎవరున్నారు. నేనే భార్గవిని. ఆ పాలడబ్బు యివ్వనే లేదు. రేపటికైనా యివ్వాలని చెప్పిపోవటానికి వచ్చాను.

బాల : జీతంవస్తూనే పంపిస్తాను. బాకీవున్నడబ్బు యిచ్చే వరకూ యిక పాలు వేయవద్దులే.

[తెరలో] డబ్బడిగితే పాలువద్దంటారు. బాగానేవుంది.

బాల : సుశీలా! పాలబాకీ యెంతవుంది ?

సుశీల : ఇప్పటికి పదునైదు రూపాయలివ్వాలి. రేపటిపాల లెఖ్ఖకూడా చేరితే 16 రూ. అవుతుంది. ఆమాట భార్గవి తెల్లవారి చెప్పింది.

బాల : (నిట్టూరుస్తూ) అందుకే చెప్పాను. పాతబాకీ యిచ్చే వరకూ యిక పాలువద్దని.

సుశీల : అలా అయితే, పిల్లకి పాలు?

బాల : పిల్లకిమాత్రం తీసుకోండి. సాయంకాలానికి బియ్యం వున్నాయా?

సుశీల : ఆ, వున్నాయి. నాలుగుపావులకు కొంచెం కొద్దిగా.

బాల : ఇంకా యేమైనా కొంచెం పదార్థాలు......

సుశీల : ఇక నాకక్కటి లేదు. కట్టెలు బొత్తిగా లేవు. ఈ ప్రొద్దు జీతం వస్తే అన్నీ తీసుకోవచ్చు. లేకుంటే, రేపటి నుండీ అన్నీ అప్పుతీసుకోవాలి. ఆ గూటిలోవుండే బియ్యం వేసి, మీకూ—మోహనుడికీ యింత గంజిచేసి యిస్తాను. నా కథ యెలాగైనా అవుతుందిలే! బియ్యం యెక్కడైనా అప్పుతీసుకోమని మిస్త్రెస్ చెప్పిపోయింది.

బాల : ఈపొద్దు ఆ శంకరంనాయరు మీ అమ్మకు జీతం వస్తుందని తెలుసుకొనివుంటాడు. ఇక వచ్చి నెత్తిపైన పడుతాడు.

సుశీల : (చిరునవ్వుతో) నిజమే......

బాల : (ముఖంపైన క్రమక్రమంగా కోపం యెక్కి-వస్తుంది) మీ మిస్త్రెసే వచ్చి అప్పు తెస్తుందిలే! (పళ్ళుకొరుకుతాడు)

[వీధిలోనుండి మోహను డింట్లోకి వస్తాడు. అక్కడక్కడ యేరి కొన్న కట్టెపుల్లలమోపు వానినెత్తిపైన వుంటుంది. పలకా పుస్తకాలసంచీ-వాని యెడమభుజంపై వ్రేలాడుతూవుంటుంది.]

మోహన్ : కట్టెలు గావాలా! కట్టెలు. (గట్టిగా అరుస్తాడు ) కట్టెలండీ కట్టెలు. (సుశీల దగ్గరికి వచ్చి) కొంచెం టీ యేమన్నా యిస్తావా?

[సుశీల లేదని తల ఆడిస్తుంది]

మోహన్ : నా కాకలవుతూవుంది. (లాలిదగ్గరికి పోయి, అందులో తొంగిచూచి-) ఏమిటి పాపా! నీ అన్నను చూచావా? (తలపైనున్న కట్టెపుల్లలు నేలపైవేసి) ఇదిగో! సుశీలా! పాపను నా కాళ్ళపై పండపెడుదూ! నే నాడిచ్చు కుంటాను. (కాళ్ళుజాచి కూచుంటాడు)

సుశీల : ఇప్పుడు తాకితే అది యేడుస్తుంది.

మోహన్ : (లేచి నాయనదగ్గరికి పోయి కూచుంటాడు,) నాయనా! నాకు కొత్తఅంగీ కుట్టీవూ! ఇదో చూడు. ఈ అంగీకి గండిపుంది. ఇందులో చేయిపెట్టి ప్రొద్దున స్కూల్లో ఒకడు నన్ను గిచ్చాడు. (అంగీకి పడిన రంధ్రం చూపుతాడు.)

బాల : అమ్మ తెస్తుందిలే!

మోహన్:(లేచి పుస్తకాలసంచి మేజాపైని పెట్టును) అమ్మ... అమ్మ వస్తూంది. ఆ పార్వతీఅమ్మగారింట్లో ఒకశేరు బియ్యాం అప్పు తేవడానికి పోయివుండింది. నేను వస్తాను. నీవు ముందుగా పొమ్మని నాకు చెప్పింది.

బాల : (నిట్టూర్చి) అయితే జీతం రాలేదన్నమాట.

మోహన్ : లేదు.

[జానకమ్మ ప్రవేశిస్తుంది. ఆమెచేతిలోగూడ నాలుగు కట్టెపుల్లలుంటై. వానిని ఒకమూలలో వేస్తుంది. లాలిదగ్గరికి పోతుంది.]

జానకి : బాబూ! ఇక నాచేతగాదు. ఈ పనితో చచ్చిపోతున్నాను. ఇలా యెంత కష్టపడినా బాకీలుమాత్రం తప్పడంలేదు. సమయానికి జీతాలు రావడంలేదు. (లాలిలోకి తొంగిచూస్తూ) ఏమిచేస్తూంది మా బంగారు. ఏడుస్తూవుందా? (మాతృప్రేమ పెల్లుబుకుతూండే వదనంతో) పాపం! పిల్లంతా వాడిపోయింది. ఏడ్చిందా సుశీలా?

సుశీల : ఏమీ ఏడ్వలేదు.

జానకి : మోహానుడు టీ తాగాడా ?

[మోహనుడు లేదని తలవూపుతాడు]

సుశీల : (జంకుతూ) పాలు పిల్లి నూకేసింది.

జానకి : అయితే, మాష్టరుకూడా యేమీ తాగలేదన్న మాటే!

సుశీల : (తలఆడిస్తుంది)

జానకి : ఇదో దబ్బున పోయి, ఆ జానకమ్మయింట్లో ఒక చటాకుపాలు తీసుకురా.

బాల : (కోపంగా చూస్తూ) ఏమీవద్దు!

జానకి : అదేమిటి! అలా అంటారు? సుశీలా! పోయి తీసుకరా!

[సుశీల లోపలికి వెడుతుంది. మోహనుడు తండ్రిమొగం చూస్తూ చూస్తూ భయంతో మెల్లిగా లోపలికి వెళ్ళిపోతాడు.]

జానకి : బాగానేవుంది. ఇంకా టీగూడా వద్దన్నమాట! ఇలాఅయితే నా చేతగాదు. (లాలివిడిచి భర్తను సమీపిస్తుంది.) ప్రతిమాటకు యిలా కోపంచేసుకుంటే ఎలా? నామనస్సుకు ఒక్క సుఖంగూడా లేదు. ఇల్లంతా నరకంగా వుంటుంది. బియ్యం లేవు. వుప్పులేదు. మిరపకాయలు లేవు. కట్టెలు లేవు...చేతిలో దమ్మిడీలేదు. అన్నికష్టాలూ మనయింటికే చుట్టుకున్నాయి. ఇదిచాలక మీకు 24 గంటలూ కోపం (భర్తగడ్డం పట్టుకొని యెత్తడానికి ప్రయత్నిస్తుంది.)

బాల : (ఆమె చెయ్యి త్రోసివేసి) వెళ్ళిపో, యిక్కడనుంచి. అదే మంచిది. (కోపంతో చూస్తాడు.)

జానకి : (మరలా సమీపిస్తూ) ఆ చూపులుచూస్తే నన్ను మింగేసేలావుంది. కొట్టూరా యేమిటి?

బాల : ఆపనే చేస్తాను.

జానకి : అయితే కానివ్వండి. ఒకసారి చస్తే పీడపోతుంది.

(దీనంగాచూస్తూ) యిరవైనాలుగుగంటలూ కోపమే అయితే యెలాగ? ఇప్పుడు మీకు కోపంరావడానికి యెవరేంచేశారు?

[లాలిలో పిల్ల యేడ్వడానికారంభిస్తుంది.]

బాల : ఆ సిరాబుడ్డీ – కలం యెవరు తీశారు?

జానకి : ఎవ్వరూ తియ్యలేదు, వున్నచోట్లోనే వుంది. అందులో యింకు లేదు.

బాల : ఇంకేంచేయాలి? ఒక మోపెడు కాంపోజిషన్ పుస్తకాలున్నాయి, దిద్దడానికి. (నేలపైవున్న కాంపోజిషన్ పుస్తకాలు యెత్తి మేజాపైకి విసరివేస్తాడు. ఆ వేయడంలో కొన్ని నలిగిపోతాయి.

జానకి : నాపైన కోపంతో ఆ పిల్లలపుస్తకా లెందుకు చింపివేస్తారు పాపం! (లాలిదగ్గరకి పోతుంది.) మీరేంజేసినా సాగిపోతుందని అడుగడుక్కూ కోపంజేసుకుంటే–యెట్లా? ఇతరులకష్టాలుగూడా విచారించవద్దూ. ఇదో ఈ పిల్లకు కొంచెం పాలిచ్చివస్తాను. శాంతంగావుండండి. (లాలిలో నించీ పిల్లను తీసికొని, పాలు త్రాగించడానికి లోపలిగది లోనికి వెడుతుంది. సుశీల పాలగ్లాను చేతిలోపట్టుకొని 'పా లెన్ని తెమ్మంటారు?' అంటే, లోపలనుండి జానకి యమ్మా ఒక చటాకెత్తుకురా! అంటుంది.)

[సుశీల పోబోతుంది]

బాల : ఆ గ్లా సక్కడ పెట్టు.

[సుశీల యేమీతోచక నిలబడుతుంది.]

బాల : ఏమి టలా నిలిచావ్. నేను చెప్పింది నీతో గాదూ. ఇంక యీ యింట్లో టీ చేయడానికి పీల్లేదు.

(తెరలోనుండి) టీ ఒకరికి వద్దకుంటే వద్దులే, ఆ మోహనునికి ఆకలియెత్తుకుంది. టీ అయినా యింత కాచి పోయకపోతే యెలాగ ? సుశీలా ! పోయిరా !

బాల : ఏయ్ ! సుశీలా ! నీకే చెప్పింది. గ్లాసక్కడపెట్టు.

[సుశీల యేమీతోచక ఆ గ్లాసుయొక్కకొన పెదవులకానించికొని నిలబడుతుంది.]

(తెరలో) : పోయిరా సుశీలా. పాలు తీసుకొనిరా.

బాల : (సుశీలపైబడి, గ్లాసులాక్కొని మేజాపైన పెట్తాడు) పో ! లోనికి వెళ్ళు. (భయంతో సుశీల లోనికి వెళ్ళుతుంది.)

బాల : ఈ అప్పులతో బజారులో తలయెత్తుకొని తిరగడమే కష్టమైపోయింది. (గొణుక్కుంటూ యీజీఛేరులో పడుకుంటాడు. ముఖంలో కోపం ప్రస్ఫుటంగా కనపడుతూ వుంటుంది.) చేతిలో డబ్బులేకుంటే యే వస్తువూ కొననే రాదు.

[మోహనుడు ప్రవేశించి జంకుతూ నిలుచుంటాడు.]

బాల : ఆ స్పిరాబుడ్డి తీసికొనిరా !

మోహన్ : అమ్మా ! సిరాబుడ్డి యెక్కడుంది ? (పరిగెత్తి పోతాడు)

(తెరలో) : ఇదో ఇక్కడే వుంది. ఈ పిల్లను నిద్ర పోగొట్టడానికే సాధ్యమవడంలేదు.

బాల : (మరలా) ఆ స్టీల్ పేనాకూడా తీసుకురా !

మోహన్ : (సిరాబుడ్డి, పేనా తీసుకొని ప్రవేశించి) ఇందులో సిరాలేదు నాన్నా ! ఇదో చూడండి (చూపిస్తాడు)
బాల : (చూచి) వంటింట్లోకిపోయి, కొంచెంనీళ్ళుతీసికొనిరా!
[మోహనుడు లోపలికి వెళ్లుతాడు. బాలకృష్ణన్ నాయరు లేచి కాంపోజిషన్ పుస్తకాలు దగ్గరపెట్టుకుంటాడు.]
బాల : ఇంట్లో ఒక్క పెన్సిలైనా వుందా ?
[ప్రత్యుత్తరం లేదు.]
బాల : (కొంచెం సేపూరకుండి) బదులివ్వడానికూడా సాధ్యంగాదాయేమి ? నిన్నే అడుగుతున్నాను. ఇంట్లో ఒక పెన్సిలైనా వుందా అని ?
(లోనుండి) : లేదు...
బాల : (వెక్కిరిస్తూ) లేదు ! కొంపలో ఒకపదార్థంగూడా వుండదు. ఈ పని స్కూల్లోనే ముగించివుంటే ఎంతో బాగుండేది.
(మోహనుడు నీళ్ళతో ప్రవేశిస్తాడు.)
బాల : (సిరాబుడ్డిలో నీరు వేసి కదిలిస్తాడు.) ఇందులో ఒక్క చుక్కగూడా సిరా లేదు. (జోబిలో వెతుక్కుంటూ) సుశీలా !
[లోనుండి ప్రత్యుత్తరంలేదు.]
బాల : (ఒకబొట్టు జేబిలోనుండి చేతిలోపట్టుకొని) సుశీలా ! ఏయ్ మోహనా! సుశీ ఎక్కడికి పోయింది ?
మోహన్ : సుశీలా! అది ఒక గ్లాసుతీసుకొని (జంకుతూ) ఎక్కడికో వెళ్ళింది.
బాల : ఓహో! పాలు తేవడానికి వెళ్ళిందన్నమాట! ఇక యీ యింటిలో టీ కాచడానికి వీల్లేదని చెప్పాను. నా మాట

వినకుండా వెళ్ళిందన్నమాట! రానీ! ఎట్లా తయారుచేస్తారో చూస్తాను. (సుశీల వస్తూవుందేమోనని తలవాకిలి వైపు చూస్తాడు.) పాలకు డబ్బిచ్చి పంపావా?

[జవాబు లేదు.]

బాల : మాటాడకుంటే సరిపోతుందనుకున్నావు. అదెలా జరుగుతుందో నేను చూస్తాను.

[బాలకృష్ణన్‌నాయరు లోపలికి వెళ్ళుతుంటాడు. జానకియమ్మ లేచి యెదురువస్తుంది]

బాల : పాలకు డబ్బిచ్చేపంపావా? అని అడుగుతున్నాను. పదునారురూపాయ లప్పుపెట్టుకొని మరలా పాలు తెచ్చుకోవడానికి సిగ్గులేదా?

జానకి : సిగ్గెందుకు? మనవంటి సంసారాలకు సిగ్గుకూడానా?

బాల : ఇప్పుడు గొంతులోనుంచీ పలుకు గడ్డకువచ్చిందన్నమాట! (వళ్ళుకొరుకుతాడు.)

జానకి : నాకేం మాట్లాడడానికయిష్టంగాదు. ఆ పిల్లను నిద్రపోగొడుతూ నేనూ ఒక చిన్న కునుకుతీశాను. తమరేమింటో పెద్దపెద్దగా అరుస్తూవుంటే, యిప్పుడు మెలకువ వచ్చింది.

బాల : పాలు తెప్పించడానికి వీల్లేదని నేను చెప్పలేదూ?

జానకి : మీామాట లేవీ నాకర్థంగావడంలేదు. మోహానుడు ఇంతవరకూ స్కూలుకుపోయివచ్చిన పిల్లవాడాయెను. వానికి తినడానికేమీా లేదు. సుశీలకు పాపం! తెల్లవారే గంజి చాలాకొద్దిగా వుండింది. దానికేమైనా యింత తినడానికివ్వవద్దూ? నేను ప్రొద్దుటినుండీ గొంతులో నీళ్ళు పోసుకోలేదు. తలచుట్టుకువస్తూంది. నిలవడానికికూడా

సాధ్యంగావడం లేదు. మీకువద్దనకపోయినంతమాత్రంతో- యింటెల్లిపాదీ వుపవాసంలో చావాలనడం యేమీ బాగా లేదు.

బాల : నీమాటలు చూస్తే, యీదినం నేను పంచభక్ష్య పరవాన్నాలూ - తినివచ్చినట్లే నీవు భావించేటట్టుంది. ఈదినం ప్రొద్దుట నేను టీ త్రాగడానికి "అప్పాఅయ్యర్" హోటలుకు వెళ్ళాను. పాతబాకీఅంతా యివ్వందే, అప్పు యివ్వటానికి వీల్లేదని వాడు అటకాయించాడు. నాకు కోపంవచ్చింది. నా ఫౌంటెన్ పేనా కుదువపెట్టి, 5 రూ. లు తీసుకున్నాను. నాలుగురూపాయలు-పదునైదణాల ముక్కాలణా- అప్పుచెల్లించాను. ఇకమీద ప్రాణంపోయినా అప్పుచేయకూడదని నిర్ణయించికొని తిరిగివచ్చాను.

[సుశీల ప్రవేశిస్తుంది]

జానకి : ఆ! వచ్చావా! ఆకలితో మాష్టరుగారు అరుస్తు న్నారు.

[జానకి మూలనున్న నాలుగుకట్టెపుల్లలు తీసుకొని లోనికివెడుతుంది]

బాల : ఇదో! గట్టిగా చెబుతున్నాను. ఈరోజు మనయింట్లో టీచేయటానికి వీల్లేదు. సుశీలా! యిటురా! ఈ కానీ పట్టుకెళ్ళి బజారుకుపోయి యింత సిరా కొనుక్కొనిరా.

సుశీల : (జంకుతూ) యివ్వు డీపాటికి వెళ్ళానంటే తిరిగి వచ్చేంతలోపల చీకటిపడుతుందన్నమాటే!

(లోపలినుంచీ) పొయ్యిపైన నీళ్ళు కాగుతున్నాయ్. కొంచెం యీ టీ త్రాగిపోతే సరిపోతుంది.

బాల : అది మీరే త్రాగండి. నా కొక్క చుక్క గూడా వద్దు.

మోహన్ : (తలవాకిలివైపు జూచి) అదో! తాత వస్తున్నాడు. అమ్మా తాత వచ్చాడు. (ఎదురుగా వెడతాడు.)

[శంకరన్నాయరు తిన్నగా ప్రవేశిస్తాడు. ఆయన్ను చురచురచూస్తూ బాలకృష్ణన్ నాయరు బయటికి వెళ్ళిపోతాడు.]

శంకర : (బాలకృష్ణన్‌నాయరు పోయిన త్రోవవైపే చూస్తూ) ఆ చూపులు నన్ను చంపేసేలావున్నాయి. (కొంచెం సేపు నిదానించి) అమ్మాయీ! కొంచెం మంచినీళ్ళివ్వు. చాలా దాహంవేస్తూంది.

[బదులులేదు]

[మోహనుడు ప్రవేశించి తాతవైపు చూస్తూ నిలుచుంటాడు.]

శంకర : (మోహన్ వైపు చూస్తూ) ఒరే! అమ్మ లేదూ? తాతవచ్చాడని చెప్పు (నిట్టూరుస్తూ) నాలుగు కాలం నాక ముందే యిక్కడికి చేరుకుందామనుకున్నాను. కాని, ఆ గుట్ట యెక్కివచ్చేవరకే పొద్దు మూటు మణిగింది. ఏమి చేతును? (గొడుగు మేజాదగ్గర పెట్టి, కుర్చీపైన కూర్చుంటాడు. కాళ్ళకుతొడుక్కున్న-ఓరట్ట చెప్పులత్రాళ్ళు తెగిపోయినై. విచారంతో వానివైపు చూస్తుంటాడు.)

(లోపలినుంచీ) యిదో! వచ్చాను నాన్నా!

శంకర : అమ్మాయీ! కాఫీపొడి వుంటే, యింత కాఫీ చేసిస్తావా?

[సుశీల ఒక బిక్కెటు చేతితోపట్టుకొని ప్రవేశిస్తూ, శంకరన్నాయరును గూర్చి తలతిప్పుకొని బయటకు పోతుంది.]

శంకర : (సుశీలను చూస్తూ) అమ్మాయీ ! పలకవేమిటే ? జానకీ ! ఈ మొద్దుకు జీతంయిచ్చి పనికుంచుకున్న దిందుకేనా? ఒకపనికీ యీవిడ పలికేటట్టులేదే! దాహ మౌతోంది, మంచినీళ్ళిమ్మన్నాను. ఆవిడ యేమీ బదు లివ్వకుండా తనదారినతాను పోతూవుంది (మట్టితో నిండుకొన్న తన కాళ్ళను సోఫాకుర్చీపై పెట్టుకుంటాడు) యీ అమ్మాయి యేదో జంతువులా పవర్తిస్తూంది. యిలాంటివారికి యింట్లో జీతంయిచ్చి పనికుంచుకోవడ మెందుకు?

(లోపలనుంచి) మోహనా !

[మోహనుడు లోపలికి వెళ్ళుతాడు.]

శంకర : ఒరే, అబ్బాయీ! ఒకచెంబులో నీళ్ళుతీసుకొనిరా! కాళ్ళూ - చేతులూ కడుక్కుంటాను.

[చేతిలోవున్న చెప్పులు క్రిందపెట్టి, లేచి నిల్చుంటాడు. జానకి ఒక చేతిలో టీగ్లాసు - మరోచేతిలో నీళ్ళున్నచెంబూ పట్టుకొని. ప్రవేశిస్తుంది.]

జానకి : ఇదో ! నీళ్ళుతెచ్చాను. (చెంబు క్రిందపెట్టుంది.)

శంకర : (నీటిచెంబు తీసుకుంటూ) కాఫీ లేదన్నమాట?

జానకి : లేదు. ఇది టీ.

శంకర : నాకు కాఫీకావాలని చెప్పినమాట నీ చెవిలో పడలేదూ ?

జానకి : నే నేం చేసేది? యింట్లో కాఫీపొడి లేదు. ఎవరూ తెచ్చేవాళ్ళు లేరు.

శంకర : నా కడుపులో యేదో నొప్పిగావుంది కాఫీత్రాగితే

సరిపోతుందనుకున్నాను. సరే! ఏగోఒకటి! కాళ్లు కడుగుకొని వస్తాను.

జానకి : (మెల్లగా) యిక్కడ కూటికి బియ్యంలేక మేము చస్తున్నాం! ఈయనకు కాఫీ గావాలట! (లోపలికి వెళ్ళుతుంది)

శంకర : (కాళ్లూ - ముఖం కడుక్కొని నామం జపించు కుంటూ ప్రవేశిస్తాడు) నారాయణ! నారాయణ! ఓం ... ... (మేజాదగ్గర పెట్టిన టీగ్లాసు తీసుకొని, ఒక్క గుటక మ్రింగుతాడు) చూచావా అమ్మాయీ!

(లోపలనుంచి) ఏమిటి?

శంకర : యిందులో చక్కెర వేయలేదూ?

జానకి : (బయటికి వచ్చి) కొంచెమే వేసినట్లుంది.

శంకర : ఈ 'టీ' విషంలా వుంది. పాలు లేవు, చక్కెర కూడా లేదు.

జానకి : చక్కెర యింట్లో ఐపోయింది.

శంకర : యిప్పుడు బాలకృష్ణన్ నాయరు వెళ్ళింది చక్కెర తేవడానికి కాదూ? నా కొక చిటికెడు చక్కెర వేయమ్మా. లేకపోతే దీన్ని త్రాగడం సాధ్యంగాదు.

జానకి : ఇంట్లో చక్కెర లేదు. కొని తెచ్చుకుందామంటే చేతిలో దమ్మిడీ లేదు. జీత మింకా రాలేదు.

శంకర : ఇంకా జీతం రాలేదూ! మంచిపనే అయిందిలే! ఈనాడు ఏడవ తేదీ గదూ! బాకీలవాండ్లు నన్ను పీకి పెడ్తున్నారు. అయితే జీత మెప్పు డొస్తుందని?

జానకి : నే నెలా చెప్పను ? సాధారణంగా అయిదవ తేదీ నాటికి వచ్చేది. ఈ నెల యిప్పటివరకూ రాలేదు.

శంకర : అయితే నేను రేపు వూరికి పోవడానికి వీలుపడదన్న మాట ! అయ్యో !

జానకి : మీరు జీతంకోసం కాచుకోవలసిన పనిలేదు. రేపు మీరు వెళ్ళిపోండి ! జీతంవస్తే వూరికి మనియార్డరు చేస్తాను.

శంకర : ఒద్దు ఒద్దు, మనియార్డరుకు వేరేడబ్బు ఖర్చుపెట్టడం దేనికి ? జీతం వచ్చేవరకూ నే నిక్కడే వుంటాలే ! డబ్బులేకుండా వూళ్ళో మొగంచూపించడానికి నాకు సాధ్యంగాదు. ఇంటిచుట్టూ కంచె వేయించేవని అలాగే నిల్చిపోయింది. త్రోవలోపొయ్యే పశువులన్నీ దొడ్డిలోనికి వచ్చి, చెట్లు కొరికివేసి పోతున్నాయి. తుమ్మకొమ్మలు ఒకమోపు ఒకరూపాయి - ఒకటిన్నరరూపాయి అంటున్నారు. పైగా రేపు చిట్ ఫండుకు చీటీయెత్తేరోజు. మరలా ఒకగుక్కెడు టీ నోట్లోపోసుకుంటాడు.) అయితే, బాలకృష్ణన్ నాయరు చక్కెర తీసుకొని రాలేదన్న మాట!

జానకి : ఆ టీ చల్లారకముందే త్రాగివేయండి. కొంచెం హాయిగావుంటుంది.

[సుశీల ప్రవేశిస్తుంది]

జానకి : దొరికిందా?

సుశీల : (దొరికిందని తలఆడిస్తుంది)

శంకర : ఏమిటది?

జానకి : ఏమీ లేదు.

మోహన్ : (ప్రవేశించి) తాతా! నీకేమిటి?

[జానకి, సుశీల లోపలికి వెళ్ళిపోతారు]

శంకర : ఒరేయ్! నీవు 'టీ' తాగావట్రా?

మోహన్ : తాగాను.

శంకర : (మెల్లిగా) నీ కందులో చక్కెర వేయలేదూ?

మోహన్ : (లేదని-తల అడ్డంతిప్పుతాడు)

శంకర : (టీ పూర్తిగా త్రాగి, గ్లాసు మేజాపైన పెట్టాడు. అమ్మాయీ! ఆ వక్కాకుపెట్టె యిటు తే! మగలా ఇరాజీ ఛేరులోనే కూర్చుంటాడు.) చలిపెడుతూంది, కప్పుకోవ టాని కేమైనా లేదూ.

జానకి : (ప్రవేశించి) ఏమిటి పిలిచారు?

శంకర : వక్కాకుపెట్టె వుందా అన్నాను?

జానకి : ఇక్కడ వక్కాకుపెట్టెగూడా లేదు. సుశీలా!

శంకర : బాగానేవుంది. ఇది సరేగాని - ఈ నెలజీతం వస్తే-గడచిన నెలబాకీ-ఈనెలకు సంబంధించిన యిరవైరూపా యలు—అన్నీ యిచ్చేస్తావన్నమాటేగదూ?

జానకి : జీతంవస్తే యేమిచేయాలో తోచడమేలేదు.

శంకర : బాగానే యిచ్చావు ఉత్తరము! అయితే, నాకు చక్రంచుడతావన్నమాటేనా? ఎవరెవరు వాళ్ళువాళ్ళవని చూసుకుంటారు. వాళ్ళకి తండ్రిలేదు, తల్లిలేదు. జానకీ! ఎంత కష్టపడి చదివించాను నిన్ను! నానా యాతనలూ పడ్డాను. ఇప్పుడు నాలుగు జీతపురాళ్ళు చేతికిదొరికేసరికే నీకు నేను కనవడకుండాపోతున్నాను ఆ శంకరయ్యదగ్గర పెట్టిన కుదువ విడిపించుకోనేలేదు. చక్రపాణివద్ద తెచ్చిన

గా నున్నా కొగా నాయలబాకీ అలా వేవుంది. కుంజెన్ పిళ్ళై గారి ప్రాకోటను కమ్మిండీ జమ కట్టలేను ఇవన్నీ నీకోస ం చేసిన బాకీ కదూ! నీ కథ చూస్తే గోరుదాటినపిదప వెప్పు గాళ్ళోలా కనపడుతూంది.

జానకి : అందే వే ఇక్కడికష్టాలు నీ కేం తెలుస్తాయిగనుక. ఈ స.వత్సరం మూడుమాసాలు సెలవుపెట్టాను. రోగం వచ్చింది. దాని కెంత డబ్బు ఖర్చయిందనుకున్నావు? ఇం కెవరున్నా అయ్యంటే చిచ్చిపట్టి దేశంవిడిచిపోయ్యేవారు, ఆ వచ్చినకష్టాలకి.

శంకరం : ఓహో! అప్పుడే భార్యాభర్త లేకమైపోయారన్న మాట! పెళ్ళయితే చాలు, యిద్దరూ ఒకటైపోతారు. ఇక వాళ్ళకి తల్లీ తండ్రీ యెవరూ కాబట్టరు. ఇతరులు యెంత చెప్పినా వాళ్ళపాటే పాట. యేమైనా కానీ-పోయిన మాసంలో 5 రూ॥లు బాకీపడ్డావు. ఈనెలది ఇరవైరూ పాయలు-అంతా చేరి 25 రూ॥లు చేతిలో వేసేవరకూ-యిల్లువిడిచి కదలను...అ-బ్బ-బ్బ-బ్బ-బ్బ!

సుశీల : (ప్రవేశించి) అమ్మా, పిలిచారా?

జానకి : అదో, ఆ బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టు.

సుశీల : సరే.

జానకి : ఇదో, ఆ పడకతీసుకొని అక్కడ పరుచు - నాన్న గారు దానిపైన పడుకుంటారు. ఆయన వస్తే ఆ ఈజీచేరు పైన కూర్చుంటారు.

సుశీల : పరుపుపైన పరవటానికి గుడ్డయేదీ లేదమ్మా!

జానకి : మొదలు నీ వా పరుపు అక్కడ పరుచు. దానిపైన పరవటానికి యేదైనా నేను తీసుకొనివస్తాను.
శంకర : రాత్రికి యేమికూర వండావు ?
జానకి : ఇంకా యేమీ చేయలేదు.
శంకర : అయితే, యింకెప్పుడు చేస్తావు?
జానకి : ఈప్రొద్దు స్కూలునుంచి రావటానికి కొంచెం ప్రొద్దుపోయింది. స్కూళ్ళయినస్పెక్టరు వచ్చాడు.
శంకర : అయితే అమ్మాయీ ! జీతం యెప్పుడు తెప్పిస్తారని ఆయనను అడిగివుండకూడదూ ?
జానకి : ఆయనను అడిగి లాభంలేదు. జీతానికీ ఆయనకూ యేమీ సంబంధంలేదు.
[సుశీల పరుపుతీసుకొని పరుస్తుంది]
జానకి : అదో, ఆ దండెంపైన ఒక గుడ్డవుంది చూడు. దానిని తీసుకొనిరా ! (సుశీల పోతుంది)
శంకర : రాత్రికి యింకా యేమీ కూరవండకపోతే, నీకు పుణ్యంవుంటుందిగానీ, ఆ పిల్లను పంపించి, ఒక అణా చేపలు తెప్పిస్తూ. నాకు నోరంతా చెడిపోయింది. (నవ్వుతూ బిడ్డముఖం చూస్తాడు)
జానకి : ఈదినం చాలా ప్రొద్దుపోయింది. రేపు తెప్పిస్తాను.
శంకర : అయితే రేపు కురచిపోవుగదూ ! మంచి చేపలు తెలిసిందా ?
జానకి : అదో, పరుపుపరిచింది. పోయి దానిపైనకూర్చోండి.
శంకర : ఇప్పటినించీ నిద్రపొమ్మంటావా ? సాయంకాలం

పూట నిద్రపోరాను, తెలిసిందా? కాళ్లూ చేతులూ కడుక్కొని యింత భస్మం పూసుకుంటాను.

జానకి : (మెల్లగా) ఛీ ఛీ! ఏం మనుష్యులు! ఒక ఆడదాన్ని పట్టుకొని యింతగా వేధించుకొని తింటున్నారు. ఒక వైపు మొగుడు – మరో వైపు బంధువులు. వీరినడుమ నాజీవితం నదమదమై నలగిపోతూంది. ఏమిచేయడం? ఎంత కోరుకున్నా చావు రావడంలేదు. మొన్న రోగంవచ్చినప్పుడైనా చచ్చివుంటే బాగుండేది. (నిట్టూర్చి) దినదినమూ యమయాతనగా జీవితం నడుస్తూవుంది. అందులోనూ యీదినమేమో నాకు శనిపట్టుకున్నట్టుంది.

సుశీల : ఈప్రొద్దు అప్పుతెచ్చినబియ్యం రేపే వాపస్ చేయవలెనని ఆవిడ అన్నది.

జానకి : సంసారంకథ చూస్తే యిలావుంది. తినడానికి కూడు లేదు. కట్టడానికి బట్టలేదు. ఒకచీర నీళ్ళలో తడిపితే ఒంటినిండా కట్టుకోవడానికి మరొక్క చీరెకు గతిలేదు. ఈ కష్టాలలో మేము సదమదమౌతూంటే? ముసలాయన నాకు దుడ్డు, నాకు దుడ్డని వేధించుక తింటున్నాడు.

శంకర : (భస్మం పూసుకొని ప్రవేశిస్తాడు) యింట్లో యింకా సంధ్యాదీపం పెట్టలేదా యేమిటి?

జానకి : సుశీలా; ఆ గూట్లోవుండే బెడ్ లైటు తీసుకొని అంటించిపెట్టు.

శంకర : సాయంకాలం కిరసనాయిలుదీపం యెవరన్నా పెట్టుకుంటారా? లక్షణంగా ఆముదందీపం పెట్టాలిగాని

ఇలా అపలక్షణపుపనులు చేస్తే, యింటికి శని పట్టుకొని పాడైపోతుంది. (ఈజీఛేరులో కూలబడుతాడు)

జానకి : (మెల్లిగా) యిప్పుడేమిటి ఎప్పుడో పాడైంది నీ యిల్లు. ఇదో! నాన్నా! నీ వీ పడకపైన కూర్చో! ఆయన ఈజీఛేరులో కూర్చుంటారు. ఆయన కేమైనా వ్రాతపని వుంటుంది.

శంకర : నేనుకూర్చుంటే యేమినష్టమొచ్చింది? బాలకృష్ణన్ నాయరు ఆ పడకపైన కూర్చుంటే ఆయనగౌరవ మేం తక్కువౌతుంది? ఇంతకూ ఆయన రానేలేదుగదా! ఆయనవచ్చేంతవరకూనైనా నే నీ కుర్చీలో యేలకూర్చోరాదు? (కొంచెంసేపూరకుండును) ఇదో! జానకీ, రేపు జీతంవస్తే, నా డబ్బంతా యిచ్చేస్తావుగదూ?

జానకి : ఇక్కడికష్టాలేమీ విచారించకుండా మీ రిలా మాట్లాడితే నే నేం చేయడం? మొన్న చచ్చేటంతరోగంతో పడ్డాను. ఎవరన్నా వచ్చి విచారించారా? అంతటికీ మేము ఆయన్నొక్కణ్ణి పట్టుకొని యేడిపించాలి.

శంకర : అబ్బ! ఎంత బాగా మాట్లాడావు. కట్టుకొన్న పెళ్ళానికి మొగుడుగాక మరెవ్వరు చెయ్యాలి? మొన్న రోగం వచ్చినప్పుడు ఆయనచేసిన సేవను యేమో బ్రహ్మాండంగా ప్రశంసిస్తున్నావు. నీ వేమైనా చెప్పు నా బాకీ నిల్పటానికి వీల్లేదు—నా డబ్బులు నీదగ్గర పెట్టితే నా కేమన్నా వడ్డీ గిట్టుతుందా యేమిటి? బాలకృష్ణన్ నాయరు రేపు యిచ్చివేయాల్సిందే.

జానకి : ఎవరు తీసుకొనిరావాలంటావు జాకీ ?
శంకర : ఎవరేం? నీ మొగుడే. పెళ్ళాన్ని సాకలేనివాడు పెళ్ళెందుకుచేసుకున్నాడూ అంట !
జానకి : ఆవిషయం సరేలెండి. అది ముందే విచారించి వుండవలసినసంగతి. ఒకరిద్దరు పిల్లలుపుట్టినాక యిప్పుడు తేల్చవలసినవిషయంగాదు.
శంకర : ముందు నా కేమి తెలుస్తుంది గనుక? ఏదో పెళ్ళాన్ని పోషించుకుంటా డనుకున్నాను. ఖద్దరుజుబ్బా, మంచి తెల్లని పంచెలూ కట్టుకొని యింటికి నీటుగా వచ్చాడు. ఇచ్చి పెళ్ళిచేశాను.
జానకి : అవసరంగా – నీ విప్పు డెందుకు నోరుజేసుకోవడం ? ఆయన వచ్చే పొద్దయింది.
శంకర : వస్తే నా కేం భయమనుకున్నావా యేమిటి? పెళ్ళాలనిఅడుక్కునేస్థితిలోపెట్టేవాళ్ళు – సిగ్గులేదూ?
సుశీల : అమ్మా ! ఈ బెడ్ లైటులో చమురు లేదు.
శంకర : నారాయణ ! నారాయణ !
జానకి : అదలావుంచు ఆ భార్గవీదేవియింటికిపోయి యింత నూనె అప్పుతీసుకొనిరా !
సుశీల : అన్నిపదార్థాలూ ఒకరినే అప్పడిగితే యేం బాగుంటుందమ్మా?
జానకి : ఏంమునిగిపోయిందిలే. రేపో–మర్నాడో వెనక్కిచ్చేస్తాం. అంతేగా–(సుశీల తెల్లబోయిన మొగంతో పోతుంది)
మోహన్ : తాతా! నీ పుట్టినపండక్కి . నేనూ–అమ్మ వస్తాం.

శంకర : వద్దు వద్దు. ఏమీ రావద్దండి నా పుట్టినపండక్కి క్రొత్తగా యేవస్తువు కొన్నానుగనుక.

మోహన్ : ఈ తాత నేం ఎప్పుడు వస్తానన్నా రావద్దంటాడు. (మోహనుడు విసుక్కుంటాడు)

శంకర : ఎన్నాళ్ళని నే నిక్కడుండటం?

జానకి : అందుకే, 'రేపు వెళ్ళిపోండి' అని అన్నాను. జీతం యీదినమే వస్తుందని నేను నిశ్చయించి యెలా చెప్పను.

శంకర : అమ్మాయ్! నన్నిలా మోసంచేయడానికి ప్రయత్నించవద్దు జీతంవచ్చేసమయానికి నేనులేకుండబట్టే నాకు గడచిన నెలలో 5 రూ॥లు తగ్గించావు ఇక మీద అలా జరగదు.

జానకి : ఎంతయిచ్చినా మీకు తృప్తిలేదు. ... ... ... ప్రతినెలా మీకు డబ్బివ్వాలంటే ఎక్కడ నాకర్మం? నే మిక్కడ బాకీలతో చస్తున్నాం. చిన్నప్పుడు నన్ను చదివించటం – నా ప్రాణానికి పూరిగా కూర్చుంది.

శంకర : పెద్దా–చిన్నా లేకుండా వాగకు. చిన్నప్పుడు నిన్ను నేను చదివించకుండావుంటే, యీ చీరా–యీ బ్లౌజూ ధరించేదానివేనా ? ఉన్నడబ్బంతా నీచదువుకు ఖర్చు పెట్టాను. జీతంవచ్చినప్పుడు నాలుగుకాసు లిమ్మంటే, దానికి కృతజ్ఞత నీరీతిగా ప్రకటిస్తున్నావు. (లేచి నాలుగడుగులు వేసి, మరలా కుర్చీలో కూర్చుంటాడు) నిన్ను చదివించడానికి నూర్లకొద్దీ రూపాయలు ఖర్చుపెట్టాను. ఆ రూపాయలే వడ్డీకిచ్చుకొనివుంటే, నా కీనాడీ కష్టాలు వచ్చేవిగావు. ఈ ముసలితనంలో కొండలు – గుట్టలూ

యెక్కవలసినపరిస్థితి వచ్చివుండదు. అ గుట్టదాటి వచ్చే టప్పుడు నా చెప్పులవారులు కాస్తా పోయాయి.

జానకి : నాకు యిద్దరు పిల్లలున్నారు.

శంకర : ఉంటే ... ... వాళ్ళకు తండ్రికూడా వున్నాడు తెలిసిందా ? నాకు చెప్పినమాటప్రకారం – నెల కిరువది యైదు రూపాయలు – తప్పక యివ్వవలసిందే !

[ఒక సుడిగాలివలె బాలకృష్ణన్‌నాయరు యింటిలో ప్రవేశిస్తాడు. జానకి వులిక్కిపడి నిలుచుంటుంది]

బాల : ఈ చీకట్లో సుశీల నింటింటా అడుక్కోవడానికి పంపించావన్నమాట ! లేదూ ? నే నంటేమాత్రం నీ క్కోపం వస్తుంది.

[జానకి యేమీ పలక్కుండా నిలుచుంటుంది]

శంకర : ఇంతసేపూ యెక్కడికి వెళ్ళావు ? నేనువచ్చి సుమారు రెండుగంటలైనది. చేతిలో దమ్మిడీలేదు. అందుకే వచ్చాను.

బాల : ఊఁ ... ... ... ...

[మేజాపై వున్న సిరాబుడ్డి యెత్తుకొని లోపలికి వెళ్ళుతాడు]

జానకి : నాన్నా, ఆ కుర్చీమీాదనుండి లే. అక్కడ ఆయన కూర్చుంటారు.

శంకర : ఇప్పుడు బాలకృష్ణన్‌నాయరు స్నానంచేయడూ? స్నానంచేసివచ్చేవరకూ యిక్కడే వుంటాలే (ఈజీఛేరు పైన బాగా కాళ్ళుజాచి పడుకుంటాడు.)

[బాలకృష్ణన్‌నాయరు సిరాబుడ్డిలో-సిరాపొడివేసి-నీళ్ళువేసి-ఆ బుడ్డిని ఆడించుకుంటూ వస్తాడు]

శంకర : జానకికి జీతం రేపు వస్తుందిగదూ?

బాల : నాకు తెలీదు.

[జానకి లోపల ప్రవేశిస్తుంది. బాలకృష్ణన్‌నాయరు కాంపోజిషన్ పుస్తకాలు చూస్తూవుంటాడు]

శంకర : ఇదో, ఈ కుర్చీపైన కూర్చుంటావా?

బాల : వద్దు. మీరే కూర్చోండి.

జానకి : (లోపలినుంచి టీ తెచ్చి) ఇదో 'టీ'

బాల : నాకు వద్దు. మరెవ్వరికన్నా ఈయి.

జానకి : మేమందరం త్రాగాం. మీ కిష్టముంటే తాగండి లేకపోతే లేదు. (దగ్గర గ్లాసుపెట్టి వెళ్ళిపోతుంది.)

బాల : ఇదో! యీ గ్లా సిక్కడినించీ తీసుకొనిపో! లేకుంటే దీనిని పగులగొడతాను.

జానకి : (లోపలినుంచి) మీ యిష్టంవచ్చినట్లు చేసుకోండి.

బాల : మోహనా! యీ గ్లాసు తీసుకొని లోపలపెట్టు.

జానకి : (లోపలనుంచి) ఒరేయ్! నీ నక్క దుండవాకు, ఉంటే తన్నులు పడుతాయ్.

[మోహనుడు నాయనముఖంవైపు చూచి, భయపడినట్లు లోపలికి వెళ్ళిపోతాడు.]

బాల : ఈ మేజాపైన సామాన్లన్నిటికీ చోటు చాలటం లేదు.

శంకర : నీకు టీ యెందుకక్కరలేదు? బయటికి వెళ్ళినపుడు త్రాగివచ్చావనుకుంటా ?

బాల : అవునవును. (రూక్షంగా చూస్తాడు. ఆ చూపులతో జంకినట్లు శంకరన్నాయరు లేచి లోనికివెడతాడు.)

శంకర : (పోతూ పోతూ) ఆయన కేమో పిచ్చిపట్టినట్లుంది.

బాల : (శంకరన్నాయరును చూస్తూ) నిజమే! పిచ్చెత్తింది. ఇదో! ఇక్కడో దీపం గావాలి.

జానకి : (లోనుండీ) తెస్తున్నాను.

(సుశీల గసపోసుకుంటూ వస్తుంది.)

బాల : సుశీలా! నీకు భిక్షంయెత్తుకోడానికి జానకి బాగా నేర్పించిందిగదూ!

సుశీల : (తిన్నగా) లాంపులో నూనె ఒక్కచుక్కగూడా లేదు. అందుకై బయటికి వెళ్ళాను.

జానకి : (లోనుండీ) సుశీలా! ఆ దీపం వెలిగించుకొనిపోయి మేజాదగ్గర పెట్టు.

మోహన్ : (మెల్లగా ప్రవేశించి) లేదు. అమ్మా! నాన్న టీ తాగలేదు.

బాల : ఈ గ్లాసెత్తుకపో వెధవ!

[నామము జపించుకుంటూ శంకరన్నాయరు ప్రవేశిస్తాడు. ఈజీఛేరు పైన కూర్చొని - మోకాళ్లు పిసుక్కుంటూ వుంటాడు.]

మోహన్ : నాన్న! స్నానంచేస్తారేమో అడిగిరమ్మందిఅమ్మ.

బాల : (బదులివ్వడు.)

మోహన్ : అమ్మ అడిగిరమ్మంది.

బాల : నీవు ముందిక్కడనుంచీ వెళ్ళిపో. (వాణ్ణిపట్టి నూకుతాడు. మోహనుడు నేలపైన పడుతాడు. వానివైపు చూడకుండానే బాలకృష్ణన్నాయరు పరుషస్వరంతో) దీపమెక్కడ?

[సుశీల దీపంతెచ్చి మేజాదగ్గర పెట్టి పోతుంది.]

శంకర : ఏమిటిదంతా?

బాల : ఏమో !

శంకర : నారాయణ ! నారాయణ... ! (లోపలికి వెళ్ళుతాడు.) అమ్మాయ్, నాయరు ఆ పిల్లవాణ్ణి వదేశాడు. (లోపలికి చూచి) - ఏమిటీ! లోపల దీపమున్నట్టులేదే? (లోనికి వెళ్ళుతాడు.)

జానకి : (బయటికివచ్చి బాలకృష్ణన్‌నాయరుతో) ఇదో, మీరిలా చేస్తే నాకు చాలా కష్టమౌతుంది.

[మోహనుడు నోరుమూసుకొని శబ్దం గడ్డకురాకుండా యేడుస్తూ వుంటాడు.]

జానకి : (మోహనుణ్ణి లేపి నీ దిక్కడ నిలుచుకోవద్దని నేను ముందే చెప్పలేదూ ! నిలుచుకొన్నదానికి మంచి శాస్తి అయిందిలే ! ఇక లోనికి వెళ్ళు. మీ నాన్నగారికోపం నిన్ను యెన్నడో ఒకనాడు చంపేస్తుందిలే ! (వానికళ్ళు తుడుస్తుంది)

బాల : (క్రూరంగాచూస్తూ) బాకీసనూలుకు వచ్చాడు చూచావా ? నీవుగూడా మీ నాన్నతో వెళ్ళిపో ! నీవు వెళ్ళితే ఆయన మరలా యిక్కడకు రాడు.

జానకి : మీ రిలా అంటారని నే నెప్పుడో వూహించాను లెండి.

బాల : ఇక్కడ కూటికిలేక మనం చస్తున్నాం. చేతికి దొరికినడబ్బంతా నీవు మీ అమ్మకూ - నాన్నకూ పంపివేస్తావ్. జీతంవస్తే చాలు, ఒకటే పీడ. ఈ కాంపోజిషన్ పుస్తకాలు ముగిస్తామనుకున్నాను. నే నేం చేయను ? ఆ ఈజీ ఛేరుపైన గణపతిలా ఆయన అధిష్ఠించాడు.

జానకి : (తలపైన చేతులుపెట్టుకొని) అలా గట్టిగా అరవ వద్దండి. ఆయనకు వినబడుతుంది. ఏమి పీడ ప్రాప్తించిం దిరా దేవుడా !

బాల : అయితే న న్నేమిచేయమంటావ్ ? నిన్ను నాకిచ్చి పెళ్ళిచేసినందుకు – మీ నాన్నగారిని పూలుతెచ్చి పూజించమన్నావా ?

జానకి : నా తలవ్రాతకు మీ రేంచేస్తారు ? స్నానంచేస్తారా యేమిటి ? ఇదో స్నానంచేస్తే మీరు కట్టుకొన్నగుడ్డ తడుపవద్దండి. మీ మారుపంచె ఆ పడకపైన పరచాను. మీ గుడ్డలు తడిపితే, మీకు వేరే కట్టుకోవడానికి పంచె లేదు.

బాల : ఇంత సోదెచెప్పడానికంటె, మీరు స్నానంచేయ వద్దండి, అంటే బాగుంటుందిగదూ. ఈ ప్రొద్దు యీ అంగీ పంచె మారుద్దామనుకున్నాను.

జానకి : నేను తెల్లారిగట్ల ఈ రెండూ వుతికివేస్తానులెండి. ఎండకూడా వుంటుంది.

బాల : ఇదో, ఈ టీ లోనికి తీసుకొనిపో. నేను ఆ కాల్వకు పోయి, స్నానంచేసి వస్తాను – అదే మంచిది.

మోహన్ : నాకు నిద్రవస్తూంది.

జానకి : చాప పరుస్తానుండు. ఇంత గంజివుంటే తాగుదువు గాని.

శంకర : (తలయెత్తి చూచి) యేమి. బాలకృష్ణన్నాయ రప్పుడే లెగిశాడన్నమాటే !

జానకి : స్నానంచేయడానికి వెళ్లారు.

శంకర : (ప్రవేశించి) లోపల దీపంకూడా లేదేమిటి జానకీ ?
జానకి : లాంపులో ఒక్క చుక్క కూడా నూనె లేదు. (కొంచెం సేపూరకుండి) సుశీలా ! నేను తలకిరాచుకోడానికి కాచి పెట్టిన నూనె కొంచెం - ఆ సెమ్మెలో వేసి - ఒత్తితడిపి దీపం వెలిగించు. ఆ చాప కొంచెం పరుచు, మోహానునికి నిద్రవస్తూన్నదట !
శంకర : రాత్రికి బియ్యం కొంచెమే వున్నాయేమిటి ? ప్రొద్దుట వండిన అన్నమేమైనా మిగిలివుందా ?
జానకి : ఈ చింతలన్నీ మీ కెందుకు చెప్పండి. మీరు కడుపు నిండా తింటే సరిగదా ! ఇక్కడికష్టాలు నూరుంటాయి. నన్నుచూచైనా మీరు వూరుకోనండి. (మోహానుణ్ని చూచి) ఒరేయ్ ! పదరా చాప పరుస్తాను.
శంక : యేదో ! తెలుసుకుందామని అడిగాలే. (మరలా ఈజీఛేరుపైనే కూర్చుంటాడు) యేదో నామంజపిస్తూ కళ్ళుమూసుకుంటే, నా కంతే చాలు.
(జానకి - మోహానుడు లోపలికి వెళ్ళుతారు.)
శంకర : శివరామ - గోవింద - నారాయణ !
మహాదేవ - కృష్ణ హారే
హారేకృష్ణ మహాదేవ నారాయణ !
గోవింద ! రామ ! శివ !

[ఈజీఛేరుకు వేసినగుడ్డ చినిగిన ధ్వని ఔతుంది. తొందరగా లేచి పరీశీలిస్తాడు. ఇక దానిపైన కూర్చోవడానికి కాదని పోయి పడకపైన కూర్చొని భజన సాగిస్తాడు. బాలకృష్ణనాయరు ప్రవేశం.]
బాల : యీ భజన కొంచెం మెల్లిగాచేస్తే యితరులపనులు కూడా కొంత సాగుతాయి. నా కిక్కడ కొంతపనుంది.

శంకర : (మెల్లగా భజనచేసుకుంటాడు) జీవితంలో నా కంతా తీరిపోయె. ఇక నా కేముంది గనుక.

బాల : (ఏదో ఆలోచించినట్లు నటించి) మీ కిక్కడ పండు కుంటే చలిగా వుంటుందనుకుంటాను. లోపల పడుకొంటే మంచిది. నే నీ పడక లోపల పరుస్తాను.

శంకర : అది మంచిపని. (లేచి) గురువాయూరు కృష్ణా! రక్షించు మాయప్పా! (కళ్ళుమూసికొని ప్రార్థిస్తాడు) వచ్చేరోగాలను రాకుండా చెయి. వరాలీవయ్యా గురువా యూరప్పా!

[కాళ్ళుముడుచుకొని - పద్మాసనంవేసుకుంటాడు. వినయాన్ని ప్రదర్శిస్తూ గుంజిళ్ళుపెట్టునట్లు చెవులుమూసికొని నేలపైన తలవంచి, మూడు సార్లు నమస్కారంచేస్తాడు]

శంకర : అయితే అలాగే కానీ.

[బాలకృష్ణన్‌నాయరు పరుపుతీసుకొని లోపలికి వెడుతాడు]

జానకి : గంజి త్రాగడానికి ప్రొద్దయింది. మీరు లోపలికి పొండి. సుశీల వడ్డిస్తుంది.

శంకర : బాలకృష్ణన్ నాయరుకుమాత్రం ప్రొద్దుపో లేదూ?

[బాలకృష్ణన్‌నాయరు ప్రవేశిస్తాడు]

జానకి : మీరు ముందుగా పొండి. సుశీలా! నాన్నగారికి వడ్డించు.

శంకర : నారాయణ! నారాయణ! (పోతాడు)

జానకి : మీ రెందుకు యీ పడక లోపల పరిచారు? ఇలా మీకు ప్రతిమాటకు కోపంవస్తే యెట్లా? ఇక తక్కిన వాళ్ళంతా యెక్కడ పండుకోవాలి?

బాల : నే నిక్కడే పడుకుంటాను.

జానకి : ఆ చిరిగినచాపపైన యీ చెమ్మలో పిల్లలూ - నేనూ యెలా పడుకుంటాము?

బాల : మీరుగూడా యిక్కడే పండుకోవాలని నేను చెప్పానా?

జానకి : వద్దు. వద్దు. (తలఆడిస్తుంది)

బాల : నే నిక్కడే తప్పక పండుకుంటాను. ఆయన సుఖంగా లోపల పండుకోనీ.

జానకి : ఇదో! చూడండి. మీా రీ మాట న న్నేడిపించ డాని కంటున్నారు. మీా రిలా అనకూడదు. మా వా ళ్ళెవరు వచ్చినా మీా రిలా చేస్తుంటారు. వారు బొత్తిగా రానేగూడదంటే సాధ్యమౌతుందా?

బాల : ఎందుకు రాకూడదూ? వాళ్ళనిగూడా స్థిరంగా యిక్కడే వుంచుకో సరిపోతుంది. నేను నా యిష్టమైన చోటికి వెళ్ళిపోతాను. జీతంవచ్చేసరికల్లా ముసలివాడు హాజరౌతాడు. ఇలాఅయితే యీ యింట్లో వుండడం నాచేతగాదు. రేపు తెల్లారి యీ యింట్లో నా ముఖం నీకు కనపడదు.

[జానకి పెద్దగా నిట్టూరుస్తుంది]

బాల : లేకపోతే నీవుకూడా ఆయనతోపాటే వెళ్ళిపో.

జానకి : బాగానేవుంది, మీారు చెప్పేది. ఇన్నిసంవత్సరాలు కాపురంచేసినాక యిప్పుడు వెళ్ళిపొమ్మంటారు? ఇప్పుడు పోతే చాలా బాగుంటుంది!

బాల : ప్రతినెలా యిలాగ వచ్చినసంబళమంతా పుట్టినింటికి చేరవేస్తే, యీ సంసారం భరించడానికి నాచేతగాదు.

జానకి : ప్రతినెలా యింతడబ్బు పంపిస్తానని నేనా చెప్పింది, మీరా? మీకై మీరే యీ బాధలన్నీ నెత్తికెత్తుకుం టారు. ఆ తప్పు నా తలపై వేసిరుద్దుతారు.

బాల : అబ్బబ్బ! బాకీతీర్చవలసిన జవాబుదారీవున్న ఒక సేవకురాలిని పెళ్ళాడుతున్నానని నాకు నిన్న వివాహం చేసుకునేటప్పుడు తెలియనేలేదు. వాడు కష్టపడి సంపా దించినడబ్బుగూడా ఖర్చుపెట్టుకునే అధికారం వానికి లేకపో తే......!

జానకి : ఇదో, రేపు జీతంవస్తే ఒక్కదమ్మిడీగూడా నేను తీసుకోను. అంతా మీచేతిలో వేసేస్తాను. మీరే ఆయ నకు సమాధానంచెప్పుకోండి. ఉన్న నాలుకాసులూ - ఆయనచేతిలో పెట్టి, మన మిక్కడ, బిచ్చమెత్తుకోవా లని నాకుమాత్రం యిష్టంవుంటుందా యేమిటి?

బాల : నాచేతగాదు. ఆయన నీ చదువుకి యెన్ని వేలు ఖర్చు పెట్టాడో యెవ్వరికీ తెలియదు. కానీ—బాకీమాత్రం యీ జన్మలో తీరేట్టు కనపడ్డంలేదు. నీవుగూడా ఆయనతోనే పో.

జానకి : డిస్ట్రిక్ట్‌బోర్డులో ౫ సంవత్సరాలున్న సర్వీసును వదులు కొనిపోవటానికి నాకు పిచ్చిపట్టిందనుకొన్నారా యేమిటి?

బాల : అయితే నాకు పట్టిందంటావా? కాని - నెల నెలకూ ఆయన రావడమేమిటి—యేడ్పించడమేమిటి? నాచేతగాదు. నేను వెళ్ళిపోతాను.

జానకి : అందుకనుకూలంగా వుండాలనేనా? భయట పడు

కుంటున్నారు. (కళ్ళనిండా నీళ్ళుపెట్టి, జాలిగా అతనివైపు చూస్తూ) అయ్యో...!

బాల : రాత్రీ-పగలూ ఒకటేకష్టం. కాని-మనపాలిటికి కష్టం మాత్రమే మిగిలింది.

జానకి : ఆ 'టీ' తాగనేలేదు. ఆ గంజైనా కాస్త తాగండి.

[లోపల శంకరప్పిళ్ళె తేన్చుకుంటూ రామనామజపం ఆరంభిస్తాడు.]

జానకి : నే నా పడక తెచ్చి బయట వేస్తాను. లేకపోతే, ఆయన పోయి దానిపైన పడుకుంటాడు.

బాల : ఆయ నక్కడే పడుకోనీలే.

జానకి : అది బాగలేదు.

బాల : యిప్పుడు నే నేమి పాఠంపట్టానని నీబాధ?

శంకర : (ప్రవేశించి) అయితే, బాలకృష్ణన్! నేను పడుకుంటాను. ఇదో, మీ కష్టాలు నాముందు యేకరువుపెట్టే లాభంలేదు. జీతంవస్తే నాకు తెలీకుండా యేమీ ఖర్చు పెట్టకండి.

బాల : మీరు చెప్పవలసిందంతా జానకితో చెబితే చాలు.

[జానకి పడకచుట్టుకొని బయటికి వస్తుంది]

శంకర : అయితే, పడక చుట్టుకొనివస్తున్నా వెందుకు?

జానకి : మీ రిక్కడే పడుకోండి.

శంకర : ఇక్కడ చల్లగావుంటుందని బాలకృష్ణన్ అన్నాడు.

జానకి : ఇక్కడగాదు, అక్కడే చల్లగావుంటుంది. అదో, పడుకోండి. నేను పిల్లవాడికి యింత గంజిపోస్తాను. (జానకి పరుపుపరచి నిలుచుంటుంది)

బాల : ఆ పడకెత్తుకొనిపోయి లోపలే పరుచు.

జానకి : మీ రిలాచేస్తే మాటిమాటికి నాచేతగాదు.
(వెళ్ళిపోతుంది.)

[శంకరన్నాయరు యేమీతోచక చూస్తూ నిలుచుంటాడు]

బాల : అయితే, నేనే చేస్తాలే ఆ పని. (పడకచుట్టి యెత్తుకుంటాడు)

శంకర : జానకి! యీ నా చెప్పులు (వానినెత్తి చేతిలో పట్టుకొని) యివి బయటపెట్టితే కుక్కా--గిక్కా యెత్తుకొనిపోదూ? (కొంచెం ఆలోచించి, వానినిగూడా తీసుకొని లోపలికి పోతాడు)

బాల : (పడకపరచి) యిక్కడ సుఖంగా పండుకోండి.

[తిరిగివచ్చి కాంపోజిషన్‌పుస్తకాలముందు కూచుంటాడు]

(లోనుండి) : అమ్మా! యిక్కడ తాత పడుకున్నాడు. ఇక నే నెక్కడ పడుకోనూ?

జానకి : సుశీలా ! వాణ్ణెక్కడో ఒకచోట పడుకోబెట్టు. నే నింతలో వస్తాను.

బాల : (మెల్లగా) రెండుమూడుమాసాలు జానకి జబ్బుతో పడింది. పుట్టేచోటంతా అప్పుతీసుకొనివచ్చాను. అప్పుడు వీళ్ళెవరూ తొంగిచూచినవాళ్ళుకాదు. ఇప్పుడు జీతం వస్తుందని పరుగెత్తుకొనివచ్చాడు. బాగానేవుంది.

జానకి : ఆ టీ తాగలేదు. నేను గూడా తాగకుండా మీకు పంపించాను (దగ్గరదగ్గరికి జరిగి) ఇదో, పోదాం రాండి. కొంచెం గంజైనా తాగుదురుగాని.

బాల : నాకు గంజివద్దని చెప్పలేదూ?

జానకి : మీా రిలా మాతంపట్టకూడదు. రాండి పోదాం. (ఆయనచేయి పట్టుకొనును.) పోదాం రాండి. ఆ దీపం నేను తలకురాచుకునే చమురుతో అంటించాను. లేవండి. (బదులులేదు) ఈ టీ అలాగేవుంది. అయ్యో! (ఆయన ముఖంవైపు చూస్తుంది)

బాల : టీ (గ్లాసు యెత్తుకొని ఆమెనెత్తిపై వేస్తాడు) బాకీ దార్లు-యెక్కడపడితే అక్కడ డబ్బడుతుగున్నారు.

జానకి : నన్ను చంపండి. నేనుచేసిన తప్పేమిటో నాకు తెలీదు...నా తప్పంతా ఒకటే!...స్త్రీగాపుట్టడం......

[నిట్టూర్పులు, ఏడ్పులు, కన్నీళ్లు]

[తెరపడుతుంది]

# విశంకటు సంబంధాలు

రచయిత:

ఇడశ్శేరి గోవిందన్నాయరు

ఇతడు కవి. నాటకకారుడు. స్వదేశాభిమానం శరీరమెల్ల గలవాడు. పురోగమనసాహిత్యమును సృష్టించు నేటి అగ్రగాములలో నితడుగూడ ఒకడు. తొలినాళ్ళలో పురోగమనభావాలను వెల్లడించే కవిత్వాలను వ్రాస్తూండేవాడు. రాగ రాగ నాటకకర్తగా పరిణతినిపొందినాడు. "కూట్టు కృషి" అనేది ఆయన ప్రసిద్ధమైన నాటకం. దాన్ని ప్రదర్శించని కళాశాలలు కేరళంలో లేవనియే చెప్పవచ్చు. ఆయన పర్యవేక్షణక్రింద అనేక సాహిత్యసంఘాలు పొన్నానిలో పని చేస్తున్నవి.

## పాత్రలు:

కృష్ణమీనన్

నంబియార్

శంకరప్పిళ్ళై

కృష్ణన్

అమ్మ

తల్లి

సుశీల

రామనాథం

మేజస్ట్రీటు

డాక్టరు

ఇన్స్పెక్టర్

హెడ్ క్లార్కు

# విశంకటు సంబంధాలు

[ఒక పెద్ద బంగళాయొక్క ముందుభాగం. అందులో - పెద్ద పెద్ద అద్దాలూ - వ్రేలాడదీసిన చిత్రాలూ - గోడలకు తగిలించబడిన దుప్పి కొమ్ములూ - మొదలైన ఆడంబరాలు. రకరకాల కుర్చీలూ - గుండ్రని బల్లలు. సమయం - మధ్యాహ్నం మూడుగంటలు. యువకుడైన కృష్ణ మీనన్ ఆఫీసుకుపొయ్యేవేషంలో వున్నాడు. సిగరెట్టు వెలిగించి - ఏదో ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు.]

కృష్ణమీనన్ : నంబియూరూ! ఓ నంబియూరూ!

[నంబియూరు ప్రవేశిస్తాడు. వయస్సు నలభైయేళ్లుండును]

నంబి : ఏమిటి?

కృష్ణ : (నంబియూరుముఖం తదేకదృష్టిగా చూస్తూ) ఆ విషయం తెంచివేయాలి

నంబి : ఎలా తెంచివేయడం ?

కృష్ణ : ఏదో చెప్పి వారిని పంపించివేయాలి. వెళ్ళిపోనీ ఆ తల్లీ పిల్లా.

నంబి : ఎక్కడికి?

కృష్ణ : ఎక్కడికంటే ? ఎక్కడికన్నా పోనీ మనకేమి ? ఇక్కడమాత్రం వుండరాదు.

నంబి : (ఏదో సందేహిస్తూ) కొంచెం డబ్బిచ్చి......ఏవో మంచిమాటలాడి...ఏమిచేసినా వారు పోతారా అని.

కృష్ణ : ఏమిటి? డబ్బివ్వాలా! మంచిమాటలు చెప్పాలా! ఇలాచేస్తే వదిలినట్లేవుంది. వాళ్ళిదే ఆట కనుక్కొని

మాటిమాటికీ డబ్బడుగుతూవుంటారు. పరుగెత్తించాలి ......పరుగెత్తించాలి......శనిపీడ.

నంబి : పోరనుకుంటూ. అందులో-కడుపు వేసుకుని...

కృష్ణ : ఎందుకు పోరూ? నా కష్టం నీ వాలోచించటంలేదు. నా స్థితేమిటి?..ఆసంబంధమేమిటి?..వాళ్ళకేమి! ఇలాంటి వైన్నైనా సరిపోతాయి. నేనుకూడా ఒక కూలీఅయి వుంటే-యీసంబంధం నా కేమీ అవమానం తెచ్చేదికాదు ......కాని-నా స్థితీ!-నా అంతస్తూ!...

నంబి : అదంతా నిజమే. కాని, వాళ్ళని పంపి వేయడంలో-కొంత కష్టంవుంది.

కృష్ణ : కొంచెమా!

నంబి : కాదు. పెద్దకష్టమే వుంది.

కృష్ణ : నాకు రాత్రంతా నిద్రరానేలేదు. ఆలోచించి-ఆలోచించి యీ నిర్ణయంచేసివేశాను.

నంబి : ఈనాడు పనికి రావద్దనికూడా హెడ్‌క్లార్కు చెప్పి వట్లుంది......

కృష్ణ : ఏమిటీ!

నంబి : కాదు. చెప్పివుంటాడనుకుంటాను. పాపం......

కృష్ణ : ఒకపాపమూ లేదు. ఇంతవరకూ మనం ఎంతో వుప కారంచేశాము. పని నేర్పించాము-కూలీయిచ్చాము... ఇతరులైతే పనినేర్పించినదానికి కూలి తీసుకుంటారు.

నంబి : ఇప్పుడు-మనం పంపించివేస్తే జనులు నిందిస్తారు. అందరికీ యీ సంగతి తెలుసు.

కృష్ణ : ఏమిటి తెలుసు ?

నంబి : (నీళ్ళునమలుతూ) ఆ గర్భానికి యజమాని ఇక్కడే ఉన్నాడనేవిషయం.

కృష్ణ : (నెత్తిగోక్కుంటూ) ఎవరన్నారు ?

నంబి : కొందరు పెద్దమనుష్యులుకూడా యీ విషయం వాడుకుంటున్నారు. ఆ మేజస్ట్రీటు – యీ రామనాథం కూడా......కొద్దిరోజులక్రితం.........

కృష్ణ : బాగానేవుంది. ఇదా విషయం! ఆ మేజస్ట్రీటు నాకు విరుద్ధంగా యేమీచేయడు. ఇక–ఈ రామనాథంగాడా... వాడొక లెక్కా...వాడు... మొదలు తనగుణం సరిజేసుకుంటే చాలు.

నంబి : కాని – జనులు అప్పుడప్పుడూ యీవిషయం ప్రస్తావించుకుంటూవుంటారు.

కృష్ణ : అదే...ఆవిషయమే ఆలోచిస్తూవున్నాను. కాని... దానికూ్కడా అంత భయపడపలసింది లేదనుకుంటాను. ఏదైనా ఒకవిశేషం జరిగితే, ప్రజ నాలుగురోజులు–దానిపైన బ్రహ్మాండంగా వ్యాఖ్యానిస్తూవుంటుంది. ఇంతలో మరొక కొత్తవిషయం జరిగితే వారిదృష్టి – పాతదాన్ని వదలి – కొత్తదానిపైకి పోతుంది.

నంబి : నిజమేననుకోండి...

కృష్ణ : అదలావుంచు. వీళ్ళను ముందు తరిమేసెయ్యి. రెండు రోజులు ప్రజ లనుకుంటారు. తర్వాత రెండురోజులు గడిస్తే, మన మిల్లు జూబ్లీమహోత్సవంవస్తుంది. జనులు– ఆ గద్దలంలోపడి–యీవిషయమే మరచిపోతారు.

నంబి : కాని–ఎలా వెళ్ళగొట్టడం! ఇంతకుముందుటిది నాల్లో అయితే – ఇంట్లో దూరి – కుండబొచ్చెలు బైటపారవేస్తే తీరిపోయేది. ఇప్పుడలా కుదరదు. కోర్టుకుపోయినా– కేసు పరిష్కారం కావడానికి–సుమారు రెండు నెలలయినా పడుతుంది.

కృష్ణ : అవునవును. రెండుసంవత్సరాలవుతుంది! మాట్లాడడం బాగా నేర్చుకున్నావయ్యా!

నంబి : అయితే, నన్నేలాచేయమంటారు ? వాళ్ళకు కొంచెం డబ్బివ్వండి – అప్పుడప్పుడు కొంచెం డబ్బిస్తూ – విషయం బైటికి పొక్కకుండా చూచుకోనండి. ఎలాగయినా మీ సొత్తేగదా !

కృష్ణ : (ఉలిక్కిపడి) ఏమంటావూ! ఈ సంబంధం నా మెడకట్టుకోమంటావు? అలా ఎన్నిరోజు లిమ్మంటావు డబ్బు ఎంతిమ్మంటావు? ఏదో మాటలు చెప్పి – నాలుగు కాసులు నీవే చేతిలోపెట్టు – వాళ్ళగ్రామానికి నీవే పంపివేయి. ఆ కాసులు ఖర్చయ్యేలోగా – ఆవిడకు వేరే వాడు తగులుకుంటాడు...సరిపోతుంది.

నంబి : అయినా.

కృష్ణ : అయినా లేదు–కయినా లేదు. వెంట నేపోయి పంపి వేయి.

నంబి : వారు పోరు.

కృష్ణ : పంపించడంలోనె నీ సామర్థ్యమంతా వుంది మరి. ఒకపని చేతాము ఏదో మాటలుచెప్పి – నీవు వాళ్ళని గుడిసెనుండీ బయటికి పంపు. తరువాత ఒక్కగంటలో – వాళ్ళ గుడిసె అక్కడలేకుండా చేస్తాము. ఈ పనికి మను

ష్యుల్ని నియమిస్తాను. వాళ్ళు ఒక వేళ తిరిగివచ్చినా —
అక్కడ కొంప - గోరీ ఏదీవుండదు. అప్పుడు ఏంచేస్తారు?
తమ సొంతవూరికి పోతారు

నంబి : కాని-వాళ్ళను-ఆ యింట్లోనుంచీ గడ్డకువచ్చేటట్లు
చేయడమెలాగని ఆలోచిస్తున్నాను.

కృష్ణ : ఏదో ఒకసలహా చెప్పాలిమరి...తల్లీ బిడ్డా యిద్దరూ
పోయి - హెడ్ క్లార్కును చూస్తే పనిదొరుకుతుందనో...
...ఏదో ఒకసలహా. ఆ హెడ్ క్లార్కొకడు - మోసాల
పుట్ట.

నంబి : ఈవిషయం మన మొట్లా సవరించుకున్నా - ప్రజ
లున్నారుగదా! వారినోళ్ళు మూయడమెలాగ ? నాకదే
ఎక్కువ భయంగావుంది.

కృష్ణ : నీవూ - నీ జనాలూ! ప్రజలేమిటి ... కుక్కలవంటి
వారు...వాళ్ళను వెళ్ళగొట్టు. ప్రజలను మోసగించే
విధానాలు నాకు బాగా తెలుసులే. ఈ పొద్దు సాయం
త్రం—ఐదుగంటలకి - ఒక టీపార్టీ ఏర్పాటుచేయి.
మేజస్ట్రీటూ—ఇన్స్పెక్టరూ—డాక్టరూ—మనవకీలూ
—రామనాథం—అందరినీ ఆహ్వానిస్తాము. మన మిల్లు
హెడ్ క్లార్కుగూడా అక్కడే వుండాలి. ఇంతమంది
చాలదూ?

నంబి : ఓ! భేషుగ్గావుంటుంది.

కృష్ణ : ఈనాడు టీపార్టీలో - మనతిండి తిని - రేపు వీళ్ళు
మనల్ని ఎలా నిందిస్తారో నేను చూస్తాను. వీళ్ళ నాహ్వా

నిస్తూ ఉత్తరాలు పంపవలసిందని హెడ్‌క్లార్కుతో చెప్తాను.

నంబి : (ఏదో చెప్పబోయి నీళ్ళునములుతాడు.)

కృష్ణ : చెప్పదలచుకున్న దేదో తొందరగా చెప్పు. నాకు ఆఫీసుకు టైమైంది. ఈ పార్టీ అంతా నీవే నడపాలి.

నంబి : అదిసరే. వీళ్ళువస్తే పూరికేవుండరు. ఇంట్లో నాలుగు మూలలూ చూస్తారు. ఆ కుముదినికోసం మనం యీ నాడే తీసుకొన్న చీరా - బ్లౌసు- మొదలైనవన్నీ అలానే ఉన్నాయి. ఈరోజు - ఆవిడకు పంపలేదు. వాటినన్నిటినీ ఎక్కడైనా దాచడం మంచిది.

కృష్ణ : నిజమే. ఆ దరిద్రులు...... ఇల్లునాలుగుమూలలూ వెతుకుతారు. ఆ సామానురూములో చేర్చేటప్పుడే రామనాథంకంటబడింది. వాడు చాలా మోసగాడు. ఆ బెడ్‌రూమ్‌లోవుండే సామానులు మార్చివేయాలి. (పోవడానికి సిద్ధమవుతాడు.)

నంబి : ( తలగోక్కుంటూ ) ఇంకా ఒకరెండుగంటలు టైముంది. ఈ రెండుగంటల్లో - వాళ్ళను వెళ్ళగొట్టాలి. పార్టీకి తయారుచెయ్యాలి.

కృష్ణ : అవును.

నంబి : కారుతీసుకొనిపోతే బాగుంటుందా అని అనుకుంటున్నాను.

కృష్ణ : తీసుకుపో, కాని, పనులు జాగ్రత్తగా నెరవేర్చాలి. ఏమీ అవకతవకలుండరాదు.

నంబి : అవన్నీ మనకు వదలండి. (కృష్ణమీనాన్ వెళ్ళి పోతాడు.

నంబి : (కొంచెంసేపు ఆలోచించి) శంకరపిళ్లా!

శంకర : (శంకర పిళ్ళ ప్రవేశిస్తాడు.) ఏమిటోయ్ పిలిచావు?

నంబి : కారు తీసుకొనిరావోయ్! యజమాని చెప్పాడు.

శంకర : బలేచెప్పాడు! కారుకు బ్యాటరీ ఫీజయిపోయింది. చస్తున్నాను. నీవూ – నీ యజమాని బాగానేవున్నారు. వానిగతి ఏమౌతుందో చూడు, పుండుపుట్టి చస్తాడు.

నంబి : అంతేకాదోయ్. కుక్కమాదిరి, దిక్కులేనిచావు చస్తాడు. వాడుచచ్చేది – సామాన్యమైనచావు గాదు.

శంకర : ఎన్నిసార్లో – నేనే ఆ పిల్లని ఈ కార్లోనే తీసుకుని వచ్చి – ఈ మోసగాని కర్పించాను.

నంబి : త్రోవలో నీ వేమీ చేయలేదన్నమాట.

శంకర : నోర్ముయ్! అనుభవించదలచుకుంటే – త్రోవలో అనుభవించేంతఖర్మ నాకేం పట్టిందీ!

నంబి : సరేలేవోయ్ ఇప్పటికథ చూడు.

శంకర : ఇప్పటిపనేమిటి? వాళ్ళని యింట్లోనించీ వెళ్ళగొట్ట డానికి ప్రయాణమవుతున్నా వన్నమాట. ఈ మహా కార్యానికి—నేను కారు నడపాలా? నా కిష్టంలేదు. కావలసిఉంటే–పోయి చెప్పకో పో!

నంబి : శంకరపిళ్లా!

శంకర : నీదేమిటోయ్ నడుమ! వానికిష్టంలేదని పోయి చెప్పు. ఈ నౌకరీ పోతే, నే నేమీ బిచ్చమడుక్కోనులే. ఎలాగో బతుకుతాను. (ఒకస్టూలుపైన కూర్చుంటాడు.)

నంబి : (శంకరప్పిళ్ళనుచూచి తలఆడిస్తూ) అలావుండాలి మగవాడంటే. అయితే-ఒకసంగతి చెబుతాను. మగవాని మాదిరే ప్రవర్తిస్తావన్న మాట.

శంకర : (నంబియారువైపు చూచి) అయితే చూచుకో! నీ వన్నమాట జ్ఞాపకముంచుకోవాలి. నా విషయం ఎలాంటిదో నీకే రుజువుచేస్తాను. చెప్పు! ఏంచేయమంటావు? ఇద్దరం నౌకరీవదలిపెట్టి పోదామంటావా?

నంబి : అలా ఎందుకంటాను! వీనిఅన్నమే మనం తినాలి. వీనినే చక్కబరచాలి. దానికి పూనుకుంటావా- అని.

శంకర : ఏమైనా మార్గంవుందా ఏమిటి?

నంబి : బుద్ధివుంటే మార్గం లేకుండాపోతుందా!

శంకర : బుద్ధికీ-నాకూ - ఏమాత్రం సంబంధంలేదు. బుద్ధి వుంటే నేనే యజమానినయేవాణ్ని గదూ! ఆ కుక్కే నా డ్రైవరయ్యేవాడు.

నంబి : అది సరే.

శంకర : అయితే-ఉపాయమేమిటో చెప్పు.

నంబి : నీ విప్పుడే కారుతీసుకురావాలి.

శంకర : కారు తెచ్చి?

నంబి : ఆవిడని-తల్లినిగాదు-బిడ్డని-చక్కగా అలంకరించాలి. చీరా-బ్లౌజూ ఇప్పుడే నేను తెస్తాను.

శంకర : నీయిల్లుకూలిపోనూ! చీరకట్టించడం నా కెల్లాగొస్తుందోయ్!

నంబి : ఛీ! గాడిదా! నిన్నెవరుకట్టించమన్నారు? ఆవిడకి తెలుసులే-చీరకట్టుకోవడం. కట్టుకొమ్మని చెప్పాలి.

శంకర : చెప్పాను. తర్వాత...

నంబి : చూడడానికి మంచి సీతాకోక చిలుకలా వుండాలి.

శంకర : ఎవరు చూడడానికి?-నీవా!...

నంబి : నీకే...గాడిదా! నీకూ నాకూ కాదు, మూడోవానికి.

శంకర : యజమానికన్నమాట. ఛీ! ఛీ! ఏ ఆడకుక్కగూడా వానికంటికి సీతాకోకచిలుకలా అగుపిస్తుంది.

నంబి : ఆ విషయ మలావుంచు. ఆవిడ చూడడానికి-భేషుగ్గా వుండాలి. తెలిసిందా!...

శంకర : ఓహో, జోరుచేశావే సంభాషణ! తర్వాత?

నంబి : దానితల్లినిగూడా బాగా అలంకారంచెసుకోమని చెప్పు. ఆవిడనిచూస్తే యేదో ఒక పెద్దింటిఆవిడ వున్నట్లుగా వుండాలి.

శంకర : ఆ, శంకరప్పిళ్ళ అన్నీ చేశాడు,...తర్వాత?...

నంబి : ఆ యిద్దరికీ బాగా బోధించాలి.

శంకర : ఏమని?

నంబి : మాటల్లోగాని-వేషంలోగాని-కూలివాళ్ళవలె వుండ గూడదు అని.

శంకర : ఇంకెలావుండమంటావ్?

నంబి : అదీ నేనే చెప్పాలా ఏమిటి? మంచి - భాగ్యవంతుల యింటి ఆడవాళ్ళు ప్రవర్తించినట్లు ప్రవర్తించాలి.

శంకర : సరే. అదీ చేశానయ్యా, తర్వాత?

నంబి : తరవాతేముంది తిరగవాత! సాయంకాలం నాలుగు గంటలకి సరిగా-వాళ్ళను కారులో తీసుకునివచ్చి-యిక్కడ దింపెయ్యాలి.

శంకర : ఆపై నేమవుతుంది చెప్పు.
నంబి : ఆపైకథ అంతా నాకు విడిచిపెట్టవోయ్.
శంకర : వాళ్ళని మెడబట్టి బయటికి నెట్టేస్తారు. తిరిగిపొయ్యే వేళకు-వాళ్ళకి తిరిగి కొంపగూడా లేకుండాచేస్తారుగదూ!
నంబి : (శంకరప్పిళ్ళవీపుతట్టి) ఆపనిచెయ్యడానికి నే నెందు కిందులో ప్రవేశించాలి? కథంతా మార్చేస్తాను. చూచుకో, నా తడాఖా!
శంకర : (నవ్వుతూ) బలేవాడివోయ్.
నంబి : నేను చెప్పినట్లుచేయి.
శంకర : నీవుచెప్పినంతపనీ అక్షరాలా చేస్తాను. నీవు - తీరా కార్యంసాధించక - వాళ్ళకేమైనా కష్టాలుతెచ్చావంటే - పీకనులిమేస్తాను జాగ్రత్త!
నంబి : నా కంతా తెలుసులే. నీవు ముందు నడు.
శంకర : ఇదో, పోతున్నాను. నా భాగం నేను నెరవేరుస్తాను. ఈ నౌకరీ పోతే-నా పీకేపోయింది.
నంబి : (నవ్వుతూ) నౌకరీ యెందుకుపోతుంది? భయపడకు; జీతంకూడా వస్తుంది. నీవు వాళ్ళను తీసుకుని - నాలుగు న్నర కిక్కడికి రావాలి. అంతే.
శంకర : ఇదిగో, పోతున్నాను.
నంబి : ధైర్యంగావుండవోయ్.(నంబియా రింట్లోకి పోతాడు.)
శంకర : (తనలోతాను ఆలోచించుకుంటూ)అ దలాఅయితే ఇ దిలా అవుతుంది.
నంబి : (సంచితీసుకొని వస్తాడు) ఇదిగో, ఈ సంచి తీసుకొనిపో!

శంకర : ఆ! సరిసరి! ఇందుకేనోయ్ బుద్ధికావాలంటారు. అదే మన కొంచెం తక్కువ. (సంచితీసుకొని వెళ్ళి పోతాడు)

నంబి : (ఒకకుర్చీలో కూర్చొని- కాగితంమీద ఏమో రాసి, దాన్ని మడిచి) కృష్ణా, కృష్ణా.

[కృష్ణన్ పదునైదేండ్ల వయసువాడు. ఆ యింటి సేవకుడు]

నంబి : ఈజాబుతీసుకు వెళ్ళి- వెంకుఅయ్యర్ రెస్టారెంటులో యివ్వు. ఒకపార్టీకి కావలసిన సరంజామా తీసికొని రమ్మను.

కృష్ణ : టీపార్టీకన్నమాట.

నంబి : అదే.

కృష్ణ : టీ ఇంట్లో చేసుకోగూడదేమండీ, కావలసినన్ని పాలున్నవి.

నంబి : అవి రాత్రికి కావద్దేమిరా. మన యజమాని అమ్మగారు వచ్చారుగదా;.........భార్యగారుగూడా వస్తారేమో!

కృష్ణ : (ఆశ్చర్యంతో) భార్యగారేమిటి?

నంబి : వెర్రిమొగమా, భార్యగారంటే భార్యగారే. యజమానిభార్యగారన్నమాట.

కృష్ణ : (ఉలికిపడి) అయితే, యజమానికి పెండ్లయిందన్నమాట?

నంబి : ఆహా, ఎప్పుడో అయింది. నీతోనూ - నాతోనూ చెప్పి సంబంధాలు చేసుకుంటారా యేమిటి? పో, తొందరగా పో! అయిదుగంటలకు టీపార్టీ. ప్రత్యేకంగా చెప్పు.

కృష్ణ : (ఉక్కిరి బిక్కిరవుతూ) నాకు తెలీని భార్యగారెవ రండీ? (స్వగతం: నిజమేనేమో, లేకుంటే ఈ ప్రొద్దుటే పార్టీ యెందుకు?) (వెళ్ళిపోయి, వెంటనే తిరిగివస్తాడు) యజమానిగారి అమ్మ వచ్చారు.

నంబి : వస్తే నీకేమిటి? ఆమెవిషయం చూడడానికి నేను లేనూ? తొందరగా పో! (కృష్ణన్ పరిగెత్తుతాడు)

[అమ్మ ప్రవేశిస్తుంది. 50సం॥లు వుంటాయి. గొప్ప ధనవంతురాలి కుండవలసిన లక్షణాలన్నీ వున్నాయి. నంబియారు లేచి నిలుచుంటాడు.]

అమ్మ : సుఖంగా వున్నారా ఏమిటి?

[నంబియారు కుర్చీ ముందుకు జరుపుతాడు. ఆమె అందులో కూర్చుంటుంది]

నంబి : ఏదో యిలావున్నాము.

అమ్మ : పిల్లలు బాగున్నారా?

నంబి : ఎలా బాగుంటారు! నడుమ నడుమ ఏవో రోగాలూ, అవీనూ......వీనినడుమ ఏదో సుఖం.

అమ్మ : బిడ్డలువుడితే యింతే. వాళ్ళకి ఎప్పుడూ ఏదో ఒకటి వస్తూనే వుంటుంది. పిల్లలు కలిగారంటే-ఇక తల్లిదండ్రులకి సుఖపడేదినాలు గతించినట్టే. వీడేడీ! ఆఫీసునుంచి రాలేదూ?

నంబి : ఇంకా రాలేదు. ఆయన పోయి ఒక అర్థగంట మాత్రమే అయింది.

అమ్మ : అయితే, మరి వన్నెందుకు – చుక్క తెగిపడినట్లుగా రావాలని వర్తమానంపంపాడు. నేనా వార్త విని-వీనికేమైనా జబ్బుగిబ్బు చేసిందేమోననుకున్నాను.

నంబి : ఏజబ్బూ లేదు.

అమ్మ : ఏమీ లేకున్నా వాడంతే. ఎప్పుడూ "అమ్మ - అమ్మ" అంటూ వుంటాడు.

నంబి : (మనస్సులో-సాకూతంగా) ఇంకే బంధువులూ లేనివాళ్ళకి ఎప్పుడూ అమ్మమీదిచింతే గదా!!

అమ్మ : ఇంక నాకేం కావాలి. వాడు సుఖంగా వుంటే చాలు. ఏదో ఒకస్థలంలో వివాహం చేసుకుంటే నా కళ్ళు చల్లబడతాయి. నేను బ్రదికివుండగానే వాడొకయింటి వాడైతే ఎంతో సంతోషిస్తాను. బిడ్డయినా కొడుకైనా నాకు వాడే. నాక్కావలసింది వానిసుఖమే. ఎన్నిసార్లో చెప్పిచూచాను. ఎంతో నిర్బంధించాను.

నంబి : (తలగోక్కుంటూ) నిర్బంధిస్తే మాత్రమేమి? చిన్నవాళ్ళకి యిష్టమున్న సంబంధం - పెద్దవాళ్ళకిగూడా యిష్టముండాలిగా.

అమ్మ : నా కిష్టంలేదని ఎవరు చెప్పారు? పిల్ల ఎక్కడుంది? వాడేరోజు చేసుకుంటానన్నా నాకు సమ్మతమే. ఈవిషయంలో నాదంటూ ఏ అభిప్రాయమూ లేదు.

నంబి : మీరిలా అంటారు, కాని, ఆయనకు మీరు సమ్మతిస్తారో లేదో ననేదే భయం ఎప్పుడూ - ఆయనదగ్గరే ఉండేవానికి - నాకాయన అభిప్రాయాలు తెలియక పోతాయా?

అమ్మ : నేనూ అలాగే అనుకుంటూవున్నాను. చిన్నప్పుడు కూడా వానికి నన్ను చూస్తే యెంతో భయం అలా అదుపాజ్ఞలలో పెట్టి పెంచాను. వానిమేనమామగాని - తండ్రి

గాని-పిల్లవాణ్ని ఎక్కువ మురిపెంచేస్తే నేను సహించే దానినికాను. ఆ భయం వానికింకా వదల్లేదు.

నంబి : అదే అదే. ఆ భయ మింకా ఉంది. అందువల్ల ఒక్కవిషయమూ బయటికి చెప్పడు. ఎప్పుడూ మనసులో వుంచుకొని, కుళ్ళుతూవుంటాడు. తిండిలేదు, నిద్రాలేదు.

అమ్మ : అందుకే వాడీనడుమ చిక్కిపోయినాడు. మీరైనా ఒక్కసారి చెప్పలేదూ సరిగావుండమని.

నంబి : నే నేమో చెప్పాను. కాని - ఏవిషయమైనా నాతో చెబితేనా? నే నేమైనా చెప్పడానికో - చేయడానికో.

అమ్మ : అయితే-ఇప్పటికూడా మీ కేమీ తెలియదన్న మాట?

నంబి : ఇప్పుడే కొంచెం తెలిసింది. కాని -

అమ్మ : ఏమిటి? ఏమిటంటున్నారు?

నంబి : (అవశతనటించి) నేను నిజంచెప్పితే ఎవరు నమ్మ తారు? అది నా దౌర్భాగ్యం.

అమ్మ : (సోత్కంఠంగా) తెలిసినవిషయం నాతో చెప్ప రాదూ, ఏ పిల్లయినా నా కేమీ పరవాలేదు. వాడు సుఖంగావుండాలి, నా అభిప్రాయం అంతే.

నంబి : తెలిసినవిషయం చెప్పితేకూడా తప్పుగా వుంటుం దమ్మా! ఇంతకూ-చెప్పేపరిస్థితి దాటిపోయింది. (రెండు చేతులూ నెత్తిపైనపెట్టుకుని కూర్చుంటాడు) నా గ్రహ చారం ఇలావుంది.

అమ్మ : (ఏదో సందేహిస్తూ) నంబియారూ! ఏదో ఆ విశేషం చెప్పుదూ! ఎటువంటి విషయమైనాసరే చెప్పి

వేయి. నా హృదయం ఎలా దహించుకుపోతూవుందో చూడు.

నంబి : ఇంతకుముందే నాతో చెప్పిపోయాడు. మీతో చెప్పవలసిందని ఒక వెయ్యివిషయాలు చెప్పాడు. మీ యెదురుగా నిలిచి చెప్పేధైర్యం తనకు లేదు. పాపం! "నన్ను తిట్టవద్దని అమ్మతో చెప్పు" అని అన్నాడు. ఈమాట ఒక నూరు సార్లైనా అనివుంటాడు.

అమ్మ : ఎవ రా అమ్మాయి? చెప్పండి. ఏమీ...

నంబి : అమ్మాయి చాలా అందకత్తె. బిసులాంటిది. ఏమి నడక, ఏమిగుణం! దానికి తగినట్లు వాళ్ళకు కొంత డబ్బు వుంటే యెంతో బాగుండేది. ఇప్పుడు నలుగురికీ తెలిసి పోయింది. ఈశ్వరా, ఆ సంబంధం ఎలా కలిగిపోయిందో నాతోనైనా ఒక్క అక్షరం చెప్పాడా? ఇప్పుడు- అంతా గడచిపోయిన వెనుక-అమ్మతో చెప్పి ఒప్పించవలసిందని నాతో అంటాడు. ఈ దౌర్భాగ్యం నాకుపట్టింది.

అమ్మ : (ముఖం నల్లగాచేసికొని) అయితే, మన చెయ్యి దాటి పోయిందన్నమాట. ఎన్ని నెల్లయింది ?

నంబి : (భయపడినట్లు దిగాలుగా) రెండు నెలలో మూడు నెలలో అయివుంటుందనుకుంటాను. పిల్ల చాలా అం దంగావుందని యింతకుముందే చెప్పానుకదూ. అయినా వాళ్ళయింటిసంగతికూడా విచారించవద్దా?

అమ్మ : ఊఁ......ఇంటిసంగతి ఒకటి! అదివుండేవాళ్ళిలా చేస్తారా !

నంబి : చూడడానికి మంచి యింటితనం కలవారివలెనే వున్నారు, కాని-యిలా ఎందుకుచేశారా అనిపిస్తోంది. అయినా-యిలాంటివిషయాలు లోకంలో ఎవరింట్లో జరగడంలేదు?

అమ్మ : నన్నొక్కటీ అడగవద్దండి. మీ యిష్టంవచ్చినటు చేసుకోండి.

నంబి : అయ్యో, అమ్మా! ఇలా కొడుకుపైన కోపంచేసుకుంటే ఎలాగు? అయితే-నేను చెప్పినదానికి ఫలమేమి కలిగినట్లు? నన్ను యజమాని-ప్రాధేయపడినదానికి ఫలమేమికలిగినట్లు? యజమానికి యెవరున్నారుగనుక! అందరు బంధువులూ నీవే.

అమ్మ : వానివిషయంలో నాకేమిసంబంధముంది గనుక... ఓ...ఎంత కష్టపడి వీణ్ణి పెంచాను.

నంబి : రత్నంలాంటి పిల్లవాడు వేరే మగవాడైతే - తాను చేసినపని గడ్డకు చెప్పుతాడా? ఏదో కొంచెం పిరికివాడైనా మీ కుమారుడు చాలా మంచివాడు. అతు రాలా తండ్రిలాంటివాడు.

అమ్మ : (ముఖం అభిమానంతో పరిపుల్లమవుతుంది.) అవు నవును. నా జీవితంలో - మంచికొడుకును కన్నది అనే ఒక్కమాట మాత్రమే మిగిలింది. అతురాలా తండ్రిని పోలినాడు. చిన్నప్పుడు ఎంత మొండివాడనుకున్నావు!

నంబి : మీ రన్నమాట నిజం. ఇన్నిరోజులూ యీరహస్యం మనస్సులోపెట్టుకొని - అన్నమూ నిద్రా లేక ఒకటే-బాధ పడుతూఉన్నాడు. "ఈపనిచేసింది నేనుకాదు" అని ఒక్క-

సారి చెప్పమను. "అలా చెప్పితే ఏ కష్టం వుండదు" అని ఎంతో చెప్పాను. అలా ఎన్నటికి కాదన్నాడు.

అమ్మ : ఛీ ఛీ! అదేంమాట. మనము అలాచేయరాదు. వాడు అబద్ధాలు చెబితే-ఇక నా కడుపున వాడేమిపుట్టి నట్లు?

నంబి : అలా అనకండి. నా యెదుట ఎలా హుంకరించాడను కున్నారు! ఇదంతా వదలిపెట్టి-నేను-ఏఆశ్రమానికో వెళ్ళి బ్రతుకుతానని - పులిలా గర్జించాడు.

అమ్మ : నాపుణ్యాన ఆ పని చేయలేదు. మంచిదయింది. (గడ్డం క్రింద చెయ్యిపెట్టుకొని దీనంగా) ఈ వర్తమానం యీపాటి కందరికీ తెలిసివుంటుందిగదూ?

నంబి : అయ్యయ్యో! నేను బతికివుండి-ఎవ్వరికన్నా తెలియ నిస్తానా! ఇంతకుముం దీవిషయం తెలిసిం దిద్దరికే. ఇప్పుడు-మూడోది నువ్వు.

అమ్మ : జరిగిందేమో జరిగింది ఇప్పు డేంచేయాలి?

నంబి : అమ్మాయిని యింటికి పిలిపించుకు నేది - యజమాని కా-వలసిన నలుగురుస్నేహితుల్ని యింటి కాహ్వానించి-ఒక టీపార్టీ యిచ్చేస్తే కథ ముగిసిపోతుంది.

అమ్మ : వాళ్ళకి నే నేం చెప్పాలంటావు?

నంబి : చెప్పవలసిందేముంది?-అమ్మ - కోడలిని పిలుచుకొని వచ్చింది అని మాత్రమే చెప్పవలసింది. యజమాని కిప్పుడు-తల్లియైనా-తండ్రియైనా - మామఅయినా అమ్మ ఒకతేగదా! మన యజమానియే వాళ్ళయింటికి పోయి - నాలుగురోజులుండి - పిలుచుకునిరావాలి. అంటే - తీరిక

యొక్కడుందిగనుక! మిల్లులోనా - రాత్రీ పగలూం పని. ఏపనిపెట్టుకున్నా అంతే మరి. పోతే - ఇక యెప్పుడూ యింటికి వచ్చిపోయే పోలీసులూ - ఇన్స్పెక్టర్లు - మేజస్ట్రీటులు-దేశనాయకులూ-వకీళ్ళూ మొదలైన స్నేహితులు· అన్నంతినడానికిగూడా తీరికవుండదు. నిద్రపోవడానికి సమయంవుండదు. పని యిలావుంటే-ఒక్కరోజు - ఆయనకు బయటికివెళ్ళడానికి సాధ్యమవుతుందా! అందుకోసం- అమ్మాయే పోయి పిలుచుకొనివచ్చింది.

అమ్మ : (ఆలోచిస్తూ) యీ మాటలు నన్ను చెప్పమంటావు. ఇంతకుముందు–ముక్కూ–మొగం యెఱుగనిపిల్లను గురించి–నేనే పిలుచుకొనివచ్చానని ఎలా చెప్పేది! వాడే సంబంధంకుదుర్చుకున్నాడుగనక - వాడే యేమైనా చేసుకోనీ.

నంబి : (స్వరభేదంతో) ఇలాంటి కొన్నిమాటలు చెప్పకపోతే యేపనీ సాగదు. ఈమాటలు మీరుగాక ఎవ్వరు చెప్పాలి? ఇంట్లోవుండే ఎవడో ఒక అనామధేయుడు చెబితే సరిపోతుందా! సమయంవచ్చినప్పుడు- మీవంటివారు కొంచెం ధైర్యంవహించాలి.

అమ్మ : (ఏదో ఆలోచిస్తూవుంటుంది.)

నంబి : మీ రలా ఏమీ సందేహంపెట్టుకోవద్దండి. ఐదుగంటలకు అతిధులంతా వస్తారు - దాని కొంచెంముందుగానే అమ్మాయి వస్తుంది.

అమ్మ : ఇంతకూ - ఆవిడ పేరేమిటి?

నంబి : "సుశీల" అంటారు. గుణానికి తగినపేరు.

అమ్మ : ఒక సుశీలను - కోడలిని చేసుకుందామనుకున్నాను. ఆవిడస్థానంలో - మరో సుశీల వచ్చింది. ఇంతకూ అంతా ప్రాప్తానుసారం జరుగుతుంది.

[బయట హారన్‌శబ్దం వినపడుతుంది.]

నంబి : (గడియారంలోకి చూచి) గంట - నాలుగూ నలభై అయిదునిముషా లయ్యింది. ఇదిగో! అమ్మాయి వచ్చేసింది. యజమాని కారుయిచ్చి పంపేటప్పుడు - సరిగ్గా నాలుగూనలభైయైదునిముషాల కిక్కడుండాలని యజమాని చెప్పివుండినాడు. చూడండి! అమ్మాయి "నెమలి లాగ" ఎలా బాగుందో!

అమ్మ : (ఇంటిముందుకు చూపులు సారిస్తూ) మీరు చెప్పారుగదా బాగుందని-ఇక ఆక్షేపణేముంది?

[తల్లీ బిడ్డా బాగా శృంగారించుకొన్నవేషాలతో ప్రవేశిస్తారు.]

నంబి : (అమ్మాయివైపు చూస్తూ) అదిగో! ఆమె మీ అత్తగారు. నమస్కారం చెయ్యండి.

సుశీల : అత్తగారికి నమస్కారం.

నంబి : (సుశీలతల్లికి కూర్చుండడానికి కుర్చీచూపిస్తూ మృదువైనస్వరంతో) ఇలా కూర్చోండి.

తల్లి : (కూర్చుంటుంది)

నంబి : కృష్ణా! కృష్ణా! (కృష్ణన్ వస్తాడు.) ఒరే! అమ్మగారు లేచి ఎంతసేపైందనుకున్నావు.

అమ్మ : (లేచి) మేము యింట్లోపలికి పోతాము. అమ్మాయి కూడా అలసివుంటుంది. (అమ్మాయి చెయ్యి పట్టుకొని ముందు నడుస్తుంది.)

నంబి : (సుశీలతల్లివైపు చూచి) వెంట నీవుకూడా పో! నోరు తెరచి-అబద్ధం ఒక్కటిగూడా చెప్పకు. ఇంక సుశీల నీ కూతురుగాదు. వాళ్ళయింటిబిడ్డ. తెలిసిందా!

తల్లి : తెలిసింది. మీ మంచితనంతో బతికాము. (తల్లికూడా లోపలికి పోతుంది)

[శంకరపిళ్ళె ప్రవేశిస్తాడు.]

నంబి : బాగా పాఠం చెప్పించావన్నమాట.

శంకర : ఓ! చిలుకలాగా మనం చెప్పినపాఠం పల్లిస్తుంది.

నంబి : అయితే, ఏం చెప్పించావు పాఠం?

శంకర : ఒక్కటే ఒక్కపాఠం చెప్పించాను. ఎవ్వరడిగినా- ఏమడిగినా - "ఆమాట నేను చెప్పలేదు" అనమని చెప్పించాను.

నంబి : భేష్! సరియైనట్యూషన్. (బయట హారన్ వినపడుతుంది.)

శంకర : ఎవరో వచ్చారు.

నంబి : (ఇంటిముందుకుచూచి) ఎవరున్నారు? ఆ రామనాథం గారూ - మేజస్ట్రీటూ. ఐదుగంటలకి రమ్మన్నాము. నాలుగూనలభైఅయిదుకే వచ్చారు వెధవలు. (బిగ్గరగా) రండి! రండి!

[రామనాథం, మేజస్ట్రీటు - ఉచితవేషాలతో ప్రవేశిస్తారు, శంకర పిళ్ళ వెళ్ళిపోతాడు.]

రామనాథం : ఓ, మిష్టర్ నంబియార్! యజమాని రాలేదూ

[లోపలికి తొంగిచూస్తాడు.]

నంబి : ఓ లోపలెవ్వరూ లేరు.

రామ : (సోత్కంఠంగా) అయితే ఎవరో...

మేజ : ఎవరున్నారు లోపల?...

నంబి : యజమానిగారిఅమ్మ వచ్చింది.

రామ : మరి నన్నెందుకు లోపలికి పోవద్దంటావు? అమ్మ నాకు క్రొత్తాయేమిటి?

మేజ : నాకుమాత్రం తెలియదా యేమిటి?

నంబి : అమ్మ ఒక్కతే కాదు. (శృంగారంగా చేతులు తిప్పుతూ) ఇంకా కొందరు.

మేజ : ఎవరోయ్! నీ వెందు కిలా ఆడవేషం అభినయిస్తున్నావు?

రామ : ఓ! అర్థమయ్యిందిలే! (మేజస్ట్రీటునుచూస్తూ) నేను చెప్పలేదూ! ఆ చీరా - ఆ బ్లౌసూ - (నంబియారుతో) అమ్మకంటపడిందా-లేదోయ్! నేనే చెప్పుదునా!

నంబి : మీరేమీ చెప్పవలసినపని లేదు. అమ్మగారే పిల్లను తీసుకునివచ్చారు.

మేజ : ఎందుకు?

నంబి : ఎందుకు? అందుకే.

[రామనాథమూ, మేజస్ట్రీటూ నవ్వుతారు.]

మేజ : అయితే-అమ్మ కుమారునికి సప్లయిచేయడానికి...

నంబి : అలా కాదు. ఇది శాశ్వతమైనసంబంధం.

రామ : శాశ్వతమా?

మేజ : శాశ్వతమా?

నంబి : అవునవును. అమ్మ-యజమానికి నాలుగైదుజాబులు

రాసింది వచ్చిపొమ్మని. తీరికలేదని రాశాడు కొడుకు. కడకు–ఆమే కోడలిని పిలుచుకొనివచ్చింది.

మేజ : బాగానే జరిగింది.

రామ : ఆమెకు మనస్సువుంది.

మేజ : (నంబియారుతో) అయితే యిప్పుడు యజమాని కా సంబంధం గిట్టకుంటేనో...

నంబి : అమ్మ కామాత్రం తెలియదా యేమి? గిట్టుతుందనే ఆమె యీ పనిచేసింది.

రామ : ఓ మిస్టర్ మేజస్ట్రిట్! అదింకా ప్రారంభించలేదన్న మాట?

మేజ : ఏది?

రామ : ఆ పిల్లపైన–యజమానికి అయిష్టం కలగలేదన్న మాట?

మేజ : ఎందువల్ల కలగలేదు?

రామ : అదే నాకూ ఆశ్చర్యం. వాడు చేపట్టనిఅమ్మాయి లేదు. చేపట్టివదలని అమ్మాయికూడా లేదు.

నంబి : ఓహో! (రామనాథమునుచూస్తూ) అయితే, మీరు పట్టినదాన్ని వదలని ధర్మప్రభువులన్నమాట!

మేజ : బాగా అన్నావు. అందరిఅభిరుచులూ నీకు తెలుసు. అవునుగదూ?

రామ : ఆ వచ్చినమోహినిని ఒకసారి నేను చూస్తే బాగుండును.

[కృష్ణన్ ప్రవేశించి నంబియారుతో]

కృష్ణన్ : రెస్టారెంటునుండి అయ్యర్ వచ్చినాడు.
నంబి : ఇప్పుడే వస్తాను. (ఇద్దరూ పోతారు.)
మేజ : ఆ మోహిని ఎవరైయుండునో !
రామ : అదా ! నేను చెప్తాతా విను. వట్టి దరిద్రురాలు. చూడ్డానికి నల్లకాకిలా వుంటుంది. పేరుమాత్రం సుశీల
మేజ : అయితే నీవు చూచినావన్నమాట.
రామ : నేను చూడనిదంటూ బాకీఒకటుందావేమి ?
మేజ : అరె, ఉట్టి గప్పాలుకొట్టవద్దు.
రామ : నా కంతా తెలుసునయ్యా! ఆ పిల్ల కృష్ణమీనన్ తండ్రికి మేనగోడలు. కావలిస్తే ఎవరినైనా అడిగి తెలుసుకో.
మేజ : ఎవరూ - ఆ నారాయణ మీనను కా!
రామ : ఆ, అదే. కొన్నాళ్ళ క్రితంనుండీ ఆ తల్లి కొడుక్కి వల వేస్తూవుంది. ఈ కొడుకు ఇదంతా తెలిసీ తెలియనట్టున్నాడు.
మేజ : ఓ, అలాగా!
రామ : అలా కాకపోతే, డబ్బులో వుందయ్యా అంతా, డబ్బులో !
మేజ : ఒక వేళ వాడు ఒప్పుకోకపోతేనో ?
రామ : నేను చెప్పలేదా. డబ్బుతో పని అని. మనస్నేహితునికి యిప్పుడు పదహారు వేల రూపాయలు కావాలి. 'జూబిలీ' రెండు రోజుల్లోనే వుంది. అందుకే అతగాడమ్మకు వ్రాశాడు "మిల్లువ్యవహారమంతా తలక్రిందైంది. కూలీలంతా స్ట్రైక్ చేస్తున్నారు. డబ్బుకావాలి" అని.

మేజ : ఆమెదగ్గర డబ్బుందా అని?

రామ : ఆహా, వుంది. జడ్జి నారాయణ మీనన్‌దే ఆ డబ్బంతా. కాపే రెండులక్షలుంది. ముక్కాలులక్షన్నా కోడలికిస్తుంది.

మేజ : ఓహో! అందుకే కొడుకీ కార్యాన్ని కొప్పుకున్నాడు.

రామ : ఇక్కడి వ్యవహారమంతా తల్లికి తెలిసింది. అతణ్ణి మంచిమార్గంలోకి తీసుకురావాలనుకుంది.

మేజ : ఓహో! ఐసీ!!

రామ : అందువల్ల కొడుక్కు డబ్బుకావాలీ అంటే తల్లి తెచ్చిన పిల్లనే కొడుకు ఒప్పుకోవాలి. కాబట్టి ఆమె ధైర్యంగా యీపిల్లను పిలుచుకొనివచ్చింది.

మేజ : ఓ! ఆ తల్లి ఎంతగడుసుదీ!

[కృష్ణమీనన్, డాక్టరు, ఇన్‌స్పెక్టరూ వస్తారు]

రామ : హలో మిస్టర్ మీనన్! స్వాగతం. డాక్టర్‌గారూ, రండి, రండి. ఇన్‌స్పెక్టర్ రండి!

[అందరూ వచ్చి కూర్చుంటారు]

డాక్టరు : (రామనాథంతో) యజమానివి నీవేనా ఏమి?

ఇన్‌స్పెక్టర్ : ఎక్కడైనా విందుభోజనమూ అని చెవిలో పడితే చాలు. మనవాడు నిన్ననే అక్కడ హాజరై వుంటాడు.

రామ : భోజనమా? అల్పాహారమా? ఆ, ఏదో మంచివాసన వెయ్యటంలేదూ!

ఇన్ : అదేనా! మీనన్! గొప్ప విందుభోజనమేనా?

కృష్ణమీ : ఓ, చాలా గొప్పది.

మేజ : ఇప్పుడుగాకపోతే మరెప్పుడు?

డాక్టర్ : అదేమి! ఇప్పుడు విశేషమేమి?

మేజ : (రామనాథంను చూస్తూ) ఇప్పుడు మిష్టర్ మీనన్ వివాహం జరుగుతుంది.

కృష్ణమీా : వివాహమా!

రామ : అదేనయ్యా! నీ అదృష్టం. మీా అమ్మ వధువుతో సహా వచ్చింది.

ఇన్స్పె : అమ్మా! మీానన్అమ్మ వచ్చిందా! ఆమెతో నా కంతగా పరిచయంలేదు.

డాక్టర్ : నాకుగూడా లేదు.

మేజ : ఎట్లైనా-కృష్ణమీానన్ తనతల్లినీ-భార్యనూకూడా మన కందరికీ ఇప్పుడు పరిచయంచేస్తాడు.

ఇన్ : అట్లయితే యీా వివాహాని కేదైనా ప్రజంటేషన్ తేవద్దా! మి...మీానన్! ఆహ్వానపత్రికలో యీావిషయం లేనేలేదే?

కృష్ణమీా : ఇన్స్పెక్టర్! (రామనాథాన్ని చురచురచూస్తూ) ఇదంతా ఇతనిఉపాయమే

(అమ్మ ప్రవేశిస్తుంది. అందరూ లేచి గౌరవిస్తారు.)

రామ : విశేషమేమిటి?

అమ్మ : నేను నాలుగుజాబులు వ్రాస్తిని. తీరుబడిలేదు, తీరుబడిలేదు-అని జవాబు. కడకు నీవే ఒకసారి వచ్చిపొమ్మని వ్రాశాడు. వివాహంచేయవలెనని చాలాకాలంగా అనుకుంటిని. కడకు నేనే ఆ పిల్లను పిలుచుకొనివచ్చినాను.

కృష్ణమీా : ఎవ రా పిల్ల?

అమ్మ : నీకు నచ్చినపిల్ల నే.
డాక్టర్ : భేష్! చాలా మంచిది.
ఇన్ : భేష్! చాలా మంచిది.
నంబి : (ప్రవేశించి) లోపల అంతా సిద్ధంగావుంది.
అమ్మ : అయితే రండి. అందరూ లోపలికి రండి.

[నంబియార్ తప్ప తక్కినవారంతా లోపలికి పోతారు. శంకరప్పిళ్ళ ప్రవేశిస్తాడు. చేతిలో ఒక పాకెట్టువుంది.]

నంబి : ఇదేనా పెండ్లిప్రజంటేషన్?
శంకర : మాల. ఈ శంకరప్పిళ్ళ తనజీవితంలో యిలాంటి నిర్బంధాన్ని ఎప్పుడూ అనుభవించలేదు. ఇలాంటి డ్రైవింగూ చెయ్యలేదంటే నమ్మ. ఇన్‌స్పెక్టరంటాడే అదేదో 'రెక్‌లెస్ డ్రైవింగ్' అని – అలాంటి దిది.

[కృష్ణమీనన్ ముందుకు వస్తాడు. శంకరపిళ్ళ లోపలికి పోతాడు]

కృష్ణ : (కోపంగా) ఏమిరా నంబియార్! నీవేనా యిదంతా చేసింది? నీ అభిప్రాయమేమిటి?
నంబి : (తెలియనట్లుగా) అమ్మకు ఇక్కడికి రమ్మని నీవేమైనా వ్రాశావా? నాతో ఒక్కమాటైనా చెప్పినావా?
కృష్ణ : నీతో చెప్పియే అమ్మకు వ్రాయవలెనా ఏమి?
నంబి : నాతో యెందుకులే! ఆ క్షణంలోనే రెండూ తటస్థపడవలెనా ?
కృష్ణ : ఏ రెండూ? అంతా మోసం!
నంబి : అమ్మ యిటొస్తూవుండగనే – ఆ రెండుశనులూ అటొచ్చినాయి.
కృష్ణ : వాళ్ళిద్దరినీ అప్పుడే తరిమెయ్యవలసింది?

నంబి హెడ్‌క్లార్కును చూడమనిగదా!

కృష్ణ : నే నక్కడినించేగదా వస్తిని?

నంబి : నేరుగా నిన్నే చూచి చెప్పకుందామని వచ్చిరిగా బోలు! ఒకవేళ సమక్షంలో-తమ దుఃఖం చెప్పకుంటే కార్యం చక్కబడుతుందని ఆ తల్లీ బిడ్డా తలచివుండ వచ్చు. అమ్మ ఎదురుపడింది. ఆమెతో తమ దుఃఖం వెళ్ల బోసుకున్నారు. విషయమంతా తెలుసుకుందామని అమ్మ లోపలికి తీసుకెళ్ళింది.

కృష్ణ : ఇప్పుడు నే నేం చేసేది? అయ్యో! అంతా మోసం!

నంబి : అమ్మ ఎదురుగుండానే - వారి నీడ్చి బయటికి గెంటి వేస్తేసరి.

కృష్ణ : అది వీల్లేదు. తానే పిలుచుకొనివచ్చినానని-అందరి ఎదుట అమ్మ చెప్పివేసింది. ఈ ముసలివాళ్ళ కుండే పెద్ద చాదస్తమే యిది.

నంబి : అయితే ఏం చేస్తాము?

కృష్ణ : నా కిప్పు డందరినీ మెడబట్టి బయటికి గెంటివేయా లనిపిస్తూవుంది. అయ్యో! శుద్ధ మోసం జరిగింది!

నంబి : జూబిలీ కిక రెండే రోజులున్నాయి. డబ్బు! అది అమ్మచేతిలో వుంది.

కృష్ణ : అదే, డబ్బు! పదహారువేలు. ఆ ముసలి దంతా ఒక్కసారే యిచ్చి చావరాదూ!

[లోపలినుండి "మీనన్! మిష్టర్ మీనన్!" అని పిలుపు. శంకరపిళ్ళ ప్రవేశిస్తాడు]

శంకర : లోపల పిలుస్తున్నారు?

కృష్ణ : అంతా నాశనమైపోనీ! (లోపలికి విసుగ్గా పోతాడు)

శంకర: పట్టుకొని గెంటుతాడు. ఊఁ, పట్టుకొని గెంటుతాడు! వీడు బయటికి గెంటివేయడం! ఆ యమ్మ బయటికి పోవడం!

నంబి : బయటికేమిటి! ఆమెను బయటికిగాని లోపలికిగాని– తీసుకువెళ్ళడాని కాతని కధికారముంది, నీకాఁదు.

శంకర : హుం! బాగైంది. ఈ శంకరప్పిళ్ళ బదికివుండంగానే వారిద్దరినీ కారులో వేసి–ఊరంతా తిప్పుతాడు.

నంబి : అదే కావలసింది. నేను కోరేదీ అదే.

శంకర : అట్లే చెయ్యవలె

నంబి : ఆ కారులో దానితల్లినిగూడ కూర్చొనబెట్టవలె.

[లోపలినుండి కరతాళధ్వనులు వినపడుతవి.]

నంబి : (లోపలికిచూస్తూ) ఓ, అయిపోయింది.

శంకర : మగవాడు తాళిగట్టినఆడుదానిని ఏలుకోవలె. అదిగాక – అమాయకులైన ఆడవారిపై గుత్తపుస్వారిచేసేట్టు గాదు.

[డాక్టరు, ఇన్‌స్పెక్టరు, బయటికి వస్తారు. శంకరప్పిళ్ళ లోపలికి పోతాడు.]

డాక్టర్ : ఇన్‌స్పెక్టర్! ఆమె గర్భిణిగా కనపట్టంలేదూ?

ఇన్ : ఆ గర్భమింతనిదిగాగూడ అగుపించలేదు. ముఖంగూడా పాలిపోయి తెల్లబడినట్టుంది. (నంబియారునుచూచి) ఆ, నంబియారూ! చాలా పనితొందరలో వున్నట్టున్నావే! పోయివస్తాము చాల సంతోషమైంది.

నంబి : మాకూ సంతోషమయ్యింది.

[డాక్టరూ, ఇన్‌స్పెక్టరూ వెళ్ళిపోతారు. రామనాధం, మేజస్ట్రేటు వస్తారు.]

మేజ : ఏమిరా! మోసంగాదూ? గొప్ప మోసం. ఇది యింత తకరారువని అని ఇంతవరకూ నాకు తెలీదు. నీ సుశీల పరాధీనమైపోయింది.

రామ : (నవ్వుతూ) వా డదృష్టవంతుడు. పూలగుత్తివంటి పిల్ల. డబ్బూ దక్కింది. (నంబియారునుచూచి) దీనికి సూత్రధారివి నువ్వేనా?—వానితల్లి వేసిన వలా?

నంబి : (ఏమీ ఎరుగనట్టుగా) నాకు బొత్తిగా తెలీదే!

రామ : నిజంగానా?

మేజ : నిజంగానా!...అయితే మేము పోయివస్తాము.

[ఇద్దరూ పోతారు. తరువాత ముందు కృష్ణమీనన్ - వెనుక సుశీల ప్రవేశిస్తారు. నంబియారు లోపలికి పోతాడు.]

సుశీల : (కృష్ణమీనన్‌ను చూస్తూ) అప్పు డొకటికూడా తినలేదే!

[కృష్ణమీనన్ గంభీరంగా వుంటాడు. సుశీల ఒకకుర్చీలో కూర్చుంటుంది.]

సుశీల : అప్పుడు—

కృష్ణమీ : నా చెప్పేశం నీ కనవసరం.

[హెడ్‌క్లార్కు ప్రవేశిస్తాడు.]

హెడ్ : అదంతా నెరవేర్చినాను. ఇంక వా రావైపు తిరిగి రారు.

కృష్ణ : కాదు, అటువైపు తిరిగిరారు.

హెడ్ : (వెనక సుశీలనుచూచి అదరిపడి) ఇదేమి! ఇదేమి?

[సుశీల సగౌరవంగా హెడ్‌క్లార్కును చూస్తుంది.]

హెడ్ : (కృష్ణమీనన్‌ను చూస్తూ) ఆ, అప్పుడట్లు చెప్పి... ఇది యేమి విపరీతంగా వుందే!

కృష్ణ : (గంభీరంగా లేచి) హెడ్‌క్లార్క్! ఇకమీద నా ఆంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకోవద్దు. నిన్నెవరూ ఇక్కడికి రమ్మని పిలువలేదు. కొంత హద్దేర్పరచుకోనడం మంచిది. పోవచ్చును. ఏమైనా ఆఫీసు విషయాలుంటే నే నాఫీసుకువచ్చి చూచుకుంటాను.

[కృష్ణమీనన్ లోపలికి పోతాడు]

సుశీల : యజమాని కిప్పుడు విశ్రాంతి అవసరంగదూ! అన్నిటికీ ఒక హద్దుంది. (లోపలికి పోతుంది)

హెడ్ : (రంగస్థలమున కభిముఖుడై) అదా యిప్పుడు జరిగింది! ఒకరి తప్పును వేరొకడు నెత్తిపైవేసికొనడం.

[శంకరప్పిళ్ళ, నంబియారూ ప్రవేశిస్తారు.]

నంబి : ముందుకుగాదు. తనముందుకు త్రోసికొంటాడు.

శంకర : సార్! కూలీల కీ రోజే బట్వాడా చెయ్యవలసిన రోజు.

హెడ్ : నా బట్వాడా యింతకుముందే నాకు ముట్టినది. (పోతాడు)

నంబి : (చూస్తూ) హా! హా! హా! శంకరప్పిళ్ళా! ఇది మన యిద్దరిదీ!

శంకర : హా! హా! హా! (యిద్దరూ చప్పట్లు చరుస్తారు)

[తెర]

# స్వప్న మేఖల

రచయిత:

డి. యన్.

హాస్యరసప్రధానమైన నాటకాలు వ్రాయ
డంలో అగ్రగాములు కొందరున్నారు.
డి. యన్. వారిలోకూడా ప్రసిద్ధుడు.
కేరళదేశంలో ప్రతిహైస్కూలులో -
కాలేజీలో ఆడబడుతుంటాయి. రేడియో
నాటకాలు వ్రాయడంలోను ఆయన సిద్ధ
హస్తుడు. ఇతనినాటకాలు సుమారు
పండ్రెండుకు పైగా వున్నాయి. "సుధ"
అనే ఒక నవలకూడా ప్రసిద్ధము.
"కళిజ్ఞోణి" అనే ఒకకవితారచనకూడా
ఆయనది ప్రసిద్ధంగావుంది. డి. యన్.
సుప్రసిద్ధుడైన ఒకనటకుడుకూడ. జననం
1920లో. సొంతవూరు తిరువనంతపురం.

## పాత్రలు :

సుకుమారన్

రవి

వృద్ధుడు

సులేఖ

బాబు

రేణుక

# స్వప్న మేఖల

[కళాదృష్టికి కావలసినట్లుగా అలంకరింపబడిన గది. మేజీకుముందు సుమారైదడుగులు యెత్తుగావున్న ఒక మంటితో చేసిన ఒక శిల్పం. ఆ శిల్పి-ఒక స్త్రీ ఆకారాన్ని నిర్మించాడు. గోడపైన వ్రేలాడుతూన్న ఒక తరుణీ చిత్రం. స్టేజిలో చక్కని లైటింగుతోను, వెనకవైపు చక్కని సంగీతంతోను-ఒక యసాధారణమైన సుందర ప్రపంచాన్ని సృష్టించాలి.]

సుకుమారన్ : నీవు ఎగ్జిబిషన్‌కు వెళ్ళి - కొని తెచ్చుకొన్న శిల్పమూర్తి యిదేనన్నమాట!

రవి : అదే! నేటిఉదయం తెచ్చాను. శిల్పం ఎంత అందంగా వుందీ!

సుకు : (ప్రతిమకు దగ్గరగా వెళ్ళి పరీక్షగాచూచి) ఓహో! అద్భుతంగా వుంది!

రవి : ఇలాంటి ఒక స్త్రీ ప్రపంచంలో బ్రతికి వుంటుందని చెప్పటానికి వీల్లేదు. ఎంత సుందరంగావుంది!

సుకు : ఖరీదెం తిచ్చావు?

రవి : ఏమి యివ్వవచ్చునో నీవే చెప్పు

సుకు : నూ......రు......

రవి : ఛీ...! ఛీ...!

సుకు : ఇన్నూరు.

రవి : సరిపోతుందంటావా?

సుకు : మున్నూరు.

రవి : మున్నూటా యాభై యిచ్చి తెచ్చాను.

సుకు : నీ కేమీ నష్టంలేదు. ప్రతిమ చాలా బాగుంది. మున్నూటా యాభైరూపాయలు ఖర్చుపెట్టి- ఏనాడూ యవ్వనం వాడని నిత్యనూతన సౌదర్యంవున్న ఒక స్త్రీని నీ పూజాదగ్గర శాశ్వతంగా ప్రతిష్ఠించుకున్నావన్న మాట!

రవి : నీ వన్నది నిజమే. స్త్రీ యొక్క అధరాంచలముపై ఏనాడూ మందహాసం మాయదు.

సుకు : కేశపాశములో ధరించిన ఆ పూవు లెప్పుడూ వాడవు. గాలివీచినచో ఆ కొంగు తొలగదు.

రవి : ఆ చీర...ఆ రవిక...ఎప్పుడూ మాయవు. అంతే గదూ?

సుకు : నిజం నిజం. నొసటిపై ధరించిన ఆ కుంకుమ గూడా చెరిగిపోదు. దీన్ని చెక్కిన దెవరో?

రవి : ఒక ముసలాయన.

సుకు : (ఆశ్చర్యముతో) వృద్ధుడా?

రవి : అదే! జీవితం వాడి - వండ్లూడిపోయిన ఒకవృద్ధుడు. ముఖమంతా ముడతలుపడ్డ గతాయుష్కుడు. అద్భుతంగా చెక్కేడు. ఆ వృద్ధుడు యీ చిత్రాన్ని చెక్కడంలోనే ఎంతో ఆశ్చర్యంవుంది. ఆ వృద్ధుని చెయ్యి వణుకుతుంది. వ్రేళ్లుగూడా వణకుతాయి.

సుకు : ఏమిటీ! వణుకుతూండే వ్రేళ్లు సృష్టించాయన్న మాట యీ యద్భుతసౌందర్యాన్ని!

రవి : అంతేగాదు. అనేక సంవత్సరాలు-రాత్రీ-పగలూ నిద్ర లేక శ్రమించి, తయారుచేసిన దీ సౌందర్యప్రపంచం.

సుకు : అయితే నీ వీ ప్రతిమకిచ్చినవెల ఏమాత్రమూ సరిపో దంటాను. ఒక ఐదునూర్లైనా యిచ్చివుంటే సరిపోయేది.

రవి : నే నేమిచేసేది. నాచేతిలో అప్పు డంతమాత్రమే డబ్బు వుండినది. ఉన్నదంతా యిచ్చివేశాను. ఆ ప్రతిమకన్నులు చూడు. ఎంత అందంగా వున్నాయో! మాటిమాటికి ఆమె మనవైపు చూచి, రెప్పలార్పుతూవుందా యనిపిస్తుంది. మనవైపే తదేకదీక్షగా చూస్తూవుం దావిడ.

సుకు : నీ వన్నమాట నిజమే! ఆ కన్నుల్లో జీవరేఖలు అంతగా కనుపిస్తున్నాయి. నీవు కొంచెందూరంగా నిలుచో. లేకపోతే ఆవిడ నిన్ను బాహుబంధాలలోనికి లాగి కౌగిలించుకుంటుం దేమో!

రవి : అదే నాకూ సందేహం. కాని నీవన్నమాట నిజంగా జరిగితే ఎంత బాగుంటుంది!

సుకు : బాగా నేవుంది. అయితే నీ ప్రేమ శిలాప్రతిమలను ప్రేమించడాని కారంభించిందన్నమాట. ఇక నీవు తొందరలోనే శిలాప్రతిమలకు "లౌలెటర్లు" రాయడానికారంభిస్తావన్నమాట.

రవి : అబద్ధంకాదు. ఇంత సౌందర్యమున్న స్త్రీని నే నెక్కడా ప్రపంచంలో చూడలేదు.

సుకు : నీ మత్తునుచూస్తే - యీ ప్రతిమ శిలామయమైన దానివల్ల బ్రదికిపోయిందనుకున్నాను.

రవి : నేనూ అలాగే అనుకుంటాను. ఈ స్త్రీ శిల్పమూర్తి కావడం నా దురదృష్టం.

సుకు : అదిగో! ఆ ప్రతిమయొక్క నాసిక యెంత చక్కగా

చెక్కబడిందో చూచావా? ఈ స్త్రీ తనదగ్గర వృద్ధుడు ఉండడానికంటె నీవంటి నవయువకుడు ఉండడమే అదృష్టంగా భావిస్తుందిగదూ!

రవి : నిజమే అయివుంటుంది. అదిగో! ఆ ముసలివాడు చూడు. వణుకుతూ మరలా వస్తున్నాడు.

సుకు : నీ విచ్చిన కొన్ని రూపాయినోట్లలో కొన్ని దొంగ నోట్లుగూడా ఉండివుంటాయి. అందుకే వెనక్కి వస్తున్నాడనుకుంటాను. ఏదిఎట్లైనా నేను పోతున్నాను. మీరిద్దరూ ఆ ప్రతిమతో సరసాలాడండి.

[ఫిడిల్ మ్రోగినశబ్దం]

[సుకు వెళ్ళిపోతాడు. ఒకవృద్ధుడుప్రవేశిస్తాడు. ఆతని ముఖంలో కలతపడినరేకలు. గట్టిగా నిశ్వసిస్తూంటాడు.]

వృద్ధుడు : ఎక్కడ?

రవి . మీ కేంగావాలి?

వృ : నా సులేఖ ఎక్కడవుంది?

రవి : సులేఖ! ఓ! ఆప్రతిమకు మీరు పెట్టుకొన్న పే రదన్న మాట.

వృ : అది ప్రతిమే నంటావా?

రవి : కాదంటారా?

వృ : నేను కనపడనిదాని కావిడ ఎలుగెత్తి నన్ను పిలువ లేదూ?

రవి : ఆ శిల్పం మాట్లాడుతుందన్నమాట.

వృ : "దుఃఖ కీ నదియా"అని పాటలు పాడలేదూ?

రవి : నీ మాటలు నా కర్థం కావటంలేదు.

వృ : నే నావిడను తీసికొనిపోవడానికి వచ్చాను.

రవి ; అయితే, నేను ఖరీదుపెట్టి కొన్నానన్న సంగతి మరచి పోయారన్న మాట.

వృ : మీరు నా కిచ్చిన డబ్బంతా దమ్మిడీలతో సహా వెనక్కి ఇచ్చివేస్తాను. ఈమె లేనిది నేను బ్రదుకలేను. నన్ను దౌర్బల్యం ఆవేశించింది. ఒకానొక దౌర్భాగ్యక్షణంలో నీ కీ ప్రతిమను అమ్మివేశాను. (స్వరం మార్చి) సులేఖా! నాపై నీకు కోపంవచ్చిందా? అయ్యో! నీ ముఖమంతా వాడిపోయింది. అదేమిటి! అలా నా వైపు కోపంగా చూస్తున్నావు. వద్దు వద్దు. నా వైపలా చూడవద్దు. నిన్ను వెనక్కి తీసికొనిపోవడానికే నేను వచ్చాను. (రవినిచూస్తూ) ఇవిగో మీరిచ్చిన రూపాయలు. యిందులో ఒక్కరూపాయి మాత్రం ఖర్చయి పోయింది. రేపు ఎలాగైనా ఆ రూపాయి తమకు వాపసిస్తాను

రవి - క్షమించండి. నే నీప్రతిమను వాపసివ్వలేను. డబ్బును వెనక్కి తీసికోను, నా కీ ప్రతిమంటే ఎంతో యిష్టం.

వృ : మా సులేఖ అంటే యిష్టంలేనిదెవరికి? ఏమి సులేఖా మా మాటలన్నీ వింటున్నావా?

రవి : మీకు యింకా ఒక నూరు రూపాయలు పైనగూడా యిస్తాను. వానితో మీరు తృప్తిపడండి, నా కీ ప్రతిమ అవశ్యం వుండాలి.

వృ:(కొంచెంగా నవ్వుతూ) నూరేమిటి! వెయ్యి...లక్షరూపాయలిచ్చినా నేను నా సులేఖనుఅమ్మటంలేదు. నా బుద్ధిచెడి

పోయిన సమయంలో నే నీవిడను వెలకు తమ కిచ్చి పోయాను. ఇంటికి పోతూనే నా కేమీ తోచలేదు.

రవి : అయితే, యిప్పుడు న న్నేం చేయమంటారు?

వృద్ధు : మీరు చాలా మంచివారు. నా ముద్దుల సులేఖను నేను వెనక్కి తీసికొనిపోవడానికి సమ్మతించండి.

రవి : (చీకాకుగొన్న చూపుతో) ఇది మీ ప్రేమను దొంగిలించిన స్త్రీప్రతిమ యనుకొంటాను.

వృద్ధు : అంతేనా, ఈమె నా హృదయం, నా జీవితం, నా సర్వస్వం.

రవి : ఓహో! దేవతల్లాంటి సౌందర్యం.

వృద్ధు : కొంచెం మెల్లిగా మాట్లాడండి, ఆవిడ వింటుంది. (కంఠస్వరం తగ్గించికొని) దేవతాసౌందర్యమేమిటి? ఆమె దేవతయే.

రవి : సందేహంలేదు. ఒక్కవిషయ మడుగుతాను. ఆ స్త్రీ యెప్పుడు మరణించింది?

వృద్ధ : (కొంచెం కోపంగా) ఏమన్నావు? ఆ స్త్రీ మరణించిందనా? నా సులేఖ మరణించిందా! అయితే యీ యెదుట నిలుచున్నది యెవరని నీ భావం?

రవి : క్షమించండి. నే నడిగిన ప్రశ్నతో తమకు వేదనకలిగి వుంటే నన్ను క్షమించాలి.

వృద్ధు : (నవ్వి) సులేఖా! నీవు మరణించావని యిత డంటున్నాడు. నీవు వింటున్నావా? (మరల నవ్వి) కన్నుల ముందు నీవు నిలుచున్నావు. న న్నీత డడిగినప్రశ్న నీకు వినపడలేదూ? నీవు మరణించావంటున్నాడు. (రవితో)

తాకిచూడు. ఆ శరీరంలో మాంసం లేదూ మెల్లగా తాకు నాయనా, ఆ శరీరం నొస్తుంది.

రవి : నొస్తుందన్నమాట!

వృద్ధు : ఎందుకు నొవ్వదు? మాంసమయమైన మృదుశరీరం గదా!

రవి : మీ మాట నిజమే.

వృద్ధు : ఆ నరములలో స్పందనమున్నది. ఒక చిన్న సూది తీసికొని గుచ్చితే ఆ శరీరంనుండి రక్తం బయటికివస్తుంది. (కొంచెం నవ్వుతూ) ఇల్లాంటి ఆవిడను మీరు మరణించిందంటున్నారు (ఏదో రహస్యం చెబుతున్న వానివలె) ఆవిడ మరణిస్తుంది-నేను మరణించినఅనంతరం.

రవి : నాకా విషయం తెలియదు.

వృద్ధు : అందుకే చెబుతున్నాను. ఆమె నా ప్రాణం. నేను జీవించినప్పుడు సులేఖకూడా జీవిస్తుంది. మా రెండుశరీరాలకూ ఒక్కటే ప్రాణం.

రవి : (కలగంటున్న వానివలె) బాగానేవుంది. అయితే యీవిడకి ప్రాణంవుందన్నమాట! (కంఠస్వరం మార్చి) ఓహో! ఏమిసౌందర్యం!

వృద్ధు : సులేఖా, ఇక పోదాము. నాపైన నీకు కోపం వచ్చిందా? నీ కోపాన్ని క్షణంలో మారుస్తానులే.

రవి : నా దొక కోరికవుంది. ఈ ప్రతిమను చూడాలనే ఆశ నాకింకా తగ్గలేదు. ఇంకా రవ్వంతసేపు – ఈవిడని నాదగ్గరనే వుంచుకునేందు కవకాశం కల్పించండి. దీనికి మీరు సమ్మతిస్తారనుకొంటాను. ఈరాత్రి యిక్కడ

వుంచి, తెల్లవారినపిదప మీా రావిడను తీసికొనిపోవ చ్చును. నా డబ్బు మీారు వాపసుచేయనవసరంకూడా లేదు. ఈ ప్రతిమపై నా కెంత మమత ఏర్పడ్డది. ఈవిడతో నా కేదో సంబంధమున్నదిలావుంది,

వృద్ధు : ఆమె నన్ను కలవరిస్తుంది.

రవి : లేదు, లేదు... నే నావిడను సమాధానపరుస్తునా? ఆవిడకు సంతోషంగా వుండేట్లు పాటలుపాడతాను.

వృద్ధు : అయితే! మరొక అక్కలాగా ఆవిడకి శుశ్రూష చేస్తా రన్నమాట!

రవి : తప్పక చేస్తాను. సందేహం లేదు.

వృద్ధు : అయితే నేను తెల్లవారి వస్తాను. మా సులేఖ నంత వరకూ జాగ్రత్తగా కనిపెట్టుకోండి. అమ్మాయీ! నేను తెల్లవారి వస్తాను. నీ వేమీా భయపడవద్దు. నీవు మీా అన్నతో వున్నావనేవిషయం జ్ఞాపకంవుంచుకో ! విన్నావా! ఇది నీకు సమ్మతమేనా? (రవితో రహస్యంగా) ఆమె రాత్రి యేమైనా పోరుపెట్టితే ఆ విషయం నాకు తెల్పాలి సుమా!

రవి : తప్పక అలాగేచేస్తాను.

[వృద్ధుడు తిరిగిచూచుకుంటూ పోతూపోతూ చిఋనవ్వునవ్వి మరీ పోతాడు. రాత్రి యొక్క ఎఫెక్ట్]

రవి : (ఈలపాట పాడుకుంటూ) సులేఖ! సులేఖ! ఎంత మంచి పేరు. పేరుకంటే మధురమైంది నీ సౌందర్యం. నీవు మాట్లాడుతావన్నమాట! అంతేగాదు, పాటపాడుతావు. హాఠంపడుతావు. నీ ముఖం చూస్తూవున్నంతసేపూ ఎంత

ఆనందంగా వుంటుంది. ఏదో ఒక శోకమూకమైన ప్రేమ కథలో-నీవు నాయికవై యుంటావు. నీకు నన్ను తెలుసునా? (తిన్నగా నవ్వడానికారంభించి - నిలిపి నిలిపి - నవ్వుతూ ఉచ్ఛ్వాసంలో నవ్వునాపుతాడు.) ఒక మంటి బొమ్మతో ప్రేమబంధాన్ని వేదిందుకుంటున్నానన్న మాట! ఈరాత్రి-వెన్నెలతో ఎంత అందంగావుంది. ఈ ప్రతిమకు నిజంగా ప్రాణంవుంటే-నేను నా వీణను వాయిస్తూ అద్భుతంగా పాడివుందును (ఒకపాటలో రెండుచరణాలు పాడతాడు.) నా ప్రేమ యిలావుండాలని ఆశిస్తాను. ఒకానొకసుందరి- ఆమెడకు నాపైననే గాఢమైనప్రేమ. కాదు కాదు. ఒకయువతి-నాతోయేమిటో-రహస్యం చెప్పాలనిఒక సంకేతస్థలంలో కాచికోనివుంది. జాగ్రత్స్వప్నాలకు మధ్య తూగాడుతూ నే నక్కడికి వెడతానన్నమాట! శరీరం నిండా ఆవిడకి యవ్వనం తొణుకుతూవుంది. (సగం పాడి నిలిపినపాట నందుకొని పూర్తిగా పాడతాడు.) సులేఖా! పాట విన్నావుకదూ! ఇక నేను కాస్సేపు పడుకుంటాను. మారాము సేయవుకదూ! నాకు నీపైనా-నిన్ను సృష్టించిన కళాకారునిపైనా ఎంతో ఆదరం వుంది. గుడ్ నైట్! (రవి దీపంఆర్పి పడుకుంటాడు.)

[కొంచెంసేపు నిశ్శబ్దత. ఫిడిల్ వాయించినశబ్దం. వేణువుధ్వని గూడా వినపడుతుంది............మరలా నిశ్శబ్దత. ఒక స్త్రీ ఏడుస్తూన్న ధ్వని..........ఆవిడ ఎవరినో పిలుస్తూన్నధ్వని.]

రవి : (తొందరగా లేచి) ఎవరది! (దీపంవెలిగిస్తాడు) ఎవరూ లేరు. మరి యింతకుముందు వినపడ్డశబ్దం ఏమిటి? నా

మతిభ్రమ అనుకుంటాను. కాకపోతే, యీ అకాలంలో ఎవరు పిలుస్తారు? మనోమోహినీ! సులేఖా! నీవే పిలిచావా! (పరిహాసంగా) ఊ! పిలిచావు పాపం! నే నొక మూర్ఖుణ్ణయిపోయాను. ల ల్ల ల్ల ల ల ల్లా లల్ల ల్ల ల ల ల్లా......ఈ గదిలోకి ఎవరువచ్చి పిలుస్తారు? ఎవరూ కూడా నా నిద్రాభంగంచేయరాదని యింట్లోవాళ్ళ కింతకుముందే చెప్పివేశాను. గుడ్ నైట్ – (మరలా పడుకుంటాడు.)

[నిశ్శబ్దత ...మరలా ఎవరో వెక్కి-వెక్కి-ఏడుస్తూ పిలుస్తున్నశబ్దం]

స్త్రీకంఠం : బాబూ.........

రవి : (అదరిపడి లేచి) ఎవరది?

స్త్రీ : బాబూ!

రవి : (లైటు వెలిగించడానికి స్విచ్ వేస్తాడు. మెల్లగా) బాబుగారా! ఎవరు పిలిచేది? (పడుకొనే) ఎవ రా మాట్లాడుతున్నది?

స్త్రీ : మా బాబుగా రెక్కడ?

రవి : (ఆశ్చర్యము – సంభ్రమమూ కూడుకొనేముఖంతో) వేగంగా గాలిపీలుస్తూ) సులేఖా!

స్త్రీ : నేనే.

రవి : సులేఖా!

స్త్రీ : నేను ఏడ్చానని బాబుగారితో చెప్పకండి. ఆయన మనసుకు నొప్పికలుగుతుంది.

రవి : చెప్పనులే. నీవు మాట్లాడుతావన్న మాట!

స్త్రీ : నేను పడుకుంటాను.

రవి : వద్దు.

సులేఖ : మరి ఏంచేయమంటావు?

రవి : కొంచెంసేపు మాట్లాడుకుందాం. ఈ ముఖమూ—యీ స్వరమూ—నా కెక్కడో పరిచయమైనవిలా ఉన్నాయి. కొంచెంసేపు సంభాషించుకుందాం.

సులేఖ : ఏవిషయంగురించి?

రవి : సులేఖనుగురించే.

సులేఖ : నన్నుగురించి అన్నమాట! నన్నుగురించి చెప్పడాని కేముంది? నేను ఒక బొమ్మలోనుంచి మాట్లాడుతున్నాను. బాబుగారిస్నేహబలంతో జ్వలిస్తూవుండే ఒక వత్తిని నేను.

రవి : నా కర్థమైంది. ఓహో! ఈ కంఠస్వరం మా అమ్మదిలా ఉంది ఆమెకంఠ్లుగూడా యిలానే ఉండేవి. ఏమి అందం! ఇంతకుముందు నా కీ విషయం తోచనేలేదు.

సులేఖ : ఏమిటీ! మీ అమ్మా! నా జీవితంలో నేను ప్రసవించిందే లేదు.

రవి : నిజమే, నిజమే. నన్ను క్షమించు. ఏదో స్వప్నంలో నాకు కనపడినవృత్తాంతానికీ నీకూ ముడిపెట్టివేశాను. కాని— నీవు చెప్పవలసింది చెప్పు.

సులేఖ : నేను బాబు నెప్పుడూ చూస్తూవుండాలి. ఎడతెగకుండా సంభాషిస్తూండాలి. ఆయన వినేటట్టు రసవత్తరమైన పాటలు పాడుతూవుండాలి. అందుకోసమే నన్నాయన చితాభస్మంలోంచి — మరలా సృష్టించాడు.

రవి : ఓహో! అయితే సులేఖ-యవ్వనకాలంలోనే మరణిం

చిందన్న మాట! అయితే నా వూహ తప్పయినట్లే. మా అమ్మ-ఇక్కడే మరణించింది. నన్ను క్షమించు. ఏదో మనసులో ఊహిస్తూ మాటలనివేశాను.

సులేఖ : మిమ్మల్ని చూస్తే, నా క్కూడా ఒక మమత యేర్పడిపోయింది. కాని-మీరు-తీరా దగ్గరికివచ్చి - అదీ యిదీ మాట్లాడడాని కారంభిస్తేమాత్రం-నే నేమీ సంభాషించదలచుకో లేదు.

రవి : లేదు లేదు ఇక మీద నే నొక్క మాటగూడా మాట్లాడేదిలేదు. నీ జీవితగాథే వింటాను. మొదట్నించీ కడవరకూ చెప్పు. నీ కథ ఒక్కరికైనా తెలియకపోతే యెల్లాగూ?

సులేఖ : నిజమే. ఒకరికైనా తెలియవలసిందే! నవ్వులూ - పాటలూ-కన్నీరూ-నిండుకొన్న నా జీవితగాథ కొంచెం పెద్దదే. దాన్ని సంక్షేపించి వినిపిస్తా వినండి

రవి : అదే! ఆరంభించు.

సులేఖ : గాలీ వానా పట్టుకొన్న ఒక రాత్రి (వెనుక భాగంలో గాలి-వానలను సూచించే సంగీతం వినపడాలి.) చాలా సంవత్సరాలక్రిందటిమాట! అప్పుడు నే నొక శిశువును. మా నాయనా-అమ్మా-ఎవరో నాకు జ్ఞాపకంలేదు. వారిద్దరూ-చిన్నపడవలో ప్రయాణంచేస్తున్నారు. హఠాత్తుగా గాలి రేగింది. పిడుగులు పడడాని కారంభించినాయి. మెఱుపులు మెఱసినాయి. పడవను తీరంచేర్చడానికై చేసిన ప్రయత్నంకూడా వ్యర్థమయ్యింది. ఆ పడవ మునిగింది. ప్రాణంపోక బ్రదికిన నేను- మా నాయనమృతదేహాన్ని

పట్టుకొనివున్నానట! ఆ సమయంలో ఎవరో నన్ను రక్షించారు. (వెనుకవైపున సంగీతం నిలిచిపోతుంది) ఏమి టాలోచిస్తున్నారు?

రవి : ఏమీలేదు. ఆ భయంకరరాత్రి నూహిస్తున్నాను. ఆ గాలి–ఆ ప్రయాణం–తీరంచేరడానికిచేసిన ఆ ప్రయత్నం– ఆ యేడ్పులూ, మృతదేహాలూ–తండ్రిశవాన్ని పట్టుకొని బ్రదికియున్న ఆ పసిపాప – ఇవన్నీ నాభావనలో–తిరిగిపో తున్నాయి ఆ శిశువును రక్షించడానికి సాహసించి – యీదుకొనివచ్చినరక్షకవృద్ధుడు కనపడుతున్నాడు. మా అమ్మకూడా యిలాంటికథనే చెప్తూవుండేది. ఛీ ఛీ! ఆ కథ నమ్మరాదు. (స్వరంమార్చి) సులేఖా! తరువాత చెప్పు.

సులేఖ : ఇంకేమీ నాకు జ్ఞాపకంలేదు. ఇదికూడా ఎవరో చెబితే విన్నవృత్తాంతమే నే నప్పు డంత చిన్నపిల్లనన్న మాట. నేను పెరిగింది–బాబుగారితోడలపైననే. నాకు యీడ్వడానికీ–నవ్వడానికీ నేర్పించిం దాయనే. బాబుగారి వ్రేళ్ళు పట్టుకొనే – తప్పటడుగులు వేయటం నేర్చు కున్నాను. ఆయనే నాకు నృత్యం నేర్పించాడు.

రవి : (మెల్లగా) ఆ కథ కానేకాదు. మా తల్లికథ కాదు. ఎంతబాగుంది నీ జీవితగాథ! ఒక్కొక్క ఘట్టాన్ని విస్త రించి చెప్పు. హాయిగా వింటాను.

సులేఖ : వెన్నెలలు ఆక్రమించిన ఒకరాత్రి. మా గ్రామంలో తోటదగ్గర–నేనూ బాబుగారు తీయని నారింజపళ్ళు తింటు న్నాము. నడుమనడుమ మనోహరంగా పాడుతున్నాము.

ఆ నారింజతోటలో రెండు చిన్న మొలకలు పీకి-కయ్యలో నుండి ప్రవాహంలోకి వదిలాను. మనమిద్దరూ దోనెలో ప్రయాణించేతామని నేను బాబుగారితో పలికాను.

[రంగం మారిపోయినశబ్దం. మైక్‌ద్వారా రంగం మారిపోయినట్టు మాటలతో సూచించాలి.]

బాబు : ఒక అలకొడితే – అది మునిగిపోతుంది.

సులేఖ : కాని–ఆ రెండు మొలకలూ ఏదో ఒకతీరానికి పోయి చేరుతాయి.

బాబు : చిన్నని ఆ మొక్కలు ఒకానొకనాడు - పెరిగి పెద్ద వౌతాయి.

సులేఖ : ఆ మొక్కలలో కాచే పండ్లు భక్షించేభాగ్యశాలికి హృదయంనిండా ప్రేమయే వుంటుందని నేను భావిస్తాను.

బాబు : ప్రేమ కడుపులో వుంటుందా? ఆ పళ్ళు తినేవానికి కడుపునొప్పిమాత్రం వస్తే రావచ్చు. పండబోయే పండ్లు తలచుకొని నా కిప్పుడే నీళ్ళూరుతున్నాయి.

సులేఖ : నారింజపండ్లకాలం గడిచింది. నే నిక పాడను.

బాబు : సరే! (ఒక టేపాట యిద్దరూ పాడతారు)

సులేఖ : (మైకులో శబ్దంనిలిపి) పొద్దు చాలా గడిచిపోయింది. నీలాకాశంలోవున్న నక్షత్రాలను చూసుకుంటూ వెన్నెట్లో పడుకుంటే ఎంత ఆనందంగావుంటుంది! తెల్లవారింది. నీలాటిరేవులో తానమాడడానికి వచ్చిన రేణుక చిఱునవ్వుతో – యిలా అన్నది:

రేణుక : సులేఖా! రాత్రి చక్కగా నిద్రపట్టిందన్నమాట.

సులేఖ : నేను పడుకునే వేళకే చాలా పొద్దుపోయింది.

రేణుక : ఆవిషయం నీ కళ్ళుచూస్తూనే తెలుస్తుంది.

సులేఖ : అదిగో! అప్పుడే ఆరంభించావు - నీ యేటుపోటు మాటలు.

రేణుక : నే నేమన్నానుగనుక? నిద్రరావడానికిముందు అనుభవించిన అనుభవమే ఆనందకరమైనది, అని చెప్పాను.

సులేఖ : నీవు స్నానంచేయడానికిగదా వచ్చావు? ఆ పని చేసికొనిపోతే బాగుంటుంది.

రేణుక : ఈ తోటనిండా నారింజలే కనవడుతున్నాయి.

సులేఖ : అవును. అందుకే రాత్రిపూట - జలదేవతలుకూడా వచ్చి ఆ పళ్ళు తింటారు.

రేణుక : నే ననేదీ అదే. రాత్రిపూట-ఈ స్థలములో - జల దేవతలు తిరుగుతూవుంటారూ! అని.

సులేఖ : అందులో క్రొత్తేముంది?

రేణుక : ఆహారమూ - నిద్రా లేని జలదేవతలన్నమాట! అవునా కాదా? అదిగో, అటుచూడు. ఆ కాల్వలో ఒక యిసుకతిన్నెపై - నారింజమొక్కలు - ఎలా కలుసుకొన్నాయో - అందంగా-

సులేఖ : చాలా అందంగా- అందులో ఒక మొక్క నేను.

రేణుక : రెండవమొక్క?

సులేఖ : అది నీవే!

రేణుక : నే నెందుకౌతాను? నన్ను సులేఖ యిలా కౌగిలించుకుంటుందా? ఆ రెండో మొక్క ఎవరో నాకు తెలుసులే! నీవైయున్న ఆ మొక్కచూడు. మాటిమాటికి ఆ

రెండోది మొక్క నెలా కౌగిలించుకుంటున్నదో! వారు జల దేవతలు లే! వారికి సిగ్గుండదటగా!

సులేఖ : నీ పరాచికాలన్నీ యిప్పుడే తీరుస్తానుండు.

రేణుక : ఏమి? నన్ను ప్రవాహంలోకి త్రోసి వేస్తావా యేమి? దిక్కులేక చచ్చిపోతాను.

సులేఖ : పరాచికం చచ్చినా వదలను.

రేణుక : నిజమే! నేను చచ్చినా నిన్ను పరిహాసమాడుతూనే వుంటాను. ఇదిగో! (నీటిలో స్నానంచేస్తూన్న శబ్దం)

[మైక్‌లో శబ్దం నిలిచిపోతుంది]

సులేఖ : ఇలాగా వినోదాలతో-పరిహాసాలతో-కలహాలతో మా ప్రేమ-అభివృద్ధి చెందింది. ఆ ప్రదేశంలో-మా గానములు-తేనెత్రావి మదించిన తుమ్మెదలగానాలతో పాటు చెలరేగేవి. నేడా గానాలు మాసిపోయినవి. వానితో పాటు మా సర్వస్వమూ మాసిపోయింది.

రవి : ఆ మధుర ఝంకారగానాలు - వాయువులో లీనమై పోయినాయిగాని.హృదయాలలో మాత్రం మాయలేదన్న మాట! స్మరణలో మాయలేదు.

సులేఖ : నిజమే! ప్రేమలు మరణాన్నిగూడా జయిస్తాయి. మరణానంతరంగూడా అవి నిలుస్తాయి.

రవి : నా కన్నులయెదుట నిలుచుకొన్న సులేఖ - ఆ ప్రేమ యొక్క-రూపుకట్టిన మూర్తియేకదా! కధను పూర్తిగా చెప్పలేదు.

సులేఖ : ఇక చెప్పడానికేముంది? ఒకనాడు నేను - నాతోడి

చెలికత్తెలూ చేరి వసంతకాలంలోని వెన్నెలను ఆహ్వా నిస్తూ పాటలు పాడుతూవున్నాము.

[మైక్‌లో గానం, సంభాషణా వినపడుతవి]

రేణుక : సులేఖా! మీ బాబుగారు నారింజతోటలో నీలాటి రేవువద్ద ఏడుస్తూ కూర్చున్నారు. ఏమి జరిగింది?

సులేఖ : ఏడుస్తున్నారా?

రేణుక : అవును. ఏదో తలచుకొని వేదనపడుతున్నారు. నీవు వెళ్ళు. కొంచెం ఓదార్చు - పాపం!

[మైక్‌లో సంభాషణ నిలిచింది.]

సులేఖ : నేను వెంటనే పరుగెత్తాను. ఏదో ఆపద సంభవించిందని భయపడ్డాను. నాహృదయంలో సుడిగాలి రేగింది. ఆ తోటయొక్క ఒక చిన్నచరియలో మా బాబుగారి దేహం - అలసంగా - నేలపై పడివున్న పూమాలవలె పడివుంది. (Pause) నా కా విచారధారను అడ్డగించడం యిష్టంలేదు. కాని, ఆయన చెక్కిళ్ళ వెంట ప్రవహిస్తూంటే కన్నీటిని తుడవాలనిమాత్రం అనిపించింది.

(Flash-back)

సులేఖ : ఏమిటిది ? దేనినిగురించి ఆ వేదన ?

[ మైకులో పాట ]

బాబు : సులేఖా ! వచ్చావా ?

సులేఖ : రేణుక చెప్పింది. ఇక ఏడుపు నిలపండి. ఆ కన్నీరు నా చీరచెంగుతో తుడుస్తాను...ఇంకా ఏడుస్తున్నారు.

బాబు : సులేఖా ! ఆ కన్నీరు పూర్తిగా తుడవడాని కెవరి చేతాగాదు.

సులేఖ : ఇప్పు డేం జరిగింది? నాకు చెప్పరాదూ!

బాబు : ఈ నల్లని రాళ్ళకట్టడం – నా జీవితంలో ఒక భాగ మయిపోయింది.

సులేఖ : ఈ రాళ్ళకట్టడం చూచిన – ప్రేమలీలలకు మితియే లేదు. దానిచుట్టూ కిలకిలనవ్వులు చుట్టుకున్నాయి.

బాబు : ఒక కాలంలో – యిప్పుడు నా జీవితం యీ నల్ల రాతిని ఆశ్రయించింది. నా కన్నీరు దీనిచుట్టూ చిన్న చిన్న కాల్వలను సృష్టిస్తుంది సులేఖా! నా కండ్లలోకి చూడు! నీ బాబును నీవు మరుస్తావా!

సులేఖ : అది కల్ల. ఎప్పుడూ మరువను.

బాబు : పాపం! నీకు తెలియదు. నీకు తెలియకుండానే నీవు నన్ను మరచిపోతావు. దానికేంచేతాము!

సులేఖ : (సగౌరవంగా) తమ రలా అనరాదు.

బాబు : నీవు–వేరే ఒకభవనంలోకి వెళ్ళిపోతావు.

సులేఖ : దయచేసి తమ రలా అనకండి.

బాబు : సులేఖా! మన మీ పరిస్థితిని మార్చలేము జరిగి తీరుతుంది.

సులేఖ : అలాగైతే, యిదుగో, చూడండి! నా తల్లినీ తండ్రినీ మింగివేసిన ప్రవాహం ముందే పారుతూవుంది.

బాబు : అది నిజమే ప్రవాహ మెప్పుడూ పారుతుంది. కాని– నీవుమాత్ర మొకానొక ధనికునిభవనంలోనికి పోయి తీరుతావు.

సులేఖ : నేనా! అయితే నా బాబు నన్ను నమ్మడంలేదన్న మాట.

బాబు : లేకేమి! కావలసినంత విశ్వాసంవుంది. కాని, నిర్జీవ మైనగుంటెని పిసికి బొమ్మలుచేసే దౌర్భాగ్యం అంటు కొన్న నా చేతిలోనికి - పరమేశ్వరుడు అర్పిస్తాడని నాకు నమ్మకంలేదు.

సులేఖ : అయ్యో! మీరిలా నిరాశపడరాదు మీ రీ చింతనువిడిచి ఒక్క చిరునవ్వు నవ్వేవరకూ నే నిక్కడి నించీ కదలను.

బాబు : సులేఖా! నీ వొక స్వర్గఖండంగా నాకు ప్రాప్తిం చావు. ఇందులో సందేహంలేదు. వర్తమానానికి సంబం ధించినంతవరకూ నీవు నా పదార్థానివి. కాని, భావికాలం ఒకటి వున్నది. (Flash Back పిలిచింది)

సులేఖ : అవును. మా బాబు నిజమే చెప్పాడు.

రవి : ఏమిటీ! అయితే, నీకు వివాహంజరిగిందనా-లేదనా?

సులేఖ : జరిగింది. నా తల్లితండ్రులను మింగినప్రవాహం అలానే ప్రవహిస్తూంది. కాని-నేనుమాత్రం-ఒక ధనికుని గృహంలోనికి ప్రవేశించాను.

రవి : ఏమిటీ!

సులేఖ : అవును. అందమయిన నా శరీరం ఒక ధనికునిపదా ర్థమయిపోయింది. నా వివాహమంటపం నిర్మింపబడిన సంగతిని మొట్టమొదట కనుక్కున్నది రేణుక. ఆవిడ - కన్నీటితో నా కా వర్తమానం తెలిపింది. నన్నిలా ఆశ్వాసించింది.

( ఫ్లాష్ బాక్ )

రేణుక : సులేఖా! లాభంలేదు. జీవితమంటే యిలాంటిదే.

ఏది సంభవించినా – ఓర్చుకోవడానికే స్త్రీజీవితం ప్రపంచంలో కలిగింది. ఏడ్వవద్దు. ఏడ్చి లాభమేముంది గనుక. బాబుగారెంత ధైర్యంగావున్నారో చూడు. ఇంకా ఆయన తన కార్యాలయంలో – ప్రతిమను తీర్చేపనిలోనే వున్నారు. ఇప్పుడే చూచివచ్చినాను. నీ జీవితంలో ఒక అధ్యాయం ముగిసింది. కన్నీరు తుడుచుకో!

సులేఖ : రేణుకా! నీవుకూడా యీమాటే అంటున్నావే (గట్టిగా యేడుస్తుంది.)

[Flash Back ends]

రవి : తరువాత!

సులేఖ : తరువాత!

రవి : తరువాతేమి జరిగింది? క్షమించు. సులేఖ ఎప్పుడు మరణించింది?

సులేఖ : బాబుగారికి ప్రాణప్రదమైన సులేఖ ఆనాడే మరణించింది. హృదయంకాని-ఆత్మకాని లేని ఒకశరీరం వివాహామండపంలోనికి ప్రవేశించింది. ఒక ధనికునియింటిలో కాలుపెట్టింది. ఏదో ఒక పెద్దమేడలో ఆ శరీరం నలిగి నలిగి యిప్పుడూ జీవిస్తూవుండవచ్చు. ఆతరువాతకథ నాకు తెలియదు.

రవి : (ఆశ్చర్యంతో) ఏమీ, అలాఅయితే నా వూహ తప్పుగాదన్నమాట. నిర్భాగ్యురాలైన ఆ స్త్రీయొక్క దురదృష్టవంతుణ్ణయిన కుమారుణ్ణి నేనే!

సులేఖ ! అలాగా......

రవి ! అమ్మో...అమ్మా...!

సులేఖ : (అసహ్యాభావంతో) కాదు కాదు. నేను నీకు అమ్మను కాదు. నా కెవ్వరూ లేరు. నాకున్న దొక్క బాబు గారు మాత్రమే.

రవి : ఇదిగో! ఆ గోడపై వ్రేలాడుతూన్న నా తల్లి యొక్క చిత్రం చూచావు గదూ! ఇప్పుడు చెప్పు. నీవు నా తల్లివి గాదూ?

సులేఖ కాదు కాదు. నేను తర్వాత బ్రదుక నేలేదు. యవ్వనం లోనే మరణించాను. అబ్బ! ఇక్కడ నాకు నరకంలో వుండినట్లుంది. బాబూ!...బాబూ...రండి...రండి నే నిక్కడ నిప్పులపైనున్నట్లుంది...బాబూ... (వెనుకవైపు సంగీతం తారశృతిలో మ్రోగుతుంది...మైకులో)

వృద్ధు : సులేఖా! సులేఖా! ఇదిగో వచ్చాను. అబ్బ! రాత్రంతా నా కేమి మైకంకమ్మింది! ఆ చీకటిలో–నా కండ్లకుకూడా చీకటికమ్మింది. ఏం, భయపడ్డావా యేమిటి? ద్రోహి...వాడేంచేశాడు...నే నెలా లోపలికి పోవడం...(Pause)

[వాకిలి తడుతూన్నశబ్దం. పిచ్చివానివలె నవ్వుతుంటాడు] తెరు, వాకిలితెరు, (తలుపుతెరచినశబ్దం)

రవి : ఏమండీ! ఏమి టీ సాహసం!...ఒళ్ళంతా చెమటలు పోస్తూవుంది. పడ్డారా యేమిటి?

వృద్ధు : నా సులేఖ యెక్కడ? సులేఖా! సులేఖా!

సులేఖ : బాబూ......(Pause)

[స్టేజిలో లైట్లువెలగడం, మలగడం. ఇలా కొన్నిసార్లవుతుంది. వృద్ధుడు ఆవేశంతో ప్రతిమను కౌగలించుకుంటాడు.]

వృద్ధు : సులేఖా! ఇక నిన్నొక్క క్షణంకూడా వదలివుండను.

సులేఖ : బాబూ! అదే నేనూ అనేది. ఒక్క నిమిషంకూడా వదలకండి. ఇంకా గట్టిగా కౌగలించుకోండి...ఈచోటు నాకు నరకంగావుంది.

రవి : ఎక్కడ దాపురించావు పిశాచీ! అంతగట్టిగా కరచుకొంటూ వేమిటి...శరీరం నలిగిపోదూ! అమ్మా!

వృద్ధు : అమ్మ...(నవ్వుతాడు) అమ్మా...ద్రోహీ నీవు నా సులేఖను భయపెట్టావు.

రవి : ఆ బొమ్మ పగిలిపోతుంది. పిడిచిపెట్టు.

వృద్ధు : పగిలిపోతుంది. పగలిపోతుంది. పోనీ.......

[బొమ్మ పగిలిపోయినశబ్దం. వృద్ధునినవ్వు విలిచిపోతుంది. వాడు భూమిపై పడిపోతాడు]

రవి : అయ్యో! అమ్మా! యిప్పుడు నే నేడ్చినా నీకు వినిపించేటట్టులేదు......

[తె ర ప డు తుం ది]

# బంధాలు

రచయిత:

యన్. కృష్ణప్పిళ్ళె. యమ్. ఏ.

కేరళ నాటకకారులలో ప్రధాను డు. ఈతనిపై "ఇబ్సెన్" నాటకాలప్రభావం హెచ్చు. ఈతని రచనలతో ఆ గాలులు కేరళంలో వీచమొదలు పెట్టాయి. సామూహికాలు- వైయక్తికాలు అయిన జీవితసమస్యలను ప్రధానంగాతీసికొని- వాటికి పరిష్కారంచెప్పవలెననేదృష్టి యీతని నాటకాలలో ప్రధానంగా కనపడుతుంది. జననం 1917. స్వస్థలం: వర్కాల. ఇప్పుడు తిరువనంతపురం యూనివర్సిటీకాలేజీలో లెక్చరరుగా వుంటున్నాడు. "భగ్నభవనం" "కన్యక" "అనురంజనం" మొదలైనవి ప్రసిద్ధములైన కొన్నినాటకాలు.

## పాత్రలు :

గోవిందప్పిళ్ళై

భవాని

వేణు

రాము

రమణి

# బంధాలు

[గోవిందప్పిళ్ళె మధ్యతరగతిఉద్యోగస్థుడు. కాని-ఇంటిలోని బాధ్యతలతో ఆయనపరిస్థితి చాలాకష్టంగావుంది. ఆయన నివసిస్తూందేది బాడుగ యిల్లు. దానికిముందు వరండా. ఆ వరండాలోవున్న ఒక స్తంభానికి ఒరిగి నిలుచున్నాడు గోవిందప్పిళ్లె. చాలారోజులు జీవితక్లేశాలతో పోరాడడంతో అన్నపానీయాలసంపాదనకు నిర్విరామంగా ప్రాకులాడడంతో గోవిందప్పిళ్లె శరీరం అలసిపోయింది. ముఖంనిండా ముడుతలు. కన్నులలో నల్లనిరేకలు పుంజుకొనివున్నాయి. దగ్గరే భార్య భవాని నిలబడివుంది. ఆమెవంట్లోగూడా యెముకలు వెళ్ళబడ్డాయి. ఆమె యేదో మాట్లాడుతూవుంది. గోవిందప్పిళ్లె మౌనంగా వింటున్నాడు. నడుమనడుమ వేదనాధిక్యంతో ఒక్కసారి మూల్గడంతప్ప అత డేమాటా అనడంలేదు. కాని, భవాని ఆయన్ను మౌనంగా వుండనివ్వటంలేదు.

గోవిందప్పిళ్ళె : చెప్పేదంతా చెప్పివేశావుగదూ! ఇక 'నీ సంభాషణ చాలిస్తే బాగుంటుంది.

భవాని : సరే! ఎందుకు నా సంభాషణ నాపాలి? నేను మాట్లాడినా మాట్లాడకపోయినా కలిగే ప్రయోజన మేముందిగనుక? నా మాటల్తో మీ కేమి నష్టంవచ్చింది గనుక ?

గోవింద : చెప్పితే ప్రయోజనంలేనివిషయాలు చెప్పకుండడమే మంచిదని నీకు తెలీదూ?

భవాని : అదే నేనూ అనేది? కాని-అట్లాఅని చెప్పకపోతే

ఎట్లా? కాని-నేను చెప్పేదానివల్ల ప్రయోజన మెందుకు లేదో తెలుసుకుందామని!

గోవింద : అయితే, నీకు సమాధానం చెప్పేవరకూ – నన్ను వదలవన్న మాట! ఇదిగో! చెబుతున్నా విను! నీవు చెప్పిన ప్రకారం చేయటానికి సాధ్యంకాదు. ఈ వృత్తరంతో నీ కేం ఒరిగింది?

భవాని : పోనీలెండి. మీ బంగారుమూతివిప్పి యీమాటైనా చెప్పారుగదా! చాలా సంతోషం.

గోవింద : నీ మాట బొత్తిగా తోసెయ్యాలనికాదు అయితే యీవిషయంలో నన్నేంచెయ్యమంటావు? ఏంచెయ్య డానికి సాధ్యమవుతుందిగనుక?

భవాని : ఏమీ చేయకండి. నన్ను నా పిల్లల్ని నడివీధిలోకి తోసెయ్యండి, సరిపోతుంది.

గోవింద : వీధిలోపడేటట్లయితే-అందరూ ఒకేసారి పడదా మనుకో!......చిన్నప్పటినుంచీ నే నెంతో ప్రేమతో ఆదరంతో లాలిస్తూవచ్చినవాణ్ణి... (గొంతారిపోతుంది) భవానీ! యీమాటలనడానికి నీ కెలా బుద్ధిపుట్టింది? నీవు వాని కొక తల్లివంటిదానివికదా!

భవాని : (ముఖంపై కనపడుతూన్న వేదనతో)ఆ భావం నాకు లేకుంటే-వాణ్ణి నా బిడ్డవలె యెలాచూస్తాను? నా బిడ్డల కూ-డా లేకుండా వాడికి ముప్పూటా తిండిపెట్టాను. పోషించాను. నాతో మీ రిలా మాట్లాడడం నాకిష్టంలేదు.

గోవింద : నాకీ విషయం తెలీకకాదు భవానీ! ఇంకొకరైతే-నీవలె వాణ్ణి పోషించివుండరని నాకు తెలుసు

భవాని : ఆ సర్టిఫికెట్టు నాకక్కరలేదు. ఇన్నాళ్ళ మంచితనంతో నాకేం ఒరిగింది. గనుక? నాకుగూడా-కడుపున బుట్టిన బిడ్డ లిద్దరు ముగ్గురున్నారు!

గోవింద : ఇన్నాళ్ళు ఓర్చుకున్నావు! ఇంతలో ఎందుకు తొందరపడతావు? వానికెక్కడైనా ఉద్యోగందొరకనీ.

భవాని : ఎంతకాలమని ఓర్చుకోమన్మంటారు? ఇంతవరకూ ఒక్కసారైనా మీతో యిలా మాట్లాడానా? ఎన్నిరోజులీ దారిద్ర్యబాధ నిలా మనసులో అణచుకోమంటారు? వానిచదువు ముగిసి రెండేండ్లు గావచ్చిందా? ఇప్పటికి దొరకనిఉద్యోగం మరెప్పటికి దొరుకుతుందని? ఇంకా ముందటివలెనే సంసారాన్ని గుల్లచేసికొంటే-ఇకమీద నా పిల్లల్ని ఎవరు చూస్తారు?

గోవింద : ఎంతప్రయత్నించినా ఉద్యోగం దొరకటంలేదు. వాడు మాత్ర మేంచేస్తాడు!

భవాని : మనంమాత్ర మేంచేయాలి? చేయగలిగిందంతా చేశాము. వానిచదువుకోసం- నా సొమ్ములుగూడా అమ్మినసంగతి మీకు తెలిసిందే. అన్నానికి గింజలులేక-ఇంట్లో పొయ్యిలోనిపిల్లి లేవనినాడుగూడా నేను వాని కడుపుచూచాను. ఇంత కష్టపడి యేంలాభం? ఏదైనా నాలుగుకాసులు సంపాదించి, మన ల్నాదుకుంటాడా అంటే ఆ కాలం వచ్చేటట్టు కనపడదు,

గోవింద : మనకర్తవ్యం మనం చేశాము. అదిబక్కటే మనం చూడవలసింది భవానీ!

భవాని : ఆ కర్తవ్యం యింకా తీరిందా లేదా అని నాప్రశ్న? మీ కర్తవ్యనిర్వహణలో మీబిడ్డల్ని మీరు మరచిపో తున్నారు. కాని- నే నలా మరువలేను. నేను వాళ్ళని కన్నాను.

గోవింద : అయితే! వారి కివ్వ డేంచేయాలని నీ భావం! వారికొరకు నిర్వహింపవలసినకర్తవ్య మింకా ముందుంది. నేను తలచేది......!

భవాని : బాగుందిలెండి! మీ తమ్ముడు తలచకపోయినా- మీరుమాత్రం తలచండి.

గోవింద : అయితే- వాణ్ణి యింట్లోనుంచీ వెళ్ళిపొమ్మని చెప్పాలి. అంతేకదూ-నీవుద్దేశం! అయితే......

భవాని : అయితే లేదు, గియితే లేదు. అలా కాకుంటే-ముందే చెప్పానుగదా-మమ్మలైనా తరిమెయ్యండి.

గోవింద : నీమాటలేమీ బాగలేవు. వానికి అన్ననూ నేను- తల్లీ-తండ్రీకూడా నేనే. ఇదేదీ కాదనుకో. నేనొక మనుష్యుణ్ణయినా అవునంటావా! ఆ మనుష్యధర్మాన్నైనా నెరవేర్చాలా! ఇంతకాలం పోషించి-చివరికి తొందరపడ మంటావు. అయ్యో......ఆ పని......

భవాని : ఇంత దయాదాక్షిణ్యాలుండే మీకు యీ సంతాన మెందుకుకలిగిందా అని నా దుఃఖం!

గోవింద : మరలా అదేకథ ఎత్తుతావు. నే నా తమ్ముని ముఖంచూసి యీ విషయ మెలా చెప్పను?

భవాని : ఎలా చెప్పను! తక్కినవిషయాల్లో చెప్పడంలేదూ! ఇంటికి పెద్దవారైన మీరు చెప్పకపోతే - ఎవరు చెప్తారు? తమ్ముణ్ని గురించి-ఇంత బాధపడే మీకు- మీరు కన్నుమూస్తే మీ బిడ్డలగతేమవుతుందీ అని తట్టడమేలేదు-ఎందుచేతనో! మన మిలా యిల్లుగుల్ల చేసుకుంటే వాళ్ళు వీధిలో బిచ్చమెత్తవలసిందేగదూ!

గోవింద : నేను లేకపోతే వాళ్ళపాలిట దైవమున్నాడు. అయినా-వాళ్ళకోసం యిప్పుడే యింత బాధపడటం దేనికి? అది లేపటిపని.

భవాని : మీతో ఎవరు మాట్లాడుతారు? కడుపంతా కోసి చూపినా గారడీవిద్యలెగ్గొంటారు.

గోవింద : నీవు చెప్పినట్టుచేయడం యీవిషయంలో నాకు సాధ్యంకాదు చిన్నప్పటినుంచీ నీరుపోసి పెంచినతీగెను త్రిప్పివేసి- యెక్కడికో మళ్ళించమంటావు!

భవాని : నిజమే. తీగ పెద్దదైనతర్వాత - త్రిప్పి మళ్ళించకపోతే-అసలు తీగే పాడయిపోతుంది.

గోవింద : నీ వింత కఠినంగా మాట్లాడుతావనుకోలేదు. ఏదైనా మాట చెబితే వివేకముండాలి.

భవాని : నా జ్ఞానం కట్టుకొని యేంచేస్తారులెండి! ఇప్పుడు చేయవలసినపనేదో చూడండి.

గోవింద : జ్ఞానంకథ వదలుదాములే. వాణ్ని సుమారిరవై యేండ్లు నీవు కన్నకుమారునివలె పోషించావు. అలాంటి

వాణ్ని-నేడు వెళ్ళిపొమ్మనడం అకార్యంగా తోచడం లేదూ నీకు? ఆమాత్రం హృదయంలేదూ!

భవాని : (కండ్లనిండా నీరు తెచ్చుకుంటుంది) నిజమే. హృదయంలేకనే యిన్ని బాధలూ పడుతున్నాను. ఇంట్లోని నరకయాతన మీ కేం తెలుస్తుంది? హృదయంలేకనే మీ అందరికీ-అన్నం-నీళ్లూ విచారిస్తున్నాను కాబోలు! ఎవరికోస మిదంతా చేయడం? నా మరది యిల్లువిడిచిపోతే-నే ననుభవించే బాధ మీ కేం తెలుస్తుంది? పెంచినప్రేమ పెంచినవారికే తెలుస్తుంది. ఏమో దయాదాక్షిణ్యము న్నట్లు మాట్లాడుతారు.

గోవింద : (రెప్పవేయకుండా చూస్తూ) మరి యింతకష్టపడి-వానికోసం యింతబాధపడుతున్న నీ వీనాడు వాణ్ణెలా యిల్లువదలిపొమ్మనడానికి సాహసిస్తున్నావు?

భవాని : మీరూ ఒక ఆడపుట్టువుపుట్టి-నలుగురుపిల్లల్ని కని 'అమ్మ' అనిపించుకుంటే తెలిసివుండేది. ఇప్పు డెలా తెలుస్తుంది. చిన్నప్పటినుంచీ నేను పెంచిన మరది-ఇల్లు విడిస్తే-భగవంతా......! ఆ బాధ......నేను పడేబాధ మీ కేం తెలుస్తుంది?

గోవింద : నీ పిచ్చి నా కర్థంకావడంలేదు. ఒకదానితో ఒకటి సంబంధంలేకుండా మాట్లాడుతున్నావు. అన్నీ సరిపోతా యిలే! కొంతకాల మోపికపట్టు!

భవాని : ఏమీ సరిపోవు. అతనితో మీరే చెప్పండి. ఆపని

కూడా నేనే చెయ్యాలని మీ అభిప్రాయం గాబోలు! ఆ పాపంకూడా నా నెత్తినే పడెయ్యాలని మీ కోరిక.

గోవింద : నే నీ జన్మలో చెప్పను. నీవూ చెప్పరాదని నా కోరిక. దైవాన్ని మనసులో పెట్టకొని-నీ వీ విషయం చెప్పరాదు.

భవాని : నేను చెప్పితీరతాను. నే నొక తల్లిననేవిషయం మీకు తెలిసినవిషయమే. తండ్రిఅనేబాధ్యతను గమనించని మీవంటి తండ్రిగలబిడ్డలకు నేను తల్లిని. నాకు నా మరదిపై - ఎంతో ప్రేమవుంది. మీకున్నదానికంటే యెక్కువే ఉంది. కాని- నేను చెప్పితీరవలసియేవచ్చింది.

[కన్నీరు తుడుచుకుంటుంది. ఇంతలో వేణు ప్రవేశిస్తాడు. శరీరం అలసిపోయింది. ముఖంపై కవిసికొన్న విషాదరేఖలు. గాని-ఆ యువకుని వాలకం యేదో ఒక స్థిరనిశ్చయానికి వచ్చినట్టు కనబడుతుంది.]

వేణు. (భవానివైపు చూస్తూ) వదినా! నన్ను నీవు పిలిచావా? ఏమిటి? ఏం జరిగింది?

భవాని : నిజమే, పిలిచాను, కాని-ఆ పని అయిపోయింది లే! నీవు పోయిన కార్యం?

గోవింద : ఆపని యేమయ్యిందేమిటి? కాయా-పండా?

వేణు : ఏముంది! దినమూ అయినట్టే నేడూ అయ్యింది.

గోవింద : కమీషన రేమన్నాడు? స్పష్టంగా చెప్పు.

వేణు : అనడాని కేముంది? ఉద్యోగమివ్వటానికి వీల్లేదన్నాడు.

గోవింద : బాగానేవుంది. ఇదీ యిలా తెల్లవారిందన్న మాట. ఆ కమీషనరు ఎన్ని ఆశలు చెప్పాడు. ఇతరులదుఃఖం యీ ఉద్యోగస్థుల కేమాత్రం తెలియదు.

భవాని : సరి నడచివచ్చావు పాపం! ఇంట్లోకి వెళ్ళి-కావలి సిందేమైనా తిను.

వేణు : నా కేమీ వద్దు వదినా! ఆకలిలేదు. రమణి-రాముడు ఎక్కడికెళ్ళారు?

గోవింద : ఎక్కడో ఆడుకోవడానికి వెళ్ళిఉంటారు. (కొంచెం నిదానించి) ఊ! ఇంకా చూద్దాంలే. నీవుమాత్రం నిరాశ పడవద్దు.

వేణు : అన్నా! నీ వింక యెక్కడికీ తిరుగవద్దు. నే నింక యీ యింట్లో ఉండదలచ లేదు

గోవింద : అయితే......

వేణు : నే నిక్కడినుంచీ ఎక్కడికైనా వెళ్ళిపోతాను.

గోవింద : (తా నేది వింటాననుకున్నాడో-అదే విన్నట్టు వేదననటిస్తూ) ఏమిటీ! ఎక్కడికెళతావురా-యీ చోటు వదలితే మరి ఆశ్రయం?

వేణు : ఎక్కడికో వెళ్ళిపోతాను. అంతేగాని, యిక్కడ వుండను.

భవాని : (ఇంతవరకూ వింటూన్న భవాని చకితురాలా తుంది.) వేణూ! యీ మాటలు ఆలోచించి అంటున్నావా-లేక ఆలోచించక అంటున్నావా ?

వేణు : బాగా ఆలోచించే అంటున్నాను వదినా! ఈవిష యాన్ని గురించి నేను చాలారోజు లాలోచించాను. ఈనాటికి తీర్మానానికివచ్చాను.

భవాని : తీర్మానానికి కారణం?

వేణు : నేను ప్రేమించేవాండ్లకు - నే నొక భారంగావుండ దలచలేదు. పెద్దలు గమనించకపోతే పిల్లలైనా జాగ్రత్త వడాలిగదా!

గోవింద : మాకు నీవు భారమైనావని యెవరన్నారు?

వేణు : అన్నా! నాపై నీ కెక్కువ ప్రేమ. అందువల్ల - అలా నీ వనవు. కాని, నాకు తెలీదాయేమిటి? నే నీ కుటుం బానికి భారంకాదూ? ఈ భారంతో-యీయిల్లు క్రుంగిపో తూన్నట్లు నాకు తోస్తుంది. నీసంతానంయొక్క క్షేమా నికి-ఖర్చుపెట్టవలసినభాగాన్ని-నే నన్నాళ్ళూ బలవంతంగా లాగికొని అనుభవించాను. ఇంకైనా నేను గమనించక పోతే ఎట్లా? నా జవాబ్దారితో మీారు మీాసంతానంవిష యంలో-తల్లిదండ్రులబాధ్యతలను నెరవేర్చడంలేదు.

భవాని : ఓహో! వేణూ! (కన్నీటితో) నిన్ను నేను చిన్న వ్పటినుంచీ పెంచాను. దాన్నెలా మరచిపోతాను?

వేణు : వదినా! నే నిన్నిరోజులూ-అన్యాయంచేస్తూన్నాను. రాముడు-రమణి-తంగప్ప-గోపీ, వీళ్ళక్షేమం నేను గమ నించవలసివుంది. కాని-యిన్నిరోజులు-నే నా కసిగందు లకు ద్రోహంచేస్తూ బ్రదికాను. ఇక- అలావుండను. నే నెక్కడికైనా పోయి-ఎలానో జీవిస్తాను.

గోవింద : భవానీ!...వేణూ...

వేణు : అన్నా! నీవేమీ మనస్సులో వేదనపెట్టుకోవద్దు. ప్రపంచమే వేదనామయం. అనుక్షణం యేడ్వవలసిన దృశ్యాలెన్నైనా యీ ప్రపంచంలో వున్నాయి. ఆ దుఃఖంతో ఎందరో నశిస్తారు. వారు నశించవలసిందే. ఆ నశించడం- నేరొకరు సుఖంగా బ్రతకడానికే. అనేకులు నశించకుండా ఉండటానికి- ఒకడు నశించడం మేలు.

భవాని : వేణూ! నా కొక్కడే ఒక్కకొడుకున్నాడు. 'అమ్మా'అని పిలిచే ఒక్కగానొక్క కొడుకు.

వేణు : కన్నతల్లికి తనకొడుకుదుఃఖమే తెలుస్తుంది వదినా! ఇతరదుఃఖాలన్నీ తెలిసినవాడు ఒక్కడే ఒకడు. కాని- అతడుగూడా చూస్తే-ఒకరీతిగా అమ్మనంటివాడే. నీ విక దుఃఖించకు.

భవాని : వేణూ! నేను దుఃఖించకుండావుండాలంటే - నీ విల్లువిడిచి పోరాదు.

గోవింద : ఎక్కడికి పోవడం-ఏమిటి చెయ్యడం, అనే ఆలోచన యేమీలేకుండా-నీ విల్లువదలడం యేమీ బాగాలేదు వేణూ! వృథాగా కష్టపడతావు. నీ కెవరూ ఆశ్రయమివ్వకపోతే?

వేణు : ఇవ్వకపోతే నశిస్తాను. నశింపవలె. నేనునశిస్తే- యితరులను నశింపజేసే కారణంమాత్రం నశించినట్లు అంతే గదూ!

గోవింద : తమ్ముడూ! నీపై యెన్నో ఆశలుపెట్టుకొని-యిన్ని రోజులు గడిపాను. నీవు వెళ్ళిపోతే......

వేణు : ఏమీ నష్టంలేదు. నీ ఆశలకు వారసులుగా నీ సంతానం వుంది.

భవాని : అయితే ఎప్పుడు వెళతావు?

వేణు : ఇప్పుడే. పిల్లలను ఒక్కసారి చూచిపోతాను.

[దూరాన శబ్దం. రాముడు-రమణి మాట్లాడుకుంటూ యింటికి వస్తూవుంటారు.]

రాముడు : అయితే యింత ఆలస్యమెందుకుచేశావు?

రమణి : నేనొక తెనేనాయేమిటి? నీవుకూడా ఆలస్యంచేశావు. మరి నన్నెందుకు దండించటం?

[వేణు యిద్దరినీ కౌగిలించుకుంటాడు.]

వేణు : తొందరగావచ్చింది చిన్నాయన. మీరాలస్యంగా వచ్చారు. అంతేకదూ. నా మాట నిజంకాకపోతే అమ్మ నడగండి.

పిల్లలు : నిజమేనా అమ్మా?

భవాని : నిజమే.

వేణు : తొందరగా వచ్చినవారు తొందరగా వెళ్ళిపోవాలి. ఆలస్యంగావచ్చినవారు ఆలస్యంచేయవచ్చు.

రాముడు : (వేణుమెడకు తన రెండుచేతులనుచుట్టి వ్రేలాడుతూ) చిన్నాయన యెక్కడికో వెళ్ళిపోవడానికి సాకు వెదకినట్టుంది.

రమణి : నూరు బింగిళ్ళుతియ్యడానికి.

వేణు : బింగిళ్ళుతీసినతర్వాత పోవచ్చునన్నమాట.

గోవింద : (కన్నీరు తుడుచుకుంటాడు.)

భవాని : (కలిగినవేదనను అణచికొని, గంభీరంగా నిలబడుతుంది.)

[వేణు బింగిళ్ళుతియ్యడానికి మొదలుపెట్టుతాడు. భవానికండ్లలోనీరు మెదులుతుంది. బింగిళ్ళుపెట్టి వేణు ప్రయాణమవుతాడు. పిల్లలు గట్టిగా యేడుస్తారు]

[ తెరపడుతుంది. ]

తాజ్‌మహలు

ర చ యి త :

"మలయాట్టూర్ రామకృష్ణన్"

కథాకారుడుగా ఇతడు ప్రసిద్ధుడు. కొన్ని యేకాంకికలు - రేడియోనాటకాలుగూడా వ్రాసినాడు. గవర్నమెంటుసర్వీసులో మేజిస్ట్రేటుగా వున్నాడు. ఇప్పుడు కొచ్చిన్‌లో వుద్యోగము.

## పాత్రలు :

షాజహాన్

రహమాన్

హలీమా

అమ్మ

వృద్ధ స్త్రీ

పహారావాడు

# తాజ్ మహాలు

[శోకచ్ఛాయతోకూడిన ఒకరాగం-ఫిడిల్‌లో మ్రోగుతూంది.]

అనౌన్సరు : తాజమహాల్ రూపెత్తింది. పాటలొలుక బోస్తూండే యమునాతీరంలో-కవులహృదయం స్పందింపజేసే ఆ ప్రణయచిహ్నం నిర్మింపబడి, ఆకాశంలోకి తొంగిచూస్తూంది. మంటిపాలైన మనోహారి ముంతాజ్ కోసం షాజహాను నిర్మించిన ఆ చిహ్నం-చలువరాళ్ళతో చెక్కబడ్డ ఒక మహాకావ్యం.

[రోజూ సాయంకాలం చక్రవర్తి అక్కడికి వస్తాడు - ముంతాజు శాంతికోసం ప్రార్థించేందుకు]

[ఎఫెక్టు—మాట్లాడుతూన్నశబ్దం]

[చలువరాళ్ళపై పాపాసులు నడుస్తూన్నధ్వని. ఆ ధ్వని హఠాత్తుగా నిలిచిపోతుంది.]

[మంద్రంగా- ఆవేశభరితంగా వినపడుతూన్నధ్వని.]

“హలీమా! ఆనాడు నే నన్నమాట యీనాటికి నెరవేర్చుకున్నాను. నీ మృతదేహాన్ని కౌగిలించి, కన్నీటిధారలతో తడిపి-నేను చేసినవాగ్దానం ఈనాటికి రూపంధరించింది. ఇదిగో! నీకోసం నేను నిర్మించిన ప్రణయోపహారం-ప్రపంచం కనివినియెఱుగని అద్భుతమైన నిర్మాణం! అతిసుందరమైన నీ శరీరానికి యీనాడు- శయ్యగా వుంది.”

[ఎఫెక్టు, హఠాత్తుగా ఒరలోనుండి కత్తితీసినశబ్దం. తొందరగా నడుస్తూన్నధ్వని.]

షాజహాన్ : (ఉన్నట్టుండి) రహమాన్!

[ఎఫెక్టు—ఒకానొకడు కోపించి నడుస్తూన్నధ్వని]

రహామాన్! నీ వన్నదంతా నేను విన్నాను. ఇందులో ఏదో కుతంత్రముంది. నిన్ను నే నెంతో దయతో చూచాను.చలువరాళ్ళతో యీ సుందరస్వప్నాన్ని-నిర్మించిన నిన్ను నేను గౌరవించాను. నీవుకోరినట్లే ఈ మహాలుకు నిన్ను కావలివానిగా ఏర్పాటుచేశాను. ఇంత చేసినా-కడకు-నీవు నన్ను మోసంచేశావు. ఊ... చెప్పు ...ఎవ రా హాలీమా...

రహా : షాహుషా! ఆమె నా హృదయాని స్వాధీనంచేసుకున్న ఒక దేవత. ఆవిడ ఇక్కడ విశ్రమిస్తూంది.

షాజ : అయితే, నిన్ను నేను ప్రేమించినందుకు నాకుగలిగిన ఫలమేమిటి? నన్ను మోసగించావన్నమాట. నా ముంతాజుస్థానంలో - నీ హాలీమాను ప్రతిష్ఠించావు. ఇంతే కదూ!. ఈ అపరాధం ఓర్వడానికి వీల్లేదు. నిన్ను చంపివేస్తాను.

రహా : ప్రభూ! చావుకు నేను భయపడడంలేదు. హాలీమాకు ఒక మనోహర ప్రణయచిహ్నాన్ని నిర్మించడానికి నే నిన్ని రోజులు జీవించాను. ఆ పని నెరవేరింది.

షాజ : ఏమీ!

[ఎఫెక్టు—కత్తిపీచడం]

రహా : ఖుర్రం! నే నెవ్వరినో గుర్తుపట్టేవా? నేను నీకు అన్నను......ఖుస్రూ......

[ఎఫెక్టు, కత్తి క్రింద జారిపోయినధ్వని]

షాజ : ఏమిటీ! నా అన్నావా! ఖుర్రమ్! అప్పుడు......
అప్పుడు...తమరు మరణించలేదన్న మాట!...

రహ : లేదు అదొక పెద్ద గాథ ఖుర్రం! ఈ తాజమహలులో విశ్రమిస్తూండే హాలిమా-నీవు ప్రేమించిన ముంతాజుకంటె ఎంతో గొప్పది. ఆమె స్నేహము...ని నా మెకథ వినాలి. విను-ఆ దేహో న్నిచ్చట ప్రతిష్ఠించడంలో నేను నీకు ద్రోహం చెయ్యలేదని నీకే తెలుస్తుంది... నా యవ్వన కాలంలో-నే నెంత సంపన్నుడినో నీకు తెలిసిన విషయమే. అవునా, కాదా! సింహాసనానికి వారసుణ్ణయిన నా చుట్టూ, అమూల్యములైన సంపదలు - సేవలు చేయడానికి కాచుకొని వుండేవి. నా నోటినుండి ఏ ఆజ్ఞ వెలువడుతుందో!-అని- సైన్యాలు కాచుకునివుండేవి. నా ఆజ్ఞ వచ్చిందా-ఎంత కష్టమైనపనైనా సాధించితీరాలి సిందే. నా దర్శనానికి ఢిల్లీ ప్రజలు తండోపతండాలుగ వీధికిరువైపులా కాచి నిలబడేవారు. నా చుట్టూ నర్తనం చేస్తూండే వేలాది వేలసుందరులు- వా రెవ్వరనుకున్నావు? కాబూలునుండి తెచ్చిన సుందరాంగులు కాశ్మీరదేశ స్త్రీలు, పర్షియా, ఆఫ్ఘనిస్థానములనుండి యేరియేరి తెచ్చిన మంజులదేహాలు. వారు - అన్నిరీతులా నాకు వశులన్న మాట. నే నేమీ ప్రయత్నించకుండానే - యువకుడనైన నా అనుగ్రహానికి-వారు కాచుకొనివుండేవారు. కాని..నే నా పని చేయలేదు. ఇంద్రియాలపై నాకుండే అధికారం జహాంగీరుచక్రవర్తి నెన్నోసార్లు ఆశ్చర్యచకితుణ్ణిచేసింది.

ఒకసాయంకాలం–నేను–నా మాతృదేవిని దర్శించడానికి అంతఃపురంలోకి వెళ్ళాను. అంతఃపురంలో ఎవరో పాడుతున్నారు. ఆ సుందరగానం నన్ను అద్భుతపరవశుణ్ణి చేసింది.

[ ఎఫెక్ట్ - గానం ]

హాలీమా – నా తల్లికి పాటపాడి వినిపిస్తూంది. ఆమె సంగీతం ఎంత మనోరంజకమో – ఆమెసౌందర్యంకూడా అంత మనోహరంగావుంది. నన్నుచూస్తూనే ఆవిడ పాట ఆపి లేచింది. వెంటనే అమ్మ ఆవిడతో

[ ఫ్లా ష్ బా క్ ]

అమ్మ : హాలీమా! ఇక పోయిరా!

రహా : ఎవరమ్మా ఆమె?

అమ్మ : ఎవరైతేనేమి?

రహా : నేను తెలుసుకోవాలి. చెబుదూ!

అమ్మ : ఊ!...అది ఒకదాసి. దాన్నిగురించి ఇంత అడుగుతున్నావేమిటి?

......ఆమెనుగురించి – నా హృదయంలో కలిగిన కౌతుకం క్రమంగా – ప్రేమగా మారింది. నేను హాలీమాను కలుసుకున్నాను. మరల ఎన్నోసార్లు కలుసుకున్నాను. ఆ కాల మెంతో మధురంగా సాగిపోయింది. హృదయాన్ని తాకే మా ప్రణయరంగాలెన్నిటికో-అంతఃపురోద్యానం సాక్షీఅయ్యింది. అది ఒక పున్నమ. అంతఃపురోద్యానంలో – ఆమెతొడపైన తలపెట్టుకొని – అలా ఒరిగాను.

[ఫ్లాష్ బ్యాక్]

రహ : హాలీమా!

హాలీమా : ఊఁ...

రహ : మనజీవితా లెప్పుడూ యిలాగే గడిచిపోతే?

హాలీమా : అది సాధ్యమా–అని ?

రహ : సాధ్యమైతే!

హాలీమా : అయితే?

రహ : నేను నీతోకూడా ఒక సామాన్యమైన జీవితం గడుపుతాను.

హాలీమా : బాగా నేవుంది. ఢిల్లీ చక్రవర్తి కావలసిన తరుణు..

రహ : ఏమి? నడుమునే సలిపావు. వాక్యం పూర్తిచేయి.

హాలీమా : ఏదో ఆలోచనతట్టింది నడుమ......

రహ : ఏమిటా ఆలోచన?

హాలీమా : మన యీ మధురస్వప్నం ఎలా ముగియబోతుందోనని ఆలోచిస్తున్నాను. ఈ సంగీతం నిలిచిపోతుంది. నాకు బాగా తెలుసు. నే నొక పిచ్చిదాన్నిగా వ్యవహరిస్తున్నాను. రేపు–యీ అఖండసామ్రాజ్యానికి చక్రవర్తి కాబోయే మీ ప్రణయభిక్ష కోరడానికి—ఒక సామాన్య దాసినైన నాకు ఏమి అర్హతవుంది?

రహ : అయితే నీ సందేహమేమిటని?

హాలీమా : ఏమీలేదు గాని...కాని...మీకు రాజకుమారులు ఏవిషయంకూడా మీకు సొంతంగా నిర్ణయించుకునేఅధికారం లేదు.

రహ : హాలీమా! నీ వింకా నన్ను పూర్తిగా అర్థంచేసుకున్నట్లులేదు. లోకాన్నంతా సంక్షోభసముద్రంలో ముం

చెత్తూంటే యీ వెన్నెలతోడు. ఒకమాట చెబుతున్నాను విను. కాంతిపుంజమైన కోహినూరురత్నము-మయూరసింహాసనము నీ ప్రణయానికిముందు-గడ్డిపోచకు సమానాలు. నేను నీకుకట్టిన వెల నీకు తెలియదు. ఈ అనర్ఘ రాజభోగాలకంటె అనంతమైన వెలను నేను నా మనస్సులో నీకిచ్చుకున్నాను. హాలీమా! యీ గానం నిలువదు. ఈ స్వప్నం ముగియదు.

...... ...... ......

యీ ప్రణయనాటకం చాలారోజులు రహస్యంగానే వుండడం నా కిష్టంలేకపోయింది. ఆ స్నేహమూర్తి హాలీమా-ప్రత్యక్షంగా నావస్తువైపోవాలని తీర్మానించుకున్నాను. ఒకనాడు మా అమ్మతో అన్నాను.

[ఫ్లాష్ బాక్]

రహ : అమ్మా! నే నొకవిషయం నీతో చెబుదామని వచ్చాను. దాన్ని విని- నీ వేమీ బాధపడకుండావుంటే- తొందరగా- నిశ్చయానికివచ్చేస్తా ననుకున్నాను.

అమ్మ : ఏమిటడ? నా మనస్సును క్షోభింపచేసేవార్త!

రహ : నేను...హాలీమాను...ప్రేమిస్తున్నాను.

అమ్మ : ఏమీ!

రహ : అవునమ్మా! ఆవిడ నా జీవితాని కధీశ్వరి. ఖండితంగా చెబుతున్నాను. నా కామెతో వివాహంచేయాలి.

అమ్మ : నీకు పిచ్చిపట్టింది!

రహ : లేదు. బాగా ఆలోచించే యీ తీర్మానానికివచ్చాను.

అమ్మ : నీకు సిగ్గులేదూ! నాకడుపున పుట్టి యీ పాడు

మాట లంటావా! ఒక రాజపుత్రస్త్రీనైన నా పాలు త్రాగి-పెరిగిన కుమారుడే గా యీ మాటలంటున్నది?

రహ : నేను-మాటయిచ్చాను అమ్మా! మేమిద్దరము యింతకు ముందే ఒకనిశ్చయానికివచ్చాము.

అమ్మ : అఖండ సామ్రాజ్యం పరిపాలించవలసిన నీవు- ఒక బిచ్చగత్తెను పెండ్లాడుతావన్న మాట!......ఇదంతా ఆ దాసీముండ చేసినపని. ఎవ రక్కడ? ఆ హాలీమా నిట్లా పిలు.

[హాలీమా ప్రవేశిస్తుంది.]

హాలీమా : బేగం!

అమ్మ : మర్మాన్గురాలా! ఏదో మోసంచేసి రాకుమారుణ్ణి లోబరుచుకున్నావు!

[కొట్టిన శబ్దం]

రహ : అమ్మా!

అమ్మ : ఇక నీవు వెళ్ళు. నేను నీముఖం చూడను. దొంగ ముండ!

[హాలీమా వెళ్ళిపోతుంది]

రహమాన్ : అమ్మా!

అమ్మ : నీ వేమీ మాట్లాడడానికి వీల్లేదు. అఖండసామ్రాజ్యాన్ని భరించబోతూన్న రాజకుమారునివి నీవు - తెలిసిందా?

♦ ♦ ♦

నా హృదయం దుఃఖంతో ప్రేలిపోయినట్లైంది. నేను హాలీమాను వివాహంచేసుకోకుండానే-ఆమెను నా జీవితమంతా అనుభవింపవచ్చు. కాని-అది నా కిష్టంలేదు. నా ప్రణయగాథ తండ్రిగారికి తెలిసింది. అగ్గివలెమండినాడు.

నాపై ఎన్నో తర్జనభర్జనలు చేశాడు. కాని—అవేవీ నా నిశ్చయాన్ని మార్చలేదు. కాలం గడిచింది. నా తల్లి మరణించింది. నాకు చెడ్డరోజు లారంభమయ్యాయి. నూర్జహాన్ యొక్క యింద్రజాలం మధ్యాహ్నసూర్యునిపలె వెలుగుతూన్న రోజులవి. జహాంగీరుచక్రవర్తి ఆమెచేతిలో కీలుబొమ్మ. ఎలా చెబితే అలా చేస్తాడు. ఆమెకంటికి నేనొక కంటకంగా కనబడ్డాను ఆమెసంతానానికి రాజ్యాధికారం రావాలంటే, నన్ను తొలగించుకోవాలి. నాపైన ఒక అపరాధం మోపబడ్డది, ఒకానొకరోజున దర్బారులో.

[ఫ్లాష్‌బాక్]

[ఎఫెక్ట్, కాహళధ్వని, 'జహంగీరుబాదుషా జిందాబాద్' అనే ధ్వనులు.]

జహాం : ఈ ఖుర్రమ్ ద్రోహి. నా అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి ప్రయత్నించాడు. సైన్యాలు తయారుచేసి కొని- సింహాసనం లేవదీయడానికి యత్నించాడు. ఈ వార్తలన్నీ నిజమేనని నమ్మడానికి కావలిసిన బలవత్తరమైన సాక్ష్యాలు మాకు లభించాయి.

[ఎఫెక్ట్-సదస్యులతో గునగునధ్వనులు]

రాజదండము ను ధరించిన మేము-ఖుర్రమ్ రాజద్రోహి యని తీర్మానిస్తూన్నాము. వాని స్థానమానములన్నీ యీనాటితో తీసివేయబడ్డవి. ఈనాటినుండి ఖుర్రమ్‌కు కారాగారశిక్ష విధింపబడ్డది.

... ... ...

—నేను నిర్దోషినని స్థాపించుకోవడానికి చేసే యే

వాదనను గాని వినడానికి జహాంగీరు తయారుగా లేదు. నవ రత్నసింహాసనము నధివసించి, రాజ్యం పరిపాలింపవలసిన నేను కారాగారంలో త్రోయబడ్డాను.

నా జీవితసూర్యుడు అస్తమించే కాలం ఆసన్నమైన ట్లుగా తోచింది. ఆ కారాగారవాసానికంటె మరణిం చడమే మేలనుకున్నాను. కాని-దైవం నా మరణానికి సమ్మ తించలేదు. హాలీమారూపం నా కన్నులయెదుట ఒక దివ్యనక్షత్రంలాగా ప్రకాశిస్తూవుంది. ఒకప్రభాతంలో...

[ఫ్లాష్‌బాక్]

[ఎఫెక్టు- కోడికూస్తుంది. హలీమా కారాగారపుమెట్లెక్కుతూన్న శబ్దం]

హాలీమా : నాథా!

రహా : హాలీమా! నా హాలీమా! ఎలా వచ్చావిక్కడికి? ఇది ఆగ్రాజైలు-తెలిసిందా! ఇక్కడికి రావడానికి నీ కెలా సాధ్యమయ్యింది?

హాలీమా: అదృష్టవంచితుడవైన నా స్వామీ! చెబుతా విను. ఈ జైలుఅధికారి యింటిలో నేను పనిచేస్తున్నాను. అతడు నాపై కరుణించాడు.

రహా : నీవు నాదగ్గరుంటే-యీ కటిక రాళ్ళల్లోగూడా నేను స్వర్గం నిర్మించుకుంటాను. ఇక నీవు నన్ను వదలిపోవు కదూ?

హాలీమా : స్వామీ ! ఎవరపకారంచేసినా - దైవంమాత్రం మనల్ని మరచిపోలేదు. వానిదయ మనపైన వుంది. ఇక ప్రతిరోజూ-నేను తమవద్దకు వస్తూ-పోతూవుండవచ్చు.

రహా : అదెలా సాధ్యపడుతుంది?

హాలీమా : తమకు దినమూ ఆహారం తెచ్చిపెట్టేపని - ఈ అధికారి నా కప్పగించాడు.

[ఎఫెక్టు - పక్షులశబ్దం]

మనమూ పక్షులమైతే యెంత బాగుండేది! స్వేచ్ఛగా పాడుకుంటూ-ఆకాశంలో సంచరించేవాళ్ళం.

హాలీమా : ఇదంతా మనదుర్విధి. నాకోసమై తమరు- యీ హిందూస్థానానానికి భావిచక్రవర్తిగావుండవలసిన తమరు యీ మహాసంకట మనుభవిస్తున్నారు.

రహ : పిచ్చిదానివి హాలీమా! నీవులేని మయూరసింహాసనం కంటే-నీవు దగ్గరగావున్న యీ కారాగార జీవితమే హాయిగావుంది. నే నొక బిచ్చగాడనై పుట్టివుంటే యీ బాధలు లేకుండావుండేవి.

హాలీమా : తమ రలా అనరాదు.

రహ : నే నొక రాజకుమారుడను గాబట్టేగదా-నిన్ను స్వేచ్ఛగా ఆలింగనంచేసుకోవడాని కిన్ని నిర్బంధాలూ నిషేధాలూ.........

హాలీమా : స్వామీ! త్వరలో మంచికాలం రాబోతున్నది. మీకు రాజ్యంపైన అభిలాషలేదని తెలిస్తే ఆమె మిమ్మల్ని త్వరలో కారాగారవిముక్తుణ్ణి చేస్తుంది.

...... ...... ......

అలా కొన్నిదినాలు గడిచాయి. హాలీమా రోజూ వస్తుంది. నేను ఆవిడవచ్చేవేళకు -కారాగృహంలోవున్న యినుపకటకటాలకు వెనుక నిలబడతాను. ఆవిడ - నా ముందు కటకటాలకావల నిలుస్తుంది. మేమిద్దరమూ -

గతించిపోయిన రమ్యానుభవాలనుగూర్చి తలపోసుకుంటాము...ఒకానొక ఎన్నోహార సుప్రభాతాని కెదురుచూస్తూండే మన్మల్ని విధి కలవరపరచింది. ఒకసుప్రభాతానికిబదులు భయంకరమైన సుడిగాలి వీచింది. ఒకనాడు చెరసాలవాకిండ్లు తెరువబడ్డాయి. హాలీమాముఖంపైన యేవో దుఃఖరేఖ లలముకున్నాయి. ఆనా డామెతో పాటు చెరసాలఅరకారిగూడా వున్నాడు.

[ఎఫెక్ట్- చెరసాలవాకిండ్లు తెరువబడ్డవి.]

నేను ఆశ్చర్యపడ్డాను. ఈనా డీ వాకిండ్లు తెరువబడడానికి కారణం? ఎదురుచూస్తూవున్న అదృష్టదివసం వచ్చిందా ఏమి? నేను హాలీమా ముఖంవైపు చూచాను. ఆ ముఖం మ్లానమైవుంది. ఆ కన్నులలో బాష్పాలు...

రహా : హాలీమా! ఎందు కలా దుఃఖిస్తున్నావు? నీ ఆలోచనేమిటి?

హాలీమా : ఏమీలేదు...ఏమీలేదు.

రహా : నాతో చెప్పవన్న మాట.

హాలీమా : (బలవంతంగా నవ్వుతెచ్చుకొని నవ్వుతుంది. నేనేడ్వటంలేదు ప్రభూ! నాకన్నుల్లో నిలిచినవి దుఃఖబాష్పాలు గావు, ఆనందబాష్పాలు.

రహా : హాలీమా! నన్నీనాడు చెరసాలనుండి విడిపిస్తారన్నమాట ?

హాలీమా : ఖండితంగా...ఇదిగో, నేను తమకు కొన్ని ఫలహారాలు తెచ్చాను అద్భుతమైన ఫలహారాలు.

* * * *

సంతోషంగా నే నవి తిన్నాను. నా శరీరం నాకు స్వాధీ నంతప్పింది. నాకన్నుల్లో ఏవో తిన్నని సుబ్బులు మూసు కొనివస్తూన్నట్లు భావించాను. నా యెదుటనేవున్న హాలీమూరూపం నాకు స్పష్టంగా కనపడటంలేదు. నే నామెను పిలవాలనుకున్నాను. కాని – అప్పటికే నాకు స్పృహతప్పిపోయింది.

నేను కళ్ళుతెరిచేవేళకు సాయంకాలమయ్యింది. ఒకా నొక చిన్నయింటిలో మంచంపైని పడుకొనివున్నాను. ఎదుట ఒక ముసలావిడ నిలబడివుంది.

[ఫ్లాష్‌బాక్]

—నే నెక్కడున్నాను? మీా రెవ్వరు?

వృద్ధ : అలా కల్లోలపడకండి. తమకివ్వవలసిన ఒక జాబు నావద్ద వుంది.

రహ : ఆ జా బెవ్వరు వ్రాశారు? నా హాలీమూ యేదీ?

వృద్ధ : ఆవిడవ్రాసిందే యీా జాబు.

[ఎఫెక్ట్- జాబుతెరచినశబ్దం. ఆ జాబు స్త్రీకంఠంతో చదవాలి]

"స్వామీా!

తమరు కళ్ళుతెరచేవేళకు నేనీ లోకంవదలి వెళ్ళిపోయి వుంటాను. ఈ యభాగ్యురాలిని ప్రేమించినందుకు ప్రతి ఫలంగా తమకు సింహాసనం తప్పిపోయింది. ఎన్నడూ దుఃఖ మనుభవించియెరుగని తమకు కారాగృహవాసం సిద్ధించింది. ఈ అభాగ్యురాలైన హాలీమూ – తమజీవితమంతా కన్నీళ్ళ పాలుచేసింది. దుఃఖభూయిష్ఠమైన యీా ప్రపంచాన్ని వదలి

వెళ్ళిపోతున్నాను. ఒకముసలావిడ తమదగ్గరికి వస్తుంది. తమను తప్పించుకొనిపోవడానికి కావలసిన యేర్పాట్లన్నీ ఆమె చేసింది. తమరొక్క నిమిషంకూడా జాగుచేయరాదు. వెంటనే వెళ్ళిపోవాలి. మన ప్రణయనాటకములోని కడపటి రంగ మీ తటితో ముగిసిందన్నమాట ”

రహ : హాలీమా! హాలీమా!

వృద్ధ : రాజకుమారా ! గుఱ్ఱాలు తయారుగావున్నాయి, తమరు వెంటనే తయారుగావలె.

రహ : నా హాలీమానువిడిచి వెళ్ళడమా ! ఏమిజరిగిందో దయచేసి చెప్పండి. ఎవ్విక్కడికి కేవరు తెచ్చారు ?

వృద్ధ : కొందరుమిత్రులు తమరిని విడిపించడానికి ప్రయత్నించి యీ కార్యం చేశారు. నూర్జహాను కిదంతా తెలిసింది. తమరు జీవించడం ఆవిడ కిష్టంలేదు. ఈనాడు-యీ తెల్లవారి-ఆగ్రాకోటలో తమ్ము వధించడానికి కావలసిన యేర్పాట్లు నూర్జహాను చేసింది. హాలీమా యీ విషయ మెల్లాగో పసిగట్టింది. ఆవిడ-ఫలహారాలలో మత్తుమందు చల్లుకొని తెచ్చింది. తమరు స్మృతితప్పిపోయినప్పుడు మీ వస్త్రము లామెధరించి-మీకు బదులుగా చెరసాలలోవుంది ......పాపం! ఇప్పటి కామెను వారు వధించివుంటారు. తమరు తొందరగా బయలు దేరాలి. ఆకాశంలో మేఘాలు ముంచుకువస్తున్నాయి. వానరావటానికిముందే బయలు దేరాలి. ♦ ♦ ♦

గుఱ్ఱంపైన కూర్చొని - నే నొక పిచ్చివానివలె - దానిని తరిమాను. వాన జోరుగా కురుస్తూంది. ఝంఝూవా

తం వీస్తూంది. నా ప్రణయినీ ప్రాణం కాపాడాలి. నేను చెరసాలలోని కురికాను. నాజీవితంలో ఎంతో మర్మ భేదకాలైన ఆ నిమిషాలను నేను మరువలేను. దూరంలో - అస్పష్టంగా - ఆంలకపురోద్యానం కనపడుతూవుంది. ఆ వుద్యానవనంలోనే - హాలీమా అనేక స్వర్గఖండాలను నాకోసం సృష్టించియిచ్చింది. నేడందులోనే మృత్యుముఖాన్ని చూడబోతూవుంది. ఆమెను రక్షించాలి. అది సాధ్యంకాకుంటే, హాలీమాతోనే మరణించాలి. నే నక్కడికి చేరే వేళకే.

[ఎఫెక్ట్ - ఫిరంగిశబ్దం]

ఆగ్రాకోటలోనుండి ఫిరంగిశబ్దం వినవచ్చింది. నేను - వెక్కి వెక్కి యేడ్చాను. ఆ దుర్మార్గులామెను చంపివేశారు. దుఃఖంతో నా హృదయం క్రుంగిపోయింది. ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను, కాని - అందుకు ప్రయత్నించడానికిముందే నాకు స్పృహతప్పింది మరలా నాకు స్పృహవచ్చింది. ఒకదినమంతా మూర్ఛలోనే వున్నాను. నాకు తెలివివచ్చినప్పుడు మరొక్క ఆలోచన నా తలలో మెదలింది. నా ప్రేమకోసం త్యాగంచేసిన ఆ హాలీమాకు మనోహరమైన స్మారకచిహ్నం నిర్మించాలనుకున్నాను. అందుకోసం జీవించాలనుకున్నాను. మారువేషంతో నేను కోటలో ప్రవేశించాను. రహస్యంగా - నేను - చెరసాల అధికారిని కలుసుకున్నాను. అతడు దుఃఖంతో కన్నీరుపెట్టాడు.

[ఫ్లాష్‌బాక్]

రహ : నా హాలీమాశరీర మెక్కడుంది? నేను దానిని చూడాలి.

అధికారి : సరే.

రహ : నా కొక ఉపకారంచేస్తావా?

అధి : ఏమది?

రహ : ఈ శరీరాన్ని యిక్కడే ఒకచోట భద్రంగాపెట్టి పోతాను. ఈ ప్రేమమూర్తికి- ఒకానొక జ్ఞాపకచిహ్నం నిర్మిస్తాను. అది పూర్తిఅయ్యేవరకూ – దయతో – యీ దేహాన్ని నీవు రక్షించవలసివుంటుంది.

అధి : తమరు ఉన్మాదులయినట్లున్నారు.

రహ : కాదు కాదు. నా జీవితము-తీరనికోరికల ఒకవట్టికలా అయిపోయింది. అయినా ఒకవిషయం మాత్రం చెబుతాను మా ప్రణయం చాలా పవిత్రమయినది. ఈ నాడు నే నొక ఆశ్రయంలేని బిచ్చగాడనే, కాని- నా జీవితంలో యీమె కొక మహత్తరప్రణయచిహ్నం నిర్మించి తీరుతాను.

* * * *

—ఖుర్రం! ప్రతిజ్ఞ నేటికి నెరవేర్చాను. నా ప్రణయమూర్తియైన హాలీమా నిద్రించడానికి ఒక సుందరమైన కట్టడం కట్టాను. ఇప్పుడు నేను నీకుచేసిన ద్రోహమేమిటో చెప్పు...

షాజ : రహమాన్! నిజము. నీవు నా కేమీ ద్రోహం చేయలేదు. నా ముంతాజ్‌మహాలుకంటె యెన్నోరెట్లు హాలీమా గొప్పది. సుఖాలలో-దివ్యస్వప్నాలలో మునిగి

వున్న నన్ను ముంతాజ్ ప్రేమించింది. హాలీమా దుఃఖములనువలచి నిన్ను ప్రేమించింది. ఆవిడకు స్మారకచిహ్నం నెలకొల్పడంలో ఎంతో న్యాయంవుంది. కాని.. రహమాన్! లోకంలోమాత్రం–ఇది ముంతాజ్ స్మారక చిహ్నంగానే నిలబడిపోవాలి. ఇందుకు నీవుసమ్మతించాలి.

రహ : నీ కా భయం అక్కరలేదు. ఈ రహస్యం నా హృదయంలోనే యిమిడిపోతుంది. చరిత్రలో నీ పేరు శాశ్వతంగా నిలిచిపోతుంది. నే నా బహుమతి కోరడంలేదు.

[తెరపడుతుంది]